# అవధాన చంద్రిక

## కడిమిళ్ళ శతావధానాలు

(12 శతావాధానాల సమాహారం)

ప్రచురణ

**అవధాన భారతి**

నర్సాపురం

*Avadhana Chandrika*

*Dr. Kadimilla*

*Copies 1000*



*Rs. 60/-*

*Copies can be had from*
**Kadimilla Ramesh**
Hamsavahana
Yarramillivari Street
NARSAPUR - 534 275, W.G.Dist., A.P
Tel.: 08814 - 274876
Cell.: 94401 48822

**Ch. Reddappa Dhaveji**
'Harivillu',
Roypeta, Narsapur - 534 275
Tel.: 08814 - 273699
Cell: 94401 26171

Published by
**AVADHANA BHARATHI**
Narsapur

Printed by
*Creative Services*
Opp. SBI, Steamer Road,
Narsapur - 534 275
Tel. 08814 - 273113

కృతం జానామి...

ఎంత మందిదో ఈ పుణ్యం
వారి సౌజన్యం అగణ్యం
అందరికీ కృతజ్ఞతలు
నేనివ్వగలిగే ఆమెతలు

- డా॥ కడిమిళ్ళ

# మాకు 'సై' అనేవాళ్ళెక్కువ

డా॥ అరిపిరాల

ఎంత కంప్యూటర్ యుగమైనా ప్రకృతిని జయించలేరనేది జగమెరిగిన సత్యం. శరీరంలో ఇంచుమించుగా అన్ని అవయవాల మార్పిడికి ప్రత్యామ్నాయాలున్నాయి. కాని మేథకు, మనస్సుకు ప్రత్యామ్నాయంలేదు. అవి వ్యక్తిగతాలే. వాటి అంచులు కొలిచేశక్తి ఏ పరికరానికి లేదు. ఇదే ప్రకతిగుణం. ప్రకృతి విజయం.

మానవ మేథకు మరో మచ్చు తునక అవధాన విద్య. ఆంధ్రులుగా గర్వించదగ్గ విద్య అవధానవిద్య. ఇది ఏ భాషాసాహిత్యాలలో లేదు. ద్విసహస్రావధానాలతో మేధకు ఒక కొలబద్ద రూపొందించారు పండిత కవులు. ఇప్పుడు పంచ సహస్రావధానాలతో మరో కొలబద్ధ నిరూపించడానికి ప్రయత్నాలు సాగుతున్నాయి.

80వ దశకంలో అవధాన విద్యకు కొంతమంది యువ అవధానులు శత సంఖ్యతో విజయ పతాకాలను రెపరెపలాడించారు, సాహితీ ప్రియులకు మురిపాలు పండించారు. డా॥ మేడసాని మోహన్, డా॥ మాడగుల నాగఫణిశర్మ, డా॥ కడిమిళ్ళ వరప్రసాద్ లాంటి అవధానులు 20వ శతాబ్దపు తొలి నాళ్ళలో ప్రఖ్యాతి పొందిన తిరుపతి వెంకట కవుల అవధాన విద్యను చిగురింపచేసారు. ఈ అవధానులలో డా॥ కడిమిళ్ళకు ఒక ప్రత్యేకత, విశిష్టత ఉంది.

రాష్ట్ర రాష్ట్రేతర ప్రాంతాలలో డా॥ కడిమిళ్ళ ఎన్నో అవధానాలు చేసారు. ముదావహం. కాని చిన్నలోట ఉండిపోయింది. అవి తాను ఉద్యోగం చేస్తున్న పట్టణంలో శతావధానం చేయక పోవడం, కాదు చేయించక పోవడం. ఈ లోటు భర్తీ చేయడానికి నరసాపురం ప్రముఖులు నడుంకట్టారు.

డా॥ కడిమిళ్ళ వారి అవధానం 2001 ఆగస్టు నెలలో పూర్తయ్యింది, కాని మరో కోరిక మిగిలిపోయింది. శతావధానాన్ని పుస్తకరూపంలో తీసుకు రావాలనే తలపు. అదొక్కటే సరిపోదు, ఆయన అవధానాలన్నీ ఇంచుమించుగా పుస్తకరూపంలో తీసికొనివస్తే ఎలా ఉంటుందోనని మహా ఆలోచనవచ్చింది. మాకు 'సై' అనే వాళ్ళెక్కువ. అంతే "ఇంతింతై వటుడింతయై అన్నట్లు 'అవధాన భారతి' తరపున వేసే డా॥ కడిమిళ్ళ అవధాన పద్యాలన్నీ వెలుతురు పిట్టల్లా ఒకచోట చేరాయి.

అవధానం నిర్వహించడంలో గల కృషినంతటినీ మాటల్లో చదివి 'భేష్' అనిపించ వచ్చును కాని చేతల్లో ఎంత కష్టసాధ్యమో నిర్వహించిన వారికే తెలుస్తుంది. కార్యక్రమాన్ని రూపొందించడంలో, నిర్వహించడంలో ఎంతోమంది అహర్నిశలు కృషిచేసారు. 'తాజ్‌మహల్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలెవ్వరు' అన్న శ్రీశ్రీ మాటలే గుర్తుకు వస్తాయి. అందరికీ పేరు పేరునా కృతజ్ఞతలు చెబుతూ, ఆహ్వానపత్రికలో పొందుపరచాను. 'బంగారు పళ్ళానికైనా గోడదాపుగ ఎందరో సౌజన్యమూర్తులు నిలచారు. వారికి ప్రత్యేకమైన కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను.

అవధాన పద్యాలు ప్రచురించడంలో మేమున్నామని చెప్పుకోడానికేగాని, శ్రమంతా కడిమిళ్ళవారిదే. అవధాన భారతి తరపున వారికి కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాము. డబ్బుమాటను ప్రక్కనపెట్టి చిత్తశుద్ధితో అందంగా ముద్రించిన క్రియేటివ్ ఆఫ్‌సెట్ వారికి కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను.

ముఖ్యంగా కడిమిళ్ళవారి 12 శతావధానాలను అందమైన దస్తూరితో మాకందించిన కె. సత్య, సి. రుక్మిణి, పోచనపెద్ది సుబ్రహ్మణ్యం, మంకు శ్రీనులకు మీదు మిక్కిలి కృతజ్ఞతలు.

# అవధాన భారతి దరహాస కిరణాలు

సర్వశ్రీ

కొత్తపల్లి జానకిరామ్

డా॥ కొప్పర్తి వేణు గోపాలరావు

చినమిల్లి సత్యనారాయణరావు

పోలిశెట్టి వాసుదేవరావు

జి.వి.కె. రామారావు

ఎస్. రమేష్‌బాబు

కోట్ల వెంకట రామమోహనరావు

తమ్మిశెట్టి హరనాథ్

అజిత్‌కుమార్ జైన్

కోట్ల వెంకటరామ్‌కుమార్
మరియు సోదరులు

డి. రమేష్‌బాబు

ఎస్.వి.ఎ.ఆర్. శాస్త్రి

డా॥ ఎ.బి.యస్. మూర్తి

చక్రావధానుల రెడ్డప్ప ధవేజి

పాలంకి రామ మోహన్

సాయిశ్రీ

రామవరపు గోపి

సి.ఆర్.బి. ధవేజి

కొప్పర్తి రాంబాబు

డా॥ ఎ. నారాయణరావు

చిలకమర్తి సుబ్రహ్మణ్య శాస్త్రి

తోలేటి పార్థసారథి

బి. థియోడర్

మల్లంపల్లి ఏకోరామసిద్ధుడు

విన్నకోట సుబ్బారావు

చామర్తి రత్నాజి

కుమారి కొప్పర్తి వసుంధర

సి. మురళీ కృష్ణ ధవేజి

Jnanpith Awardee
**Dr. C. Narayana Reddy,** M.P.
M.A. Ph.d. D. litt.

Chairman
**Andhra Pradesh Cultural Council**
**Government of Andhra Pradesh**
Kalbhavan, Hyderabad - 500 004.
Phone: (O) 3214603 (R) 3548451
Fax: (O) 3214603



జ్ఞానపీఠ అవార్డు గ్రహీత
డాక్టర్ సి. నారాయణరెడ్డి, ఎం.పి.
ఎం.ఏ. పి.హెచ్.డి. డి.లిట్
అధ్యక్షులు
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాంస్కృతిక మండలి
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
కళాభవన్, హైదరాబాద్-500 004
ఫోన్ (ఆ) 3214603 (ఇ) 3548451
ఫాక్స్ (ఆ) 3214603

తేది: 9-8-2002

# అభినందన

అవధానమంటే ఏకాగ్రత, ధీవ్యగ్రత. ధారాధారణ శక్తుల విలక్షణ సంగమం అది.

ద్విశతవధానిగా లబ్ధయశస్కుడైన డా॥ కడిమిళ్ల వరప్రసాద్ తాను నిర్వహించిన శతావధానాల్లోంచి ఎంపికచేసిన పద్యాలు ఈ సంకలనంలో ఉన్నాయి. సమస్యలు, వర్ణనలు, ఆశువులు, దత్తపదులు అనే అవధాన ప్రధానాంగాల్లో వరప్రసాద్ పలికిన పద్యాలు చమత్కార పారీణంగానూ ప్రౌఢతాధురీణంగానూ ఉన్నాయి. అందుకు నా హార్దికాభినందన.

డా॥ సి. నారాయణరెడ్డి

# పూర్వ జన్మని యా విద్యా

రాష్ట్రపతి పురస్కృత మహామహోపాధ్యాయ
**శ్రీపాద లక్ష్మీనారాయణశాస్త్రి**

చిరంజీవియగు కడిమిల్ల వరప్రసాద్ మా పాడగట్లపల్లి కళాశాలలో భాషా ప్రవీణ కోర్సును పూర్తిచేసుకొని పట్టా సంపాదించినాడు. ఈతడు కళాశాలలో చేరిన కొద్దిరోజులలోనే ఆశుకవిత్వము చెప్పుట జరుగుచుండెడిది. పుష్పము పరిమలముతోనే పుట్టు ననులోకోక్తి ఈ తని విషయమ్మై సార్ధకమ్మైనది. శ్లో పూర్వజన్మని యావిద్యా, పూర్వజన్మని యత్తపఃపూర్వజన్మసంస్కారమే ఇందులకు కారణమని తెలియచున్నది. ఈతడు కళాశాలలో చదువు కొనుసమయముననే అష్టావధానము శతావధానము చేసి అందరను ఆశ్చర్య చకితులను చేసెను. పిమ్మట కాలేజీ చదువుపూర్తియైన పిమ్మట అనేకాష్టావధానములు శతావధానములు గూడచేసి అందలోను కృతార్థుడైనాడు. తిరుగులేనివాడు అను ప్రసిద్ధి ఆంధ్రదేశమున వ్యాపించెను. ప్రస్తుతము ఆ తిరుపతి వేఙ్కటకవులు ఇద్దరునేకమై ఈ కడిమెళ్ల వరప్రసాదు రూపముగానావిర్భవించిరి కాబోలు అన్నకీర్తి ప్రతిష్ఠలను సంపాదించినాడు. శ్రీ జగద్గురువుల సన్నిధిలోనే అవధానము చేసి జగద్గురువుల యనుగ్రహాశీస్సులను పొంది సన్మానింపబడినాడు. ఈతడు పెద్దలయందు గురువుల యందును అత్యుత్కటభక్తి విశ్వాసములు గలవాడు, కావ ఈ చిరంజీవి ఇతోధికానేకావధానములు చేసి ఆంధ్రప్రదేశమున నలుమూలలయందు ఇతోధికకీర్తి ప్రతిష్ఠలను సంపాధించుచు అవధాని శేఖరుడై విరాజిల్లుగాక యని యాశీర్వదించు చున్నాము.

శ్రీపాద లక్ష్మీనారాయణశాస్త్రి

శ్రీపాద లక్ష్మీనారాయణశాస్త్రి

# ఆప్తవాక్యము

**డా॥ ప్రసాదరాయ కులపతి** ఎం.ఏ., పిహెచ్.డి.
Rtd. Principal, Hindu College - GUNTUR

'అవదాన చంద్రిక' అనే పేరుతో డా॥ కడిమిళ్ల వరప్రసాద్ గారు చేసిన శతావధానాల సంపుటి చదివాను. ఈనాడు ఆంధ్రదేశంలో నిర్దుష్టంగా, నిరాఘాటంగా అవధానాలు చేస్తున్న వారిలో ప్రథమశ్రేణికి చెందిన విద్వత్ కవివర్యులు వీరు. దర్శనీయమైన గోదావరీ తీరంలో నివసిస్తూ రసరమణీయమైన కవితాలహరికలను అందిస్తూ అందరినీ అలరిస్తున్న అవధాని శేఖరులు వీరు. తిరుపతి వేంకటకవులు, కొప్పరపు సోదరకవులు వేలూరి శివరామశాస్త్రి ప్రభృతులు గతించిన తరువాత ఆంధ్రావనిలో అష్టావధానాలే తప్ప శతావధానాలు చేసేవారు కరువైనారు. ఆ సమయంలో తిరుపతినుండి మేడసాని మోహన్‌గారు బయలుదేరి అద్భుతంగా శతావధానాలు చేస్తూ సాహిత్యరంగాన్ని చైతన్య చకచ్చకితం చేశారు. ఇంచుమించు అదే సమయంలో గోదావరి తీరం నుండి కడిమెళ్ల వరప్రసాద్‌గారు సాహితీ కర్పూర పరాగ పాండు రుచి పూరములను దిశాంచలముల వరకు ప్రసరింప చేశారు. తదనంతరం ఎందరో శతావధానులు, సహస్రావధానులు ఉదయించారు.

వీరి అష్టావధానాలు నేను గుంటూరులోను, కొన్ని రాష్ట్రేతర ప్రాంతాలలోను ఏర్పాటుచేశాను. విజయవాడ మండపేట శతావధానులకు సంచాలకునిగా ఉన్నాను. శ్రీనాథపీఠం పేరదేశంలోని వివిధ ప్రాంతాలలో సాహిత్యోత్సవాలు జరిపినప్పుడు కొన్ని కొన్నిచోట్ల వీరి అవధానాలు ఏర్పాటు చేయటం వాటిని అక్కడి తెలుగువారు ఎంతో మెచ్చుకోవడము జరిగింది. అక్కడ జరిగిన భువన విజయాది సాహితీరూపకాలలో వీరు వివిధపాత్రలు ధరించి రూపకోద్యానవసంతునిగా ప్రతిభా పాటవాలు ప్రదర్శించారు. ఇటీవలి కాలంలో వీరు ఎన్నో రూపకాలు స్వయంగా నిర్వహిస్తూ సహృదయుల మన్ననలను అందుకుంటూ ఉండటం ఎంతో ముదావహం.

కేవలం అవధానాలతో సంతృప్తి చెందక ఆశుకవితా ప్రదర్శనలతో ఆగక రసోల్లసితమైన కావ్యాలను సృష్టించి అవధానాశుకవులు శాశ్వత కవితా సృష్టి చేయలేరన్న అపప్రథను తొలగించటంలో కృతకృత్యులైనారు. పద్యకవితా ద్వేషులకు దీటైన ఘాటైన సమాధానాలు సరళసుబోధక పద్యాలలో చెబుతూ ప్రేక్షకులు తలలూపేలా విజృంభిస్తున్నారు. ఇటువంటి బహుముఖ ప్రజ్ఞాసంపన్నుడైన వరప్రసాదకవి తాను చేసిన శతావధానాలను కొన్నింటిని సంపుటిగా వెలువరించటం విబుధశ్లాఘాపాత్రమైన విషయం. అవధానాలలో కూడా అందమైన పద్యాలు భావస్ఫోరకమైన రీతులు ఉంటవని చెప్పటానికి ఈ గ్రంథాన్ని ఉదాహరణగా చూపవచ్చు. విద్యావినయ సంపన్నుడైన ఈ కవితాసుధాకరుని 'అవధాన చంద్రిక' సహృదయ హృదయాంబరాలలో ధవళ ధవళ యశఃకాంతులను నింపగలదని ఆశిస్తున్నాను. చిరకాలంగా ఆత్మీయులైన వరప్రసాద్‌కవిగారు సాహితీ ప్రపంచంలో మరింత వైభవ ప్రాభవాలతో పెంపొందాలని ఇటువంటి గ్రంథాలు ఇంకా ఎన్నెన్నో రచించాలని శతావధానిగా దక్షుడైన ఈ కవి శతాధికంగా గ్రంథాలను రచించాలని ఆశిస్తున్నాను. పరమేశ్వరి దానికి తగిన శక్తి యుక్తులను వీరికి ప్రసాదించుగాక!

ప్రసాదరాయ కులపతి

# గురుసాక్షాత్ - పరంబ్రహ్మ

త్రిభాషా మహాసహస్రావధాని
**వద్దిపర్తి పద్మాకర్**

క॥ గురువును గోవిందుఁడు, మా
యిరువురిలోనెవనినాశ్రయించెదవన, నీ
గురుచరణంబుల వ్రాలుదు
గురు కరతల గతుఁడు కాడె గోవిందుండున్॥

**1989**వ సంవత్సర గణపవరం మండలం సరిపెల్లలో కాలవగట్టున అద్దె ఇంటిలో ట్యూషన్స్ చెప్పుకొంటున్న రోజులు. కవిగా, పౌరాణికునిగా అప్పుడప్పుడే పైకివస్తున్నకాలం. ఒకనాఁటి సాయంకాలం ఒక వ్యక్తి మాయింటికి వచ్చి, తననుతాను పరిచయం చేసుకొని, తన పద్యాలు కొన్ని వినిపించి, నా పద్యాలు కొన్ని విన్నారు. ఆయనే శ్రీ సుంకర వేంకటరామయ్య. అప్పట్లో అర్ధవరం హైస్కూలులో తెలుగు పండితుడాయన.

మాకు కొంత స్నేహం పెరిగిన తరవాత మీరెప్పుడైనా అష్టావధానం చూసారా? అనిఅడిగారాయన. "లేదండీ, తిరుపతి వేంకటకవులు, కొప్పరపు కవులను గుఱించి వినడం, వారి పుస్తకాలు చదవడం తప్ప అవధానవిశేషాలు కనలే"దన్నాను. "అయితే నవంబరు ఒకటవ తేదీన నిడమర్రులో కన్నాజిగాంధీ తాతగారి ఇంట అవధానం ఏర్పాటు చేసాం, రండి" అన్నారాయన. సరే అన్నాను.

**1989** నవంబరు ఒకటి. నిడమర్రు వెళ్ళాను. సన్నగా, నాకంటె, పొట్టిగా, కోలముఖంతో బొత్తిగా కుఱ్ఱవాటంతో 'ఇన్‌షర్టుతో ఉన్న ఒకవ్యక్తి, చేతులు జోడించి పెద్దలతో మాట్లాడుతూ కనిపించాడు. సుంకరవారు సైగచేసి అవధాని ఆయనే అనగానే సంభ్రమాశ్చర్యాలతో నమస్కరించి, పరిచయం చేసుకొన్నాను. ఆ పరిచయమైన వ్యక్తి శ్రీ కడిమిళ్ల వరప్రసాద శతవధాని - ప్రస్తుతం డా॥ కడిమిళ్ల వరప్రసాద ద్విశతావధాని.

ఆ రోజు సాయంత్రం అవధానానికి ముందు కవి సమ్మేళనం జరిగింది. అందులో "మిన్న భరతభూమికన్న గలదె" అనే నా పద్యానికి కడిమిళ్లవారు ప్రభావితులవడంతో నాపై ప్రత్యేక దృష్టిపడింది. తదనంతరం జరిగినవారి అష్టావధానంలో నాకు ప్రష్టతాభాగ్యం కలిగింది. ఆనాటి ఆ అవధానం ఆద్యంత హృద్యం.

క్రమంగా అవధానాలు, భువన విజయాలు, ఇంద్రసభలు, ఇలా ఎన్నో కార్యక్రమాలలో, వారి సంచాలకత్వంలో పాల్గొనడం జరిగింది. జనానాంతర సౌహృద బంధం స్థిరమయ్యింది. జూన్ **30**వ తేది **1992**, రావూరి జయంతి సభలో హఠాత్తుగా కడిమిళ్లవారు లేచి, వచ్చే రావూరి జయంతికి అనగా **30-6-1993**న రావూరి పీఠం నిర్వహణలో పద్మాకర్ అష్టావధానం చేస్తాడని ప్రకటించారు. అప్పటిదాకా నా మనస్సులో ఆ విధమైన ఊహలేదు. అభ్యాసం లేదు. అయినా అలా ప్రకటించినవారి ధైర్యానికి జోహారులు. ఎవరిలో ఏ శక్తి ఉందో

గుర్తించే నిపుణుడే సరియైన గురువు. అటువంటి గురుడీయుగంలో శ్రీ కడిమిళ్ల మాత్రమే.

ఇది జరిగిన 5 నెలల తరువాత 1992 డిసెంబరు ఆరవతేదీ, మార్గ శీర్ష మాసంలో గురుపత్ని మీనాక్షిగారు ఎదురువచ్చి దీవించిపంపగా, గోవిందరాజన్‌గారి ఇంట్లో అద్దెకు వుంటున్న మల్లంపల్లి ఏకోరామ్‌గారి వాటాలో గురుసన్నిధిలో, ధవేజీ, చిలకమర్తి పృచ్ఛకులుగా తొలిసారి చేప్పిన నా అష్టావధానం దిగ్విజయం కావడంతో నా అవధాన జైత్రయాత్ర ప్రారంభమైంది. చాలా స్వల్పకాలంలోనే అనేకాష్టావధానాలు, శతావధానాలు, ఒక త్రిభాషామహాసహస్రావధానం చేయటమేకాక, వారితో జంటగా చతుర్గుణితాష్టావధానాలు కూడా చేసేభాగ్యం కలిగింది.

వారితో మాట్లాడడమే ఒక విద్య

వారితో కలసి కూర్చోవడమే యోగాభ్యాసం

వారితో పర్యటించడమే నిజమైన అభివృద్ధి పథం

ఆ కరుణ, ఆ ఆప్యాయత, ఆశబ్ద బ్రహ్మోపాసన, ఆచులుకుదనం, ఆహాస్యం, ఆ రసస్ఫోరక సంభాషణ, ఆ భోజన విన్యాసం, ఆక్షమాగుణం, ఆనిస్పృహ, ఆనిత్య సంతుష్టత అనన్య దుర్లభాలు.

ఆయన మనస్తత్వాన్ని గూర్చి చెపితే కొందఅది పొగడ్త అనుకోవచ్చుగాని, రెండుమూడు సంఘటనలు, స్వీయానుభవాలు వ్రాస్తాను. వానిని బట్టి పాఠకులు విషయ గ్రాహ్యులుకాగలరు.

ఒకప్పుడాయనకు తీరని కష్టం వచ్చింది. ఆ సమయంలో ఓదార్పుకోసం ఒకాయన "ఆత్మ అవస్థత్రయ సాక్షీ" అనగా అంతవేదనలో కూడా కడిమిళ్లవారు, "ఆత్మ అవస్థాత్రయసాక్షీ" అని శబ్దాన్ని దిద్దారు. శబ్ద బ్రహ్మోపాసన అంటే ఇంకేమిటి?

1993 ఏప్రిల్‌లో తూర్పు గోదావరి ఏజన్సీ ప్రాంతంలో వారి అష్టావదానం జరిగింది. నిర్వాహకులు, నన్నుకూడా పృచ్ఛకునిగా పిలిచారు. కార్యక్రమానికి మేమిద్దరం కలిసివెళ్ళాం. మా ఇద్దరికి కలిపి రూ. 116/-లు మాత్రమే ఇచారు. పాపంపేద నిర్వాహకులు. ఖర్చులు రెట్టింపయ్యాయి మాకు. ఆ సమయంలో "వ్యాప్తింబొందక, వగవక..." అనుపద్యం చదివి మిన్నకున్నాడాయన. 'నిస్పృహ' అంటే ఇదేనేమో?

గుండెను కదిలించే శబ్దశక్తి, భావపటుత్వం కలిగిన, పిచ్చ పిచ్చ పదాడంబరాలులేని నిజమైన కవిత మా కడమిళ్లది అని నిర్ద్వంద్వంగా చాటగలను. చాలా చెప్పాలని ఉంది. మా అనుబంధం ఒక మహాకావ్యం. ప్రస్తుతానికిది ముక్తకమే.

ఉ॥ మూకను గూడ విద్దియలప్రోడగఁజేయఁగలట్టిదిట్ట, వి
ద్యాకమలాక్షికిన్ సుతుడు, వ్యాకృతి ఆకృతి గాఁగ నిల్చె, నే
నాకడిమిళ్ల శిష్యుఁడనటంచును జెప్పుకొనంగ గొప్ప, నే
నా కవిరాజశేఖరు, హృదంతర పీఠిక నిల్పి కొల్చెదన్॥

# "కవి కచ్ఛపి" కడిమిళ్ళ

పోచినపెద్ది సుబ్రహ్మణ్యం, MA, తెలుగు పండిట్,
65-16-5/3, గౌరీశంకర్ వీధి,
ద్వారకానగర్, కాకినాడ

భారతీ దేవి కృపావర్ష ధారా ప్రవాహమును రసన సీమను నిల్పుకొని పలికినా, పద్యమల్లినా ప్రహర్షమును పంచగల ధీశాలి డా॥ కడిమిళ్ళ. సహృదయ సంపద అపారము. అక్షర భిక్షను అందించడంలో మించిన సదుద్యోగి. సాహిత్య కల్పవృక్షంలో తానొక శాఖయై ఎందరో తనంతటి వారు కావాలని తపనగల మనిషి. అందుకు నిరంతరంగా చేయూతనిచ్చు పరోపకారి.

అవధాన ప్రక్రియపై సంపూర్ణమైన అధికారం కలవాడు. వాని సృష్టిలో వస్తువు వెదకిన కొలది దొరకును. దొరికినకొద్దీ వాస్తవం కనుపట్టును. అలవోకగా సాగించు అష్టావధానాలకు అర్ధ సహస్రసంఖ్య దగ్గరకాబోతుంది. పుష్పావధాన, ఘంటావధాన, గేయావధాన, నేత్రావధాన, వచనావధాన ప్రక్రియలలో ఘనుడు. అవధానులెందరో గలరు. కాని కడిమిళ్ళ అవధానులను తయారుచేసిన గురువర్యుడు. నన్ను అష్టావధానిగ, కోటను శతావధానిగ, వద్దిపర్తి పద్మాకరుని త్రిభాషా సహస్రావధానిగ తయారుచేయడమంటే మా ముగ్గురి పరిశ్రమ యెంతో మాపట్ల వారి పరిశ్రమ అంత. అందుకు నిరంతరం కృతజ్ఞతలే మేమందిచగలిగినవి. నా హృదయ పద్మాకరమున కోటగా నిలచిన మేటి.

వ్యాసాలు, విమర్శలు, గేయాలు, అభిప్రాయాలు, సందేశాలు, కథలు, కథానికలు ఇలా ఎన్నో వాని కలంనుండి జాలువారుతూనే ఉంటాయి. వాణి అకాశ వాణియై దూర దర్శనీయము. కలుపు గోరుతనము, కవిత్వంలో సత్యం ఉత్కృష్ట స్థానాన్ని పంచుతున్నాయి. అలంకారాదులు వన్నెతెస్తున్నాయి.

స్రష్ట సృష్టికన్నను కవిసృష్టి మేలు
సృష్టి యున్నంతకాలము క్షేమమగును.
ధరణి డా॥ కడిమిళ్ళ సందర్భముగను
వ్రాయవలయును నిలువెత్తు గ్రంథములను

"ఆయుర్వృద్ధి యనంతమౌచు నిరతంబారోగ్యముంజేరిలేఁ
బ్రాయంబున్గ వితాగుణంబుల పరివ్యాప్తంబునై పాఠక
శ్రేయస్సంపదనంఁజేయఁగ యశశ్శ్రీకారమాకారమై
జేయంగావలె నవ్యభవ్యరచనల్ శ్రీభారతీ పుత్రుఁడై

# శతపత్ర

డా॥ ధూళిపాల మహాదేవమణి

పువ్వు పుట్టగానే పరిమళిస్తుందంటారు. కానీ ఈ కడిమిపుష్పం మొగ్గగా ఉన్నప్పుడే సౌరభం వెదజల్లింది. నిజంగానే అద్భుతమైన చరిత్ర అయ్యింది. 17 శతావధానాలూ, సుమారు 1000 వఱకూ అష్టావధానాలూ, ఒక ద్విశతావధానమూ - ఇది సామాన్యమైన విషయం కాదు. సప్తదశ శతావధానాల శతపుష్ప వికాసం ఈ వేళ అవధానలోకంలో ఒక రికార్డు.

చిన్నప్పటినుండీ చదివిన సంప్రదాయ విద్యవల్ల కడిమిళ్ళవారు ఎటువంటి సమస్యలకీ దత్తపదులకి భయపడరు. ముఖంలో చిరునవ్వు చెరగదు. సంస్కృత వ్యాకరణం మీద మంచి పట్టు ఉందేమో! ఎంతటి క్లిష్టమైన ప్రాసలకైనా వైయాకరణ కర్మాగారం నుండి ఇట్టే శబ్దాలు తయారుచేసి పట్టుగా ప్రాసలో పెడతారు.

ఒకసారి నేను మండపేటలో

"పుంస్త్వాకారము బ్రహ్మకింపాదవిమిన్ బూనెన్‌గదా స్త్రీత్వమున్"

అని బాలవ్యాకరణం పరంగా సమస్య ఇచ్చాను. వెంటనే ఏమీ తడుముకోకుండా 'తాంస్త్వామే' అంటూ మొదలుపెట్టి అందమైన వ్యాకరణైక సాధ్యమైన ప్రాసలు వేసి చక్కగా పూరించారు. అందరూ భేష్! భేష్ అన్నారు. ఇలా 'కార్ష్ణ్య' 'కిస్మ' మున్నగు ఎంతటి కఠిన ప్రాసలైనా కడిమిళ్ళకు ఆనవు.

రామాయణాదులు అస్థిగతంగా జీర్ణించుకొన్న మనిషేమో ప్రతి పద్యంలోనూ సంప్రదాయ సంపద తళుక్కుమని మెరుస్తూవుంటుంది. వీరిపద్యాల్లో ఇంకా రామాయణ విషయంలో అంశం అడిగితేనా అంభోధిదాటి హనుమంతునిగా మారిపోతారు. కడిమిళ్ళవారు.

ఏలూరు శతావధానంలో సంజీవిని కోసం ఎగురుతున్న హనుమ తోకను వర్ణించమన్నారు. ఒక ప్రష్ట - అంతే.

> వాలంబో! ప్రణావాకృతింగొనిన దైవత్వంబొ! శేషాహియో!
> ఫాలస్థానిక వహ్నియో! యినకుల వ్యాసక్త కోదండమో!
> లీలాతాడన వీరభద్రజటయో! ఋక్షప్రకంపమ్మొ! ఆ
> గోలాంగూలము లక్ష్మణావన కళాకుంతమ్ము చిత్రంబగున్॥

కళ్లకు కట్టినట్టు చూపించి, అందర్నీ తన్మయుల్ని చేసారు. సంప్రదాయ సాహిత్యంపట్లవున్న అవధాని అభినివేశానికి ఇది మచ్చుతునక.

'ధార-ధారణ' అవధానానికి రెండు పార్శ్వాలైతే ఆ రెండింటినీ సమర్థంగా పోషించి ఆనందపెట్టడం కడిమిళ్లవారి అవధాన నీతి.

'అవధానభోజ' వడ్డివారికి అందుకనే కడిమెళ్లవారంటే ఇష్టం.

ప్రష్ట ఏ ఉద్దేశంతో అడుగుతాడో! దాన్ని వెంటనే గ్రహించి అదే విధంగా పూరించడం ప్రసాదుగారి ప్రత్యేకత. తనకు అక్షరవిద్య నేర్పిన గురువుల్ని ప్రతి అవధాన సభలోనూ సంస్మరించడం కడిమిళ్లవారి కార్తజ్ఞానికి నిదర్శనం. ఎవర్నీ తక్కువ చేయకపోడం ప్రసాదుగారి సౌహార్దం. సరసంగా అప్రస్తుతానికి సమాధానాలు చెప్పడమూ, సంచాలకుని అవధాన ప్రణాళిక ఆదరించడమూ, దేనికి ఉద్రేకం పొందకీప్రసన్నంగా ఉండడమూ, నిర్దిష్ట సమయంలో ధారణంతో సహా అవధానం చెయ్యాలన్న దృఢనిశ్చయమూ, ఇవన్నీ కడిమిళ్లవారి విజయ రహస్యాలు.

## సమర్పణ

**శ్రీ కొరళ్ళ సత్యనారాయణమూర్తి (కేపిటల్‌రాజు)**
**నర్సాపురం**



చిరునవ్వు చెరగని వదనం
పలుకు వెన్నెలల సదనం
గుండెగుడిలో ప్రతిభకు నీరాజనం
జీవనం స్వచ్ఛంద స్నేహ భాజనం
ఛాయా చిత్రకళా హృదయవర్తి
మా కొరళ్ళ సత్యనారాయణమూర్తి

**1985 సెప్టెంబరు 2,3,4**

వేదిక :

**శృంగేరి శంకర మఠము,**
**నల్లకుంట , హైదరాబాదు**

నిర్వహణ :

**శ్రీ శృంగేరీ జగద్గురు శంకరాచార్య**
**సమాహ్వాన సంఘం**

అధ్యక్షులు :

**జగద్గురువులు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థస్వామి**

సంచాలకులు :

**ఆచార్య దివాకర్ల వేంకటావధాని**

విశిష్ట అతిథులు :

**శ్రీమాన్ అత్తిలి గోపాలకృష్ణమాచార్యులు**
**శ్రీ కేశవపంతుల నరసింహాశాస్త్రి**
**శ్రీ పుల్లెల శ్రీ రామచంద్రుడు**
**శ్రీ శలాక రఘునాథశర్మ**
**శ్రీ పేరాల భరతశర్మ**

# సమస్యలు

శ్రీ కేశవవంతుల నరసింహశాస్త్రి - భాగ్యనగరం

"రాతికి గండ్లు గిట్టుమనె వ్రాలె దనూలత భస్మశేషమై"

చేతమునందుఁ గామమును జేర్పఁగ యత్నముఁ జేయనెంచి, యా
నీతునిఁజేసి మన్మథుని నేర్పుగ ముందుకుఁద్రోయ. పుష్పసం
ఘాతము సోఁకి యాగ్రహము క్రమ్మకొనన్ నిరసించు శంబరా
రాతికి గండ్లు గిట్టుమనె వ్రాలె దనూలత భస్మశేషమై"

శ్రీ శలాక రఘునాథశర్మ - అనంతపురం

"రవయుత మౌనమున శంకర ప్రభుఁగొలిచెన్"

అవిరళముగ గ్రృషి సలుపుచు
సవిశేషము కాఁగ విషయ సాకల్యమునన్
భవదూరుఁడు కాఁగఁ బ్రణవ
రవయుతమౌనమున శంకర ప్రభుఁగొలిచెన్॥

శ్రీ బి.ఆర్. శాస్త్రి - భాగ్యనగరం

"సీత రామునకేమౌనా చెప్పగలనె!"

కపివరేణ్యుఁడ! నాపైని గృపవహించి
నాథుఁదోడ్కొని రమ్మని నాతి పలికె
లంకఁగాల్చితినాశిఖలన్ నశించె
సీత; రామునకేమౌనా చెప్పఁగలనె!॥

శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడు - భాగ్యనగరం

"హారము దారమైన పరిహారమునొందునశేష దోషముల్"

వీర వరేణ్యులై చెలఁగి విజ్ఞత గోల్పడి భక్త సంఘమున్
ధారుణిఁద్రోసిరాజనుచు ధార్మిక శక్తినిఁగూలనేయ, దూ
ణీర విశేషముల్ విడువ నేర్పుమెయిన్ మహి రాక్షసాళి సం
హారముదారమైన పరిహారమునొందునశేష దోషముల్॥

శ్రీ ధూళిపాళ గోపాలకృష్ణ - భాగ్యనగరం

"సీతను చూచు గోఁతులకు సింహము పుట్టెర చూడ చిత్రమై"

ఆ తలిరాకుఁబోఁడిని రయంబునఁ గైకొని పోవునాడు సం
పాతి గ్రహించి చెప్పునెడ వాయు తనూజుఁడు వానరేంద్రుఁడై
యా తగులాట రాక్షసులనంతము జేయఁగ రాక్షసీతతుల్
సీతను చూచు; గోఁతులకు సింహము పుట్టెర చూడ చిత్రమై॥

శ్రీ చుండి లక్ష్మీనారాయణ - భాగ్యనగరం

"బిడ్డడవ్వను మోహించి పెండ్లియాడె"
ధర్మమును నాల్గు తెరగులఁదనరునట్లు
జేయ; వలదన్న ఫలమునే స్వీకరించి
కామమున గొట్టుకొనిపోయి కదలి దేవు
బిడ్డడవ్వను మోహించి పెండ్లియాడె॥

ఆచార్య దివాకర్ల వేంకటావధాని - భాగ్యనగరం

"అని రారాయని తెల్పెనాఁదగె ద్విరేఫాద్యంత రేఫధ్వనుల్"
కనుగోకుండు మరందమాశపడి, తా గైకోడు సంకేతమ
స్తనగంబంటెను భాస్కరుండళికి బంధంబాయె బద్మంబు, గా
ఢనిశీథంబునఁ గుందఁజాలనిఁక రాడాయంచునా తమ్మి రా
యని; రారాయని తెల్పెనాఁదగె ద్విరేఫాద్యంత రేఫధ్వనుల్॥

శ్రీ బి.ఆర్. శాస్త్రి - భాగ్యనగరం

"కాలములందు మేలు కలికాలమె నీకిది, దేవ జ్ఞాతమే!"
ఆ లలితాంగి చిత్రములయందు నటించుట నేర్చియుండి,రూ
ప్యాలనుఁబొంది, పల్కెనవురా కలికాలమునందు చిత్ర రూ
పాలను సృష్టి చేయగలవాడు నరుండు, నిజమ్ముగా చతుః
కాలములందు మేలు కలికాలమె నీకిది, దేవ! జ్ఞాతమే! ॥

శ్రీ ధూళిపాళ గోపాలకృష్ణ - భాగ్యనగరం

"రావణ కుంభకర్ణులకు రాముఁడు పుట్టెను ధర్మమేలఁగన్"
రావము సల్పుచుండగను రావణ నామము సార్థకంబుగన్
రావణ సోదరుండగుట రావణుకంటెను స్థూల కాయుఁడై
కావలెనంచు దౌష్ట్యములు గర్వమతుల్ పొనరింప మృత్యువై
రావణ కుంభకర్ణులకు రాముఁడు పుట్టెను ధర్మ మేలఁగన్॥

శ్రీ పి.యస్.ఆర్. ఆంజనేయశాస్త్రి - భాగ్యనగరం (ఎఐఆర్)

"గురు శంకరుఁడున్ భజించె గురు గోవిందున్"
వరశక్తిన్ ఘటియిల్లుచు
జరియించుచు దపమునందు సకలముగురుడీ
శ్వరుడంచును భావించుచు
గురు శంకరుడున్ భజించె గుర ఎగోవిందున్ ॥

శ్రీ కె.వై.ఎల్. నరసింహారావు - భాగ్యనగరం

"అద్వైతమ్మది సంశయాస్పదము నింద్యమ్మయ్యె నాస్తిక్యమున్"
విద్వాంసుల్ పలురీతులన్ బలుకరో విజ్ఞాన వై శిష్ట్యమే
ఉద్వేగంబును గల్గజేయు విష హాస్యోక్తుల్ ప్రపంచించి, సం
పద్వైశిష్ట్యమునొందు మూఢులును, ధర్మ భ్రష్టులౌవారియం
దద్వైతమ్మది సంశయాస్పదము నింద్యమ్మయ్యె నాస్తిక్యమున్॥

శ్రీ తిరుమల శ్రీనివాసాచార్య - భాగ్యనగరం

"అవలీలఁగ బాల యెత్తెనశ్వము నంతన్"

అవకాశము కలిగినదని
కవలాచతురంగమాడగా బని పూనన్
అవునా అశ్వమటంచును
అవలీలఁగ బాల యెత్తెనశ్వమునంతన్ ॥

శ్రీ పేరాల భరతశర్మ, అవధాని - విజయనగరం

"ద్రౌపది సీత యిర్వురొక తండ్రికి బుట్టిన బిడ్డలే కదా"

ద్రౌపది కొంగు బట్టుకొను దౌష్ట్యముచేత సుయోధనుండు, భూ
జాపతి దొలనుండ మహిజన్ గొనిపోవుట రావణుండు, సం
తాపము నొంది నాశనము దాల్చిరి, వారలు దైవ పుత్రికల్
ద్రౌపది సీత యిర్వురొక తండ్రికిఁబుట్టిన బిడ్డలేకదా! ॥

శ్రీ లంకా సీతారామశాస్త్రి - భాగ్యనగరం

"పుంస్త్వము లేనివాడొకడు పూనిక నల్వురతో రమించెగా"

పుంస్త్వము చూడగా దగునుపో యితగాని వధానమందు,నా
పుంస్త్వమదెంతపాటియని పూనికనూనుచునిచ్చినారలీ
పుంస్త్వమటంచు ప్రాస, తమ పుంస్త్వము చూచెద పిచ్చిపల్కు లా
పుంస్త్వము లేని వాడొకడు పూనిక నల్వురతో రమించెగా

శ్రీ శివనూరి విశ్వనాథశర్మ - భాగ్యనగరం

"భర్తకు కంఠసూత్రమును భామిని గట్టె భళీయనన్ జనుల్"

ఆర్తినిఁజెందినట్టి యొక యాడుది పాడుదిగా దలంచి, కా
మార్తినినన్యకాంతల సమాగమమంది బికారియయ్యె, వి
త్తార్తిని గాళ్ళమీదఁబడనాతని బానిసగా, దలంచుచున్
భర్తకు కంఠసూత్రమును భామిని గట్టె భళీయనన్ జనుల్ ॥

శ్రీ కె. రాజన్నశాస్త్రి - భాగ్యనగరం

"నగధారి యనంగుద్రుంచె నాతిని బ్రోచెన్"

అగణిత శక్తియుతుండౌ
భగవంతుని మీద గుసుమ బాణములేయన్
దగులన్గోపంబునఁ బ
న్నగధారి యనంగుఁద్రుంచె, నాతిని బ్రోచెన్ ॥

ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు - భాగ్యనగరం

"ముక్తికి గారణము విషయభుక్తియె తలపన్"

ముక్తుఁడు కానెంచినచో
రక్తుడు కాకుండవలయు, రాజత్ సుజన
వ్యక్తుడు దూరంబాయెను
ముక్తికి, గారణము విషయభుక్తియె తలపన్ ॥

శ్రీ తంగిరాల ఆంజనేయశాస్త్రి - భాగ్యనగరం

"కప్పను గాంచి, పన్నగము కాతరమొందును బాటెమింటికిన్"

చెప్పులు కిల్లుకిల్లుమనఁజేత ధరించును దుడ్డుకఱ్ఱ, తా
నిప్పటికెన్ని సర్పములనెట్లు వధించెనొ చెప్పరాదు, నే
నిప్పటికొక్క మార్గమునవేగుటయే సుఖమంచునెంచి, వెం
కప్పను గాంచి పన్నగము కాతరమొందును బాటె మింటికిన్ ॥

శ్రీ పి.ఎస్. ఆర్. ఆంజనేయశాస్త్రి

"నేనును మాన్యుడన్ బరమ నీచుడ శాంతిని బ్రోత్సహించుటన్"

జ్ఞానవిహీనతన్ బరఁగుజాడ్యునఁబోవు జగమ్మునందు వి
జ్ఞానము బోధసేయుటకు శాంతినిఁ గూర్చుఁగనోపకుంటి, వి
జ్ఞానమునొంది మాన్యుఁడను, జ్ఞానవిహీనులయందు నీచుఁడన్,
నేనును మాన్యుఁడన్ బరమ నీచుఁడ శాంతిని బ్రోత్సహించుటన్॥

శ్రీ తిరుమల శ్రీనివాసాచార్య

"రతిభావాంబుధి నోలలాడితి కవీ! రమ్యావధానమ్మునన్"

తతవైదుష్య విశేష సంగతులతోఁదార్కొన్న నీ బుద్ధికిన్
స్మృతియై సద్గతియై విశేష నతియై సింగారముం జూపు సం
గతి గైకొన్న కవిత్వ సుందరికి శ్లోకస్థానముం గూర్చు భా
రతి భావాంబుధినోలలాడితి కవీ! రమ్యావధానమ్మునన్॥

శ్రీ పేరాల భరతశర్మ

"వాసనలేకయున్ యతియు బ్రాసము లేకయు జంపకంబగున్"

ఆ సరసీరుహాక్షి తనువందు విశేషములేమి చెప్ప వ్య
త్యాసము గానరాదు రస తత్త్వముఁజూపెడి వేళనాపయిన్
నాసిక రామరాజ కవి నాథునకున్ ముదమందఁ జేయునే
వాసన లేకయున్ యతియు బ్రాసయు లేకయు జంపకం బగున్॥

శ్రీ చిలుకూరి అమరవర ప్రసాద్

"జగములెరిగిన ద్విజునకు జందెమేల?"

భాష తెలిసిన వానికి వేషమేల?
రోసమెఱిఁగిన వానికి మీసమేల?
భక్తినెఱిఁగిన వానికిఁబత్రియేల?
జగము లెఱిఁగిన ద్విజునకు జందెమేల?

శ్రీ తిరుమల శేషాచార్యులు

"పున్నమ చంద్రుఁజూచి వెలవోయెను సూర్యుడు తూర్పుకొండపై"

అన్నలినాక్షి క్రొవ్వలపునంతరమందు ఘటించి మించి సం
పన్నతనాథుఁజేరి రతిభావవశీకృతుఁజేయువేళనా
వెన్నెల తేనిఁగూడ మఱపించు ముఖమ్మును గాంచుచుండగా
పున్నమ చంద్రుఁజూచి వెలవోయెను సూర్యుడు తూర్పుకొండపై॥

శ్రీ పరాయితం కృష్ణమూర్తిశాస్త్రి

"మంగలవాడు నీమగడు మానిని రుక్మిణి చింత యేటికిన్"
సంగడియందు వర్ణనకుఁజాలదు కృష్ణుని శక్తి యుక్తి బా
ధంగొననేల? సోదరుఁడు తార్క్ష్యునువేళ జయించి వచ్చి వి
న్నుంగొనిపోక నిశ్చయమనుంజెలి ధూర్తులనుండి నిన్నునో
మం గలవాఁడు నీ మగఁడు మానిని రుక్మిణి చింత యేటికిన్॥

శ్రీ పార్లపల్లె యోగానంద్

"క్రుంకంజొచ్చెను దూర్పుదిక్కునను సూర్యుండల్లదే చూడుమా!"
సంకోచంబొకయింతలేక సరసీజాతాక్షికామప్రథా
నాంకంబౌ పురుషాయితంబునకునాహ్లాదంబు సంధింపుచున్
జంకున్ బొందమిఁదుష్టినొందితినిలే! చాలింపుమా! చంద్రుఁడున్
గ్రుంకం జొచ్చెను, దూర్పుదిక్కునను సూర్యుండల్లదే చూడుమా॥

శ్రీ గంగరాజు వేంకటపూర్ణచిదంబరరావు

"మారుని బెండ్లియాడెను కుమార సవిత్రి తదేక చిత్తయై"
పారవిహీనతం జెలఁగు భావవిశేషము శేముషీ ప్రభా
స్ఫారముగాగనీశ్వరుని స్వాంతమునందు వరించి చిత్తసం
భారమునందు నిల్పుకొని, పార్వతి కోరికపైనరీభవ
న్మారుని బెండ్లియాడెను గుమార సవిత్రి తదేక చిత్తయై॥

శ్రీ యం. వేంకటేశ్వర్లు

"భానుడు వెల్గుచుండనొకవంక తమస్సులు క్రమ్మి వచ్చెడిన్"
ప్రాణములందుఁదీపి యొక వంకనునర్జుడుడన్న భీతియున్
గానఁగరా, జయద్రథుఁడు కానగరాక ప్రతిజ్ఞ భంగమున్
గానిడరాదటంచుఁగర కంజము చక్రము సూర్యుఁగప్పుచోన్
భానుఁడు వెల్గుచుండనొకవంక తమస్సులు గ్రమ్మి వచ్చెడిన్॥

శ్రీ మూలా రామమూర్తి

"రాతిరి వేళ భాస్కరుడు రమ్యముగానుదయించె దూర్పునన్"
త్రేతల మేలువాఁడు పది వేసములందొకఁడైనవాఁడు, ఆ
యాతలిరాకుఁబోడులకునందఱకొక్కక రూపువాఁడు, తాఁ
జేతములందుఁబూర్ణ రస సిద్ధినిఁజేర్పగ నాడు చెల్లగన్
రాతిరివేళ; భాస్కరుడు రమ్యముగానుదయించె దూర్పునన్॥

శ్రీ పరిమి రామనరసింహం

"రణమది యెల్లవారలను రంజిలఁజేసి ముదంబుఁగూర్చెడిన్"
గణ గణమంచు మ్రోగినవి గంటలు పిల్లలు పాఠశాల ప్రాం
గణమునఁజేరినారు నునుగాంతులతో విలపిల్లుచుంద్రు, కా
రణము స్వతంత్ర పర్వమట! రమ్యతఁగూర్చిన యట్టి పచ్చతో
రణమది యెల్లవారలను రంజిలఁజేసి ముదంబుఁగూర్చెడిన్॥

శ్రీ జొన్నవిత్తుల యజ్ఞనారాయణశాస్త్రి

"చెలప దలంతురే ఘనులు చిత్తములన్ బగవారి నేనియున్"

పలుపు గవిత్వవైఖరి యపారముగా గమియించు వేళ(జి
చ్చులు పిడుగొ(చు వచ్చి, ఘనసారము కోల్పడు వీడియమ్ముగాన్
సరసము డిగ్గజేయును బ్రశంసల బ్రస్తుత దూరు(డిత్తటిన్
జెలప దలంతురే ఘనులు చిత్తములన్ బగవారినేనియున్॥

శ్రీ దోసపాటి వేణుగోపాల్

"పరమై మిక్కిలి యంతరంగమును దా బాధించె నిత్యంబు హా"

వరమై యియ్యది పూర్వజన్మకృతమై వాగీశ్వరీ సత్కృపా
కరమై సాగు గవిత్వ సంగతులలో గందోయిలో రేణువై
వరలున్ దోషము వాపు వ్యాకరణమున్ భాష్యాంతమున్ జూచితో
పరమై మిక్కిలి యంతరంగమును దా బాధించె నిత్యంబు హా॥

శ్రీ నడుపల్లి శ్రీ రామరాజు

"రతిని గాంచి బ్రహ్మ రక్తు(డాయె"

వీణ చేత(బట్టి వీనుల విందుగా
మ్రోయ(జేయువేళ హాయినిడుచు
సరస కవిత మనకు సన్నిధిచేయు భా
రతినిగాంచి బ్రహ్మ రక్తు(డాయె॥

శ్రీ ఎ.వి. సుబ్బారావు

"కడిగె గుహుండు రామ పద కంజయుగమ్ము భయమ్ము పెంపునన్"

అడిగెదనొక్కమాట తగునా యని యోచన చేయ(బోకు, నీ
యడుగుల దుమ్ము సోకుటనహల్యగ మారెను రాయియంద్రు, నే(
గడుగకయున్న నావ యొక కాంతగ మారునొ యేమొయంచు(దా(
గడిగె గుహుండు రామ పద కంజయుగమ్ము భయమ్ము పెంపునన్॥

శ్రీ శిలే నారాయణ

"వాసిగ గౌరికాత్మజుడు వారిజ శల్యుడు శౌరికల్లుడౌ"

ప్రాసయు దుష్కరంబయిన పట్టును గాన(గరాదు, ధీశ! సం
వాసము చేయు విఘ్నముల వర్తిలువానినవంగమూర్తినిన్
హాసముతో నదీపతినినన్యపదమ్ముల జెప్పుమన్నచో
వాసిగ గౌరికాత్మజు(డు వారిజ శల్యు(డు శౌరి కల్లుడౌ॥

శ్రీ తంగిరాల ఆంజనేయశాస్త్రి

"అద్వైతస్థితి( బొందుచుందురు సదాహంబ్రహ్మయంచున్ జనుల్"

విద్వేషమ్ములు లేవు రాగమటులే వీసమ్ము నన్నంటదా
పై ద్వైతమ్ము సహింప(బోను(జెడు సంభాషింప(గాబోను( బా
దద్వంద్వంబును బట్టియుండుటను( జిత్తంబుండునంచెంచిరే
నద్వైతస్థితి( బొందుచుందురు సదాహంబ్రహ్మ యంచున్ జనుల్॥

శ్రీ జె.వి. కృష్ణమూర్తి

"రంభకునుద్భవించెనట రాముడు లోకవినోద హేతువై"

దంభము సూపి రావణుఁడు తార్కొనువేళల ధర్మరక్షణా
రంభకుఁడౌచు శాత్రవ విరాముఁడు కాఁగ జనింపనెంచి, తా
శుంభదశేష శక్తి, గొని సూక్ష్మమతిన్ బరతత్త్వ రక్షణా
రంభకునుద్భవించెనట రాముడు లోకవినోద హేతువై॥

శ్రీ అవధానుల వేంకటలక్ష్మీ నరసింహశాస్త్రి

"రాముని జంపె రావణుడు రాజ్యము నిచ్చెను ధర్మరాజుకున్"

ఏమె! వసంతసేన! యరుదెంచుము నీవిటు, నన్ను జూడు, వి
జ్ఞానిని నేను, నీవు వెనుకాడకు, నేను పురాణ సంతతుల్
సాన పఠించినాఁడ, ఒక సక్కని గాథను సెప్పుమందువా!
రాముని చంపె రావణుడు రాజ్యము నిచ్చెను ధర్మరాజుకున్॥

శ్రీ జి.ఎం. రామశర్మ

"రవిచంద్రులు కలసినారు రమణీయముగాన్"

ప్రవిమల దివసమ్మియ్యది
యెవరే వచియించినారలిది దుష్టమటం
చవురా అమవసనాడే
రవిచంద్రులు కలసినారు రమణీయముగాన్॥

శ్రీ గౌరిభట్ల రామకృష్ణశర్మ

"తమతో రాగలరేమొ సాటిగ సినీ తారల్ కళా నైపుణిన్"

గమికర్మీకృత నైక నీవృతుఁడనై గణ్యాప్రపంచమ్మునం
దమలోదాత్త కవిత్వమార్గముల వ్యాఖ్యానించు సత్కావ్యముల్
సుమ తుల్యంబులు వ్రాయు నాకు సరియా! స్థూలైక చక్షుష్కులా
తమతో రాగలరేమొ సాటిగ సినీతారల్ కళానైపుణిన్॥

శ్రీ కె. వెంకటస్వామి

"తల్లికి మగడైనవాడు ధన్యుడు ధరలో"

సల్లలితమ్ము కవిత్వము
వెల్లువయై చెప్పు శాస్త్రవిజ్ఞాండవధా
నోల్లసితుండు, కళామ
తల్లికి మగడైనవాడు ధన్యుడు ధరలో॥

శ్రీ అక్కిరాజు సుందర రామకృష్ణ

"సీతకు రావణాసురుడు చిన్ని కుమారుడు నిశ్చయమ్ముగన్"

సీతకు, బూర్వజన్మమని చెప్పిరి వేదవతీసతిన్ సురా
రాతికి కూతురంచు, విమలమ్ముగ నెమ్మది మందలించుటల్
నీతులు బోధసేయుటలు నేర్పుగఁజూచిననాడు, మిత్రమా!
సీతకు రావణాసురుడు చిన్ని కుమారుడు నిశ్చయమ్ముగన్॥

శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి

"పతి తలఁగోసి వండెనొక భామిని యాత్రిక భోజనార్థమై"

సతియుట లోకులెల్లరును సాధ్వియటంచుఁ బ్రశంససేయగా
నతిథులు వచ్చుచుండునెడనర్ధమరేయిని భోజనంబును
వ్రతముగ వండిపెట్టునొకనాడు సుధీశులు వచ్చుటన్, వన
స్పతి తలఁగోసి వండె నొకభామిని యాత్రిక భోజనార్థమై॥

శ్రీ మేడిచర్ల ఆంజనేయమూర్తి

"విధవా! రమ్మనుచు భార్య విభునిం బిలిచెన్"

మదనుండంతరమందున
మథనం బొనరింపుచుండ మానిని సత్యా
స్పదుఁడూదగ పిల్లనగ్రో
వి, ధవా! రమ్మనుచు భార్య విభునిం బిలిచెన్॥

శ్రీ శలాక రఘునాధశర్మ

"నస్య మర్థించి తపముండె నరవరుండు"

ఎన్నిజన్మలనీరీతినెన్నిమార్లు
పొందవలెనింక నేటికి ముక్తి గలుగు,
నుండునన్నాళ్ళు మంచిగా నుండ, సామ
నస్య మర్థించి తపముండె నరవరుండు॥



# వర్ణనలు

శ్రీ రాచర్ల సూర్యనారాయణశాస్త్రి - భాగ్యనగరం

"తల్లిదండ్రులకు ఎవరు ప్రయోజనకారులు?"

వరశుల్కమనుపేర పైశాచికపు వృత్తి
జగతియందున మేటి జగడమాయెఁ
బొత్తిళ్ళలో బిడ్డఁబొదిగి పెద్దగఁజేసి
స్థితిమంతునిగఁజేయఁ జెడు నుండెఁ
బిల్లలే లేనట్టి చల్లని తల్లికి
బహుమానములనిచ్చు ప్రభుత యాయె
బహుమానములు వీడి సహవాసములఁబెంచి
సంతానమంది పోషణకు లేక

వారి రహదారిపైనుంచు వారికన్న
ధరను నిరపత్యులై యున్న ధన్యులందు
నార్యవాదమ్ము లొకవంక,నవనిజనుల
వాదమొకవంక, నేనేమి పలుకఁగలను?

శ్రీ కె.వి. చలపతిరావు - భాగ్యనగరం

"అకాల వర్షాలు ఎందుకు?"

భగవంతునిపై భక్తిని
నగణితముగఁబెంచునట్టి యార్యత పోయెన్
వగ పేటికినీనాటికి
భగవంతుండాగ్రహింప వర్షంబుడుగున్ ॥

శ్రీ యం.వి.యల్. నరసింహారావు - భాగ్యనగరం

"భారతీర్థస్వామి అనుగ్రహం" (లయ గ్రాహిలో)

సంతసము నిండుకొన చెంతనిడి ప్రేమమెయి
వింతయగు వత్సలత స్వాంతమున నిండన్
దంతువునఁబూవులననంతములు గూర్చునటు
లంతరము పద్యములనంతములు గుప్పన్
బంతమున దీక్షఁగొని వింతనవధానత ర
హింతువని ధీమతి సుఖింతువనుచున్ వే
దాంత విదులైన బుధులెంతయును దీవనలఁ
బంతురన బూర్వకృత మెంత సుకృతంబొ ॥

శ్రీ పాతూరి నాగరాజు - భాగ్యనగరం

"సభను ఉత్పలమాలలో వర్ణించుట"

పండితులుండవచ్చునని వారణనాళువుఁజెప్పు సత్కవుల్
మెండుగనుండవచ్చుఁగృషిమించిన వ్యాకరణంబునందును
ద్దండులునుండవచ్చుఁబలుతార్కికులుండఁగవచ్చుఁదప్పులే
యుండఁగవచ్చు నే సలుపుచుండెడి యీ యవధానమందు నా
కండగనుండి నన్నుఁబరిహాసము సేయరటంచునెంచెదన్ ॥

శ్రీ చక్రావధానుల రెడ్డప్పధవేజీ - భాగ్యనగరం

"మీ కవితాధారపై (లయహారిలో")

కవనమును జలువుటయు సవనమును జలువుటయు
నెవరికయినను సుకృతమవునది యథార్థం
బవిరళ కృషిని జలిపి ప్రవిమల రసము నిలిపి
తొవచెలుల హితుని గుణ కవితలను వ్రాయన్
సవితృగతినెఱుఁగునఁట పవనుగతి బరఁగునఁట
కవిఘనత జగతిపయి నవనవత గొంచున్
కవనమతినొసఁగుటను భవుని నుతి సలిపెదను
బవలనక నిశియనక దివిజ జననాథున్ ॥

శ్రీ లక్కింశెట్టి సూర్యనారాయణమూర్తి - భాగ్యనగరం

"శతావధానిగారి కుడిపాపిడి వైశిష్ట్యము (ఆటవెలఁదిలో)"

కుడియునెడమయైనఁగూడదు దోషమ్ము
తమరు వినరె దేవదాసు పలుకు
పరఁగవలయు గాని పాపిడి యెటనున్న
కాదు దోషమని ప్రసాదు పలుకు ॥
(అప్పటిలో కడిమిళ్ళ కుడిపాపిడి తీసేవారు)

శ్రీ అద్దేపల్లి సోమనాథం - భాగ్యనగరం

"వర్షాకాలములో మేఘాచ్ఛాదితుడైన చంద్రుడు"
(హయ ప్రచారరగడలో)

వర్షమందుఁబరఁగుచుండు
హర్ష ముడిగి యబ్జవైరి
శీర్షమందుఁ జేరె బాధ
తర్ష మెసఁగఁదారఁజేరె ॥

శ్రీ కొండూరి నారాయణమూర్తి - భాగ్యనగరం

"ఉత్తమ సాహిత్యము ఎలా ఉండవలెను" (నర్కుట వృత్తంలో)

హృదయమునందు సమ్మదమునేర్పడఁగావలె సం
పదలను గూర్పఁగావలయు భాసిలఁగావలెనా
పదలను గూర్పరాదిటుల వర్తిలుచో మహిఁబా
యదు కవిశబ్దమాతనివినాతఁడె ధన్యుఁడగున్ ॥

శ్రీ కొండూరి సుబ్రహ్మణ్యం - భాగ్యనగరం

"జ్ఞానియైన నాస్తికుడు, అజ్ఞానియైన ఆస్తికుడు, విద్యావంతుడైన చోరుడు, కామాంధుడైన వృద్ధుడు వీరిలోని సామాన్య గుణములు (ఉత్పలమాలలో)"

జ్ఞాన విహీనుఁడై చెలఁగు జాడ్యున ఆస్తికుఁడైననేమి, వి
జ్ఞానముఁగల్గి నాస్తికత సాగినచో సుఖమేమికల్గు, వి
ద్యానిధియయ్యుఁజౌర్య పరతంత్రుఁడుకాఁగ భవంబు లేదు, కా
మానకు లొంగి వృద్ధుడును మాన్యుఁడు కాఁడిల మూఢులందఱున్ ॥

శ్రీ ఈరని శ్రీరామశర్మ - భాగ్యనగరం

"కృష్ణరాయని మానసిక సౌందర్యము - అన్నపూర్ణాదేవి తొలిరేయి పడకగదిలో అతని జంపబోయిన సందర్భములో" (జలద వృత్తం)

హాసముతోడ మేనునుపహారముగాన్
దీసికొనంగఁజాలమిని దేవి! యిటుల్
రోసము నొందనేలకొ, మరుల్గొనకా
వేశముఁబొందుచుంటివి యవిజ్ఞతతోన్ ॥

శ్రీ హెచ్. హరిశ్చంద్రారెడ్డి - భాగ్యనగరం

"గోమహిషమ్ములు లాగు బండిని సంసారముతో పోల్చి చెప్పుడు"

గోమహిషమ్ములం గలిపి కూర్చినచో శకటప్రయాణమై
యీమహి నొప్పియుండఁదగునే యిటు దంపతులుండఁగోరుటల్
కామము ధర్మమార్గమున గాఢతనొంది సుఖ ప్రయాణమున్
సేమముతోడ జేయదగుఁ జెల్లుసుమీ యనురాగమివ్విధిన్ ॥

శ్రీ రాంభట్ల శివప్రసాద్ - భాగ్యనగరం

"వృద్ధుడు, శస్త్రచికిత్సలో నిపుణుడు, అయిన వైద్యుడు హఠాత్తుగా కవి అయినచోనాతని మనోభావాలెట్లుండును"

రుధిరంబట్లు రసంబు నింపఁదగనే రూప్యంబులార్జింపనే
సదసద్యోచనబద్యనాడులను నీషద్భేదరూపమ్ముగాన్
గదియింపందగనే విశేషముగనీ కావ్య ప్రపంచంబునం
దది జీవాత్మక రత్నమై పరఁగదే! ఆర్యుండఁగాకుందునే ॥

శ్రీ అత్తలూరి రాధాకృష్ణమూర్తి - భాగ్యనగరం

"శారదాదేవి మీద చంపకమాలలో"

సరస కవిత్వ వైఖరిని సన్నిధి సేయఁగలట్టి సన్నిధిన్
జిర యశ మబ్బఁజేయుటకుఁజేయఁగ నెన్నొ వధాన ధోరణుల్
సరస మతిన్ స్మరించెదను శారదనివ్విధి భావవీధిలో
బరుగులు తీయఁగాఁదగిన భాషయు భావము నాకొసంగఁగన్

శ్రీ టి. రామగోపాల్ - భాగ్యనగరం

"సరస్వతీదేవి వీణాగానము చేయుచుండగా ఆమె గాజుల శబ్దమెట్లుండును?"

స్వర సంధాన విధాన మాధురులు విస్ఫారింపఁదాళస్థితిన్
వరవీణా మృదుపాణి పాణియుగ సంవాసంబు భాసింపఁగన్
గరయుగ్మ స్థిత రత్నకంకణ ఝణత్కారంబు తోరంబుగన్
బరగున్ శ్రావ్యము భవ్యమౌచుఁ గడు దివ్యంబైన కావ్యంబుగన్ ॥

శ్రీ లంక వేంకట సుబ్రహ్మణ్యం - భాగ్యనగరం

"ఇందిరాగాంధీ మరణవార్త విన్నప్పటి మీ భావాలు"

బలవంతుల్ బలహీనులన్ మలపు దౌర్భాగ్యంబు పోనాడఁగా
గల మేధావినిఁజూడఁజూడనొక 'స్టెన్‌గన్' క్రూర దృక్కాంతికిన్
బలియై పోవుట కంచె చేను దిను దౌర్భాగ్యంబు గాఁబోలు నీ
పలుకేదీ ప్రియదర్శినీ! మధుర వాగ్వైదుష్య మేపారఁగన్॥

శ్రీ వి. నారాయణ - భాగ్యనగరం

"భక్తి వైరాగ్యాల మధ్యగల తారతమ్యము"

భక్తియుండవచ్చుఁబరఁగు భోగములందు
రక్తి నొందకుండు భక్తిఁగొనఁడు
భక్తి గల్గి పైని వైరాగ్యముం గల్గు
వాఁడు ధన్యుఁడనఁగఁ బరఁగుచుండు ॥

శ్రీ పి. నాగభూషణరావు - భాగ్యనగరం

"బైట సిటీబస్సుల హోరు - ఇక్కడ పద్యాలజోరు (శార్దూలవృత్తములో)"

నేనే యంచును వాహనంబులుహుఁనేనేయంచుఁబద్యంబులున్
నేనే యంచును నేనెయంచు మఱి నేనేయంచు నేనంచు నే
నే నేనే యని మీఁద మీఁదఁబడుఁగానీ ప్రేక్షకుల్ మెచ్చఁగన్
నానోటన్ వినిపించు పద్యములె యానందంబు సంధించెడిన్॥

శ్రీ జి. హనుమంతరావు - భాగ్యనగరం

"విజయనగర రాజ్యస్థాపనకు విద్యారణ్యుల కృషి"

కలిమిం బెంచు ముహూర్తమెంచుకొని శంఖ ధ్వానమున్ జేయఁగా
బలుకన్ వేఁటొక జంగమద్దరిని దా ధ్వానంబు గావింప వ్యా
కులతన్ జెందియు రాయసోదరులు శంకుస్థాపనం జేయఁగా
బొలిచెన్ మూడు సహస్రముల్ నిలువకే మన్నూఱు వర్షంబులే॥

శ్రీ మోచర్ల నాగరాజు - భాగ్యనగరం

"మీ అవధానవార్త నారదునివలన విని పార్వతీ పరమేశ్వరులు వచ్చినచో నెట్లుండును?"

కలహము మాత్రమే తమకుఁగా వలెనంచు వచించుచుంద్రు లో
కులు పలుగాకులౌచునిటఁగూడు జనంబులు సాహితీపిపా
సులు, పలు పండితోత్తములు, సూక్ష్మమతుల్, కవిరాజరాజులున్
బొలయు శతావధానమును బొందికఁజేసె వరప్రసాదుడై ॥

శ్రీ వేణుగోపాలాచారి - భాగ్యనగరం

"దశావతారములు"

పది వేసంబులయందు ధార్మిక విధిన్ భాసింపగానెంచి, చె
ల్లెదు నీవక్కట పెక్కురూపముల వర్ణింపం దరంబౌనె,య
య్యదిగో మత్స్యము, కూర్మరాజము వరాహమ్మున్ నృసింహమ్ము పేం
ద్ర దశాస్యాంతక జామదగ్న్య హరి బుద్ధ స్ఫార కల్క్యాఖ్యమున్॥

శ్రీ యస్. అనంతరెడ్డి - భాగ్యనగరం

"జీవన్ముక్తి ఉపాయము"

పరునికుపకారమును జేయఁబరఁగెనేని
నేరికపకారమును జేయనెంచడేని
ధన్యుఁడై వాఁడు ధరలోనఁదనరుచుండు
ఇంతకన్నను వేదాంతమేమి కలదు ॥

శ్రీ పి. ఆనందరావు - భాగ్యనగరం

"శివకేశవులకు అభేదము (ఉత్పలమలలో)"

కేశవుఁడొక్కఁడే ఘనుఁడు, కేశవుఁడే మన దైవమంచు, గౌ
రీశుఁడె దైవమంచునతఁడే ఘనుఁడంచు వచించుచుందురా
యీశునికేని, కేశవునికేనియు భేదము గానరాదు, వా
రాశియునొక్కరూపము, తరంగములే పదివేల రూపముల్ ॥

శ్రీ వై. సత్యనారాయణ - భాగ్యనగరం

"మంచి ప్రభువు లక్షణములు"

ధర్మము నాల్గుపాదములఁదారసిలన్వలె, రాజనీతిలో
మర్మమెఱుంగగావలయు, మాన్యతనంది గమింపఁగావలెన్
భర్మమయంబు దేశమును భావ్యముగాఁబరులొందనీక, స
త్కర్మలు సేయుచుండవలె దక్షుఁడుగావలె రాజు నిచ్చలున్॥

శ్రీ పాతూరి రవి - భాగ్యనగరం

"దీపనిర్వాణ గంధము (శార్దూల వృత్తములో)"

పోగాలంబది దాపురించునెడలన్ బోఁగోరు శాస్త్రార్థ వి
ద్యాగంధంబును స్వీకరింపరఁట, మిత్రప్రోక్త సంభాషణల్
రాగాలంచు నిరాకరింతురఁట తైలంబింక నిర్వాణమై
పొగన్ దివ్వెల తావి మూర్కొనరు నాశంబందు కాలమ్మునన్ ॥

శ్రీ యం.వి. రమణ - భాగ్యనగరం

"ఆదిశంకరులకు నేటి శంకరులకు పోలిక"

మతవిద్వేషములెక్కువైనపుడు సన్మార్గార్థుఁడై తాను బూ
జ్యత గల్గించెడి మార్గమందు కవితా సాంగత్యముంగూర్చి, యు
న్నతుఁడై సాగిన శంకరాఖ్యునకు వీణాపాణి యైనట్టి భా
రతియై భారతి వచ్చినా రిటకు తీర్థస్వామి సత్తీర్థులై ॥

శ్రీ పరచ కిషన్‌రావు - భాగ్యనగరం

"సగుణోపాసన చేయువారికి భగవంతుడు పుంలింగమా! స్త్రీలింగమా!
నపుంసకలింగమా! మఱి యితరమైన దానిని ప్రతిపాదింతురా!"

లింగములందు నొక్కగుణలింగము చేర్పుము రమ్యభావనా
లింగము నీకుఁగల్గునెడ లేదు సమస్య రవంతయేనియున్
బంగరు పూలనుంచి యెకబాటను భద్రము సేసియుండనీ
లింగ వివక్షతోడఁబనిలేదు గ్రహింపుము లింగరాజమా! ॥

శ్రీ రాచర్ల సూర్యనారాయణశాస్త్రి - భాగ్యనగరం

"శ్రీకృష్ణుని జారుడందురు చోరుడందురు, అది సత్యమా! అసత్యమా!"

జారుఁడు గాఁడు రక్తినని శమ్మును గైకొనుచుండునాపయిన్
జోరుఁడు గాఁడు భక్తిఁగనుచున్ గ్రహియించును, భక్తలోకమం
దారుఁడు దోషదూరుఁడునుదారుఁడు వీరుఁడు, తా, నిరస్త భూ
భారుఁడు దేవలోక పరిపాలుఁడు జారుఁడు చోరుఁడెట్లగన్ ॥

శ్రీ కె.వి. చలపతిరావు - భాగ్యనగరం

"కంప్యూటర్ చిత్రగుప్తునకవసరమయినచోనెట్లుండున్!"

రణగొణమంచునీధ్వనుల లాస్యములేమి విచిత్రమో, మహా
గణకముపైని శిక్షణకుఁగావలె ట్యూటరొకండు, కాలముల్
గణనము సేయఁజాలమినిఁగాలమిదేమొ, యకాలమందు మా
రణములునెక్కువాయెనవురా యిది మాకును మారణం బగున్॥

శ్రీ యం.వి.యల్. నరసింహారావు - భాగ్యనగరం

"మార్కండేయ వరముగా మానవుడు మరణము తప్పించు కొనవచ్చును"

నొసటన్ వ్రాసిన వ్రాత దాటుటకు స్థాణుండేనియున్ జాలఁడ
య్యసమానుండు మృకండు సూతి పసివాఁడై భక్తి విశ్వాసముల్
మసలన్ గాలుని ధిక్కరింపఁగఁ ద్రిశూలంబాయుధంబైన వ
త్ససముం బ్రోచెడిరుద్రు వేడికొని భద్రంబాయువున్ బొందఁడే॥

శ్రీ పాతూరి నాగరాజు

"ఒకవైపు స్వామివారి యుపన్యాసము, అవతల పూజయు జరుగు
చుండగా ప్రేక్షకుల స్థితి"

ఇందునుందువొ యందునుందువొ యెందునుందువె చిత్తమా!
అందుచుండుఁబ్రసాదమద్దరినందు జ్ఞానమునిద్దరిన్
విందునోటికినందునద్దరి, విందు వీనులకిద్దరిన్
ఇందునుందువ, అందునుందువ యెందునుందువొ చెప్పవే!

శ్రీ చక్రావధానుల రెడ్డెప్పధవేజీ - నర్సాపురం

"సినిమాలలో వచ్చు సుత్తి పదముమీద స్తుతిమాల (పద్మనాభవృత్తం)

ఏనాడు జంధ్యాల పుట్టించెనోగాని, ఈనాటికిన్ నీవు నస్పీడకుంటే
ఆనాటనీనాటనయ్యావధానాలనార్జింతువే నాల్గు స్తంభాల పీటన్
ప్రాణంబులందీయ మాయొద్దకున్ వచ్చి పద్యంబులంగోరి తాడింతువేలా!
ఈ నాటికిన్ నిన్ను దిట్టన్ దగన్ ఛాన్సునిచ్చెన్ 'ధవేజీ' వరుండిందు సుత్తీ!

శ్రీ లక్కింశెట్టి సూర్యనారయణమూర్తి - భాగ్యనగరం

"ఇంపుగా చేపలకంపు (చంపకమాలలో)"

ముదమును గూర్చునట్టి కడుమోహమునందు వశుండఁగాన సం
పదల స్మరింపనేల స్మరభామిని! నేను బరాశరుండ, నీ
యధరమునంట గంధవతివౌదువు నిక్కము, మత్స్యగంధి! నీ
మది నిఁక సంశయమ్ములను మానుము మాన్పుము, కాము తత్తడిన్

శ్రీ అద్దేపల్లి సోమనాథము - భాగ్యనగరం

"తుంగభద్ర ప్రాశస్త్యము"

రంగత్తుంగ తరంగ వైభవములన్ రాజిల్లు నిన్గాంచుచో
గంగాసంగమమిచ్చగింపఁడట తాఁగావేరి దేవేరిగా
నంగీకారమొనర్పడేకదలి యయ్యాతీరు నీమేనికిన్
శృంగేరీ గురుపాద పద్మములు తెచ్చెన్ దుంగభద్రానదీ!

శ్రీ కొండూరి నారాయణమూర్తి - భాగ్యనగరం

"కార్మికులు సంస్కృతము నేర్చుకొని సాంకేతిక విద్యను పెంపొందించుకొనుట"

కార్మికులైనవారు తమ కార్యములందు విశేషబుద్ధి గం
గోర్మివిలోల మాలికల యొప్పులచొప్పు ఘటింపనెంచుచున్
భర్మమయంబుఁజేయుటకు, భావమయంబగు సంస్కృతంబు, తా
మర్మిలిలేక కార్యములయందుఁజరింతురు నేర్చుకొన్నచో॥

శ్రీ కొండూరి సుబ్రహ్మణ్యం - భాగ్యనగరం

"శివునితలపైనున్న చంద్రునిపై మానవుడు కాలు మోపగా, శివుడేమని భావించును? చంద్రుడేమని భావించును?"

ప్రవరుండల్ల హిమాచలంబు గదియన్ బాదమ్ములందుండు, లి
ప్తవిశేషౌషధి తా ద్రవించెనట మేధాశక్తి పెంపొందెనో
యవలీలన్ నడయాడుచుండెఁదలపైనానాటికానాడు మా
నవులన్, గౌరవమేల డిగ్గినది చంద్రస్పర్శ కావింపగన్॥

శ్రీ ఈరని శ్రీరామశర్మ - భాగ్యనగరం

"మహిషాసుర సంహారములోని అమ్మవారు మనలోని కల్మషములు పోగొట్టుటకు ఎట్లు తోడ్పడును"

మనమే మాహిష రూపమంచెఱిగి సన్మానింపనర్హంబు గా
దని బోధింపఁగ, దేవి, నాటి యసురన్ బ్రాణంబులం దీయగా
గని తత్త్వంబునెఱుంగుమోయి. స్మృతులం గావ్యంబులందున్ సనా
తనమై వచ్చెడి యంతరార్థమును సంధానింపుమా! సమ్మతిన్॥

శ్రీ హెచ్. హరిశ్చంద్రారెడ్డి - భాగ్యనగరం

"తల్లిదండ్రులను, గురువులను, స్తుతించుచు మీ పేరు పొందుపఱచి, యొక పద్యము చెప్పుడు"

కడిమిళ్ళాన్వయజాత శేషయకు వేంకట్రామశాస్త్రిన్ బ్రసా
దుడుగాఁజేయఁగ, భారతీసతికి నాథుంజేయఁదద్భారతీ
త్విడుపద్గ్రాహ్య వరప్రసాదుడ సవిత్రీమూర్తికిన్ జ్యేష్ఠుడన్
కడువృద్ధుల్ గురులెందరో గలరు వక్కాణింపగా శక్యమే

శ్రీ కె. నాగేశ్వరరావు - భాగ్యనగరం

"వివాహసమయమునకు పురోహితుడు రాకున్నచో వధూవరుల స్థితి"

అక్షతలను వేయునార్యులు వచ్చిరి
పేరటాండ్రు వచ్చి విడిదిఁగొనిరి
మమ్ముఁగలుప నేడు మాయమయ్యెను బురో
హితుఁడు గాఁడు వాఁడహితుఁడుగాని ॥

శ్రీ రాంభట్ల శివప్రసాద్ - భాగ్యనగరం

"పరీక్షాఫలితములు భిన్న వార్తాపత్రికలలో, భిన్న విధములుగా వచ్చినపుడు, ఆ విద్యార్థి తల్లిదండ్రుల స్థితి"

సంతస మొక్కవంకను విచారము వేఱొక వంకఁగల్గె, నే
డెంతటి ఘోరమా యని దహించి కృశించి గమించుటాయె, నీ
వింతల వింత హేతువులు వీనినిఁబత్రికలంగ్రహించి, కా
వింతును భస్మశేషముగ నింతకుమించి యిఁకేమి చేసెదన్ ॥

శ్రీ అత్తలూరి రాధాకృష్ణమూర్తి - భాగ్యనగరం

"తిరుపతి వేంకటకవులపై (చంపకమాలలో)"

పటిపు కవిత్వవైఖరికి బారము ముట్టిన సత్కవీంద్రులై
తిరుపతి వేంకటేశ్వర సుధీమణులొౘుఁజెలంగు వారు,నీ
శ్వర వరదత్త సత్కవన సంగతినీ యవధానమందు భా
సురముగఁగూర్చి పేర్చి కడుశోభ నొసంగిరి యాంధ్రభాషకున్॥

శ్రీ టి. రామగోపాల్ - భాగ్యనగరం

"శంకరభగవత్పాదులు పరుల వాదమును పరాస్తము చేయు వాదనసభలో సభ్యుల మనోభావములు"

పాండిత్యమ్మును భక్తియున్ గవితయున్ భాసిల్ల వేదాంతి వే
దండమ్మై నడయాడు శంకరుని వాదంబందునోడింప లే
కుండన్ దాము పరాభవమ్ము గొని పీయూషమ్ము సేవించి రా
కుండన్ సాగదు వీనితోనని సదస్యుల్ వెన్ను చూపింపరే॥

శ్రీ కొమ్మరాజు రాధాకృష్ణమూర్తి - భాగ్యనగరం

"రాముని అంగుళీయకమును చూచిన సీతయొక్క భావము"

శంకరుఁడైన రామవిభు సన్నిధి వాసముసేసి, నాథ నా
మాంకితమైన యుంగరమునందు విభుండగుపించుచుండగా
అంకిలి లేని ప్రేమ మదినబ్ధితరంగములట్లు పొంగి బా
ష్పాంకిత నేత్రయయ్యె, జనకాత్మజ, పావని చూచుచుండగన్

శ్రీ లంకా వేంకట సుబ్రహ్మణ్యం - భాగ్యనగరం

"మైకు మీద పద్యము"

పండితులు మేటి కవులును వచ్చినారు
స్త్రీలు పురుషులు పెద్దలు చేరినారు
సరసమగు వేళలో విరసమ్ముగాఁగ
ట్రిక్కుచేయకుమో యెలక్ట్రిక్కు మైక ॥

శ్రీ వి. నారాయణ - భాగ్యనగరం

"చావకముందు నిత్యమును చచ్చుచు, బ్రతికియున్న వాఁడు"
ఈ ప్రపంచమందునెల్లవేళలయందు
చావకుండ్రు సతము చచ్చుచుండ్రు
పిఱికితనము మదిని పెరుగచుండినవాడు
బ్రతుకువింత, అతకు బొతుకు బొంత ॥

శ్రీ సి. నాగభూషణరావు - అమలాపురం

"రామతత్త్వము"
రాముఁడు సర్వ రాక్షస విరాముఁడునాశ్రిత కల్ప శాఖికా
రాముఁడు దైవరూపమున రంజిలుచుండఁగ,సీత, శక్తియై
కామమునన్యలందుఁగలుగన్ బరలోకము గల్గనంచు,ని
ష్కాములుగాఁగనుండుటకుఁ గావలె దీక్ష యంటంచుఁజెప్పెడిన్

శ్రీ జి. హనుమంతరావు - భాగ్యనగరం

"మంచిగా ఉన్నపుడు చెడుగా ఉన్నపుడు, నవగ్రహ గుణములు ఎట్లుండును?
సహనమ్మొక్కటి కల్గునాడు కడు దుష్టమ్మై ప్రవర్తించునే
గ్రహమేనిన్, నినుఁబట్టఁజాలదిఁకనేలా నీకు సందేహముల్
సహవాసంబను దోసమొక్కటి మదిన్ సాగించుటన్ మానుమా!
గ్రహపాటో పొరపాటొ యంచుఁబులుకన్ గాలమ్ము వ్యర్థమ్ముగన్

శ్రీ మోచర్ల నాగరాజు - భాగ్యనగరం

"సభావర్ణనము"
కాషాయాంబర వేషధారులిట శ్లోకస్థానముం గూర్పఁగన్
రోషావేశములుజ్జగించి, కవితారూపమ్ముగా నిచ్చులున్
భాషింపజనువారు ప్రేరణ, కవిత్వమ్మందుఁగల్పించి, ని
శ్శేషంబై యలరారు సభ్యజనులాశీర్వాదముం గూర్చెడిన్ ॥



# విజయవాడ - శతావధానం

## సమర్పణ

**శ్రీ అందే వీరమల్లయ్య, నర్సాపురం**



ఆధ్యాత్మిక చింతనలో పుష్టి
సామాజిక సేవనమే సంతుష్టి
సాహిత్యమే సాహిత్యం కవిజనమే సాన్నిహిత్యం
అందనంత ఎత్తుకు ఎదిగినా
అందరికీ అందే అన్నయ్య - అందే వీరమల్లయ్య

**1985 నవంబరు 9,10**

నిర్వహణ :

**భువనవిజయ సాహితీ సంస్థ**

వేదిక :

**వేంకటేశ్వర దేవాలయం -లబ్బీపేట**

సంచాలకులు :

**డా॥ ప్రసాద రాయకులపతి**

ప్రధాన సూత్రధారులు :

**శ్రీ గానుగపాటి వేంకటహరనాథ్**

**శ్రీ బబ్బేపల్లి రాధాకృష్ణమూర్తి**

**శ్రీ కప్పగంతుల మురళీకృష్ణ**

విశిష్ట అతిథి :

**శ్రీ రావూరి వేంకటేశ్వరులు**

# సమస్యలు

శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తి - విజయవాడ

" ఉవగొని రమ్మిటుల నీరమూకను దడుపన్'.

కనుగొంటిని, నీ పొండితి
వినుతింపగ జెల్లునిటకు వేగమ రమ్మా
వినువీధిని దిరిగెడి 'తిత
ఉవ'గొని రమ్మిటుల నీరమూకను దడుపన్
(తితఉః = జల్లెడ)

శ్రీ మెట్టా వెంకటేశ్వరరావు - విజయవాడ

"చంద్రునిలోని లేడి తినసాగెను ధాత్రి దృణాంకురమ్ములన్"

సంద్రము సంద్రమున్ గదియు జాడ్పున బోరుఘటిల్లునాడు సత్
సాంద్రముకాగనమ్ముల ప్రసారము, పార్థుడు, ఫాలనేత్రుడున్
తంద్రములేక చేసెడు విధాన హరుండట వంగియుండుటన్
చంద్రునిలోని లేడి తినసాగెను ధాత్రి దృణాంకురమ్ములన్

"కలుకలవాడె రాజు కలికాలములోన దలంచి చూడగన్"

విలువలులేవు విద్యలకు విజ్ఞులకున్ సుకళాభిరాములా
వల బడినారు విత్తమున వైభవమే గణనంబు జేయ వి
ద్యలు గలవారు రాజులనునట్టిది సత్యముగాదు నేడు రూ
కలు కలవాడె రాజు కలికాలములోన దలంచి చూడగన్

" రాముని రామునిన్ మఱియు రాముని జానకి చూచె ముఱ్ఱరన్

రాముని జూచె దా బరశురాముని జూచె శచీ సతీమనో
రాముని జూచె నెమ్మదిని రంజిలెనెంతటి ధన్యనంచు సు
త్రామనుతుండు రాముడు ముదంబున నన్ను వరించెనంచునా
రాముని రామునిన్ మఱియు రాముని జానకి చూచె ముఱ్ఱరన్

"ధనములు విన్నంతమేను దంపరమెత్తున్"

వినిపించును బ్రతియింటను
దిన దినమును గొన్ని నాళ్ళు దీపావళి చెం
తనునుండుటచేత ధనా
ధనములు విన్నంతమేను దంపరమెత్తున్

"రంభను బ్రేమతో బిలిచె రాముడు కేళివనంబులోనికిన్"

దంభము నూపు రాక్షసుల దార్కొనగా మునియాగ రక్షణా
రంభకుడౌచు శాత్రవ విరాముడు చాపమునెక్కుపెట్టి సం
రంభముకాగ విల్విరిచి రమ్మని చెంతకు సీత సద్గుణా
రంభను బ్రేమతో బిలిచె రాముడు కేళివనంబులోనికిన్

" కపిని వివాహమాడినది గౌరి యెటింగి జగత్ప్రసిద్ధికిన్"
విపుల తపఃప్రభావితుని విజ్ఞతతో వలపింపనెంచి తా
దపము ధరించి, మన్మథ విదాహము గాంచి మనంబుగ్రుంగి య
చ్చపలమృగాక్షి పాదముల సన్నిధిజేరి ముదమ్ముగా వృషా
కపిని వివాహమాడినది గౌరి యెటింగి జగత్ప్రసిద్ధికిన్
"జ్ఞానవేదులునిచట నజ్ఞానులౌచు"
సరస సాహిత్య సౌరభోత్సాహ గరిమ
చేయునవధానమందున జేరి నిలిచి
వికట తార్కిక వాదాల బెనగుచుండ్రు
జ్ఞానవేదులు నిచటనజ్ఞానులౌచు
"శునకమ్మయ్యెను విష్ణుదేవుడహహా చోద్యంబుగానత్తటిన్"
కనుగొంటన్ త్రిపురాసురార్భటుల వీకన్ రుద్రుడైనాడు శ
క్తినుపాసించి, గమించి, యుద్ధమున దీప్తింబొంది భీభత్సుడై
చని యుద్ధావని గూల్చె వారలనునాశ్చర్యంబుగానుండెనీ
శునకమ్మయ్యెను విష్ణుదేవుడహహా చోద్యంబుగానత్తటిన్

శ్రీ కాశీభొట్ల సుబ్రహ్మణ్య శర్మ - నరసాపురం

"హిమగిరి పుత్రి వక్షమునవేబదినాల్గు కళల్ గనంబడెన్"
సుమధురమైన రాగమున శోభిలు వేళ నగాత్మజా సతిన్
రమణుడు చెంత జేర్చెనట రాజిలె షష్ఠి కళావిధుండున
య్యుమ నవరత్నహారమునవొప్పగ గాంచెనిదేమి చిత్రమో
హిమగిరిపుత్రి వక్షమునవేబది నాల్గు కళల్ గనంబడెన్
"పూర్ణిమనాడు చీకటులు మూగె దిగంతములందు దగ్ధమై"
నిర్ణయమైనయట్లు గమనించిన రాహువు క్రోధమూర్తియై
వర్ణము మారి మోముపయి బట్టెను జంద్రునినొక్కరేయి సం
కీర్ణ మనస్కుడౌచు మదికిన్ దిగులంట విధుండు గ్రుంకెనా
పూర్ణిమనాడు చీకటులు మూగె దిగంతములందు దగ్ధమై

శ్రీ ఎ. సీతారామాంజనేయమూర్తి - నరసాపురం

"స్తన వస్త్రమ్మును వీడె సుందరి తలంచన్ మామ తా నెమ్మదిన్"
ప్రణుతింపన్ దగు భీమసేనుని హిడింబన్ బట్టు రాసిక్యమున్
ఘన శైధిల్యము గాత్రమందెనొక లెక్కన్ గాలి స్తంభించుటన్
స్తనమధ్యంబున స్వేదవార్ధి నిలువన్ సైరింపగా లేక తా
స్తన వస్త్రమ్మును వీడె సుందరి తలంచన్ మామ తా నెమ్మదిన్
"నాలుగువత్సరాలుగల నాతికి బిడ్డడొకండు పుట్టెడిన్"
చేలము దాల్పగా దగిన చిన్నది వన్నెలతోడనున్నదీ
కాలమునందు బెండ్లి జరుగన్ వలెనంచు దలంచి తండ్రి తత్
కాల ముహూర్తమెంచుకొని కాంతునికిచ్చుట వర్షమేగ ప
ద్నాలుగువత్సరాలుగల నాతికి బిడ్డడొకండు పుట్టెడిన్

శ్రీ దళిక కృష్ణమోహన్ - నరసాపురం

"ధునిపెకలించి గైకొనియె తొమ్మిది వన్నెల రత్నరాసులన్"
మును గజనీ మహమ్మదుడు భూమిని దేవళముల్ పెకల్చి నా
శనమొనరింపగా వలయు సర్వము హైందవ ధర్మమంచుసే
నను దరలించి దోర్బలమునన్ సరయంబుగ బూని సోమనా
ధుని పెకలించి గైకొనియె తొమ్మిది వన్నెల రత్నరాశులన్

శ్రీ రావూరి వేంకటేశ్వరులు -కొవ్వూరు

"టీతో వచ్చె గవిత్వమీతనికి బోటీలేదు ముమ్మాటికిన్"
నీతోడన్ జగడంబులాడునని గానీ నీకు బ్రత్యర్థియై
ఘాతంబున్ గలిగించునంచనియొ దుఃఖంబందగా బోకు పో
టీతో విద్యలు వెల్గగా వలయు నాడేవాడు ధన్యుండు పో
టీతో వచ్చె గవిత్వమీతనికి బోటీలేదు ముమ్మాటికిన్

శ్రీ యమ్. ఏకోరామ్ - నరసాపురం

"మిత్రుని యాదేశముగొని మెలతన్ జంపెన్"
సుత్రాముని తమ్ముండట
ధాత్రిని జనియించినాడు దశరథసుతుడై
క్షాత్రముఁ జూపుచు విశ్వా
మిత్రుని యాదేశము గొని మెలతన్ జంపెన్

శ్రీ జి. వి. హరనాధ్

"రాతికి మ్రొక్కగా వలయు రాతికి మ్రొక్కిన నిష్ఫలంబగున్"
చేతము కామ సంగతికి జేరువకా ఘటియింపనెంచి ఆ
నీతుని జేసి మన్మథుని నేర్పుగ ముందుకు త్రోయ బుష్ప సం
ఘాతము సోకి యాగ్రహము క్రమ్ముకొనన్ గనునట్టి తత్పురా
రాతికి మ్రొక్కగా వలయు రాతికి మ్రొక్కిన నిష్ఫలంబగున్

శ్రీ పి. దత్తప్రసాద్ - గుంటూరు

"కుట్మలముల్ హరించి జనకుండు లాతాంగికి బ్రేమనిచ్చెడిన్"
టెట్మరి పల్కబోకు ప్రకటింపగ నాదు కవిత్వమందు పట్
పట్మని ప్రేలు దివ్వెల విభావరి నాటి తుపాకులట్లు డా
మిట్మరి మాటలాడకుము మేదినినే కవి చెప్పియుండెనే
కుట్మలముల్ హరించి జనకుండు లాతాంగికి బ్రేమనిచ్చెడిన్

శ్రీ టి. కృష్ణప్రసాద్

"పతికి తాళి గట్టెనతివ యొకతె"
వ్యసనములకువారు బానిసలుగమారి
ఆస్తి మొత్తమంతనార్పివేయ
విత్తమడుగ వచ్చు విభుని జూచినవేళ
బతికి తాళిగట్టెనతివ యొకతె!

శ్రీ ఎస్. రాధాకృష్ణ - నర్సాపురం

"భీముని శాప వాక్కునకు బీటలు వాఱెను ధైర్య శైలమే"

ఆముని శాపసంగతిని హస్తమునందు జలమ్మునుంచి సు
త్రాముని పైని జల్లుటకు దార్కొనువేళ భయంకరమ్ముగా
నీ మహియే వడంకె భయమేపుననొందెను శైలముల్ తపో
భీముని శాపవాక్కునకు బీటలు వాఱెను ధైర్య శైలమే

శ్రీ ఎస్. సుబ్బారావు

"కడిమిళ్ళవధాని దూరె గల్లుగుడెసెలో"

వడి గవితామందిరమున
కడిమిళ్ళవధాని దూరె;గల్లుగుడిసెలో
బడిదూరెను సుబ్రావట
నడచినదీ భేదమొకటె నాకున్ దనకున్

శ్రీ ఆర్. నాగభూషణశాస్త్రి

"తోకటిపోటుకోర్చుటెటులోయని కోమలి యేడ్చె భోరునన్"

రూకనొసంగు నా పితరులున్ సుఖమందగ జాలరైరి వ
న్నీకడ జూచు బానిసగ యీమగడత్తయునాడుబిడ్డలున్
యీ కలి కాలనీతి యిదియే గద తోట శిరమ్ము నుంచి యా
తోకటి పోటుకోర్చుటెటులోయని కోమలి యేడ్చె భోరునన్

శ్రీ చిరంజీవి రాజు

"రావణ కుంభకర్ణులకు రాముడు పుట్టె గుణాభిరాముడై"

పావన ధర్మ తాత్త్విక విపాటన వైరి గుణంబుతోడ ర
క్షోవరులై ఋషీశ్వరుల సోలగ జేయగ యాగదమ్ములె
ట్లో వధియించుటంచు సమయోచిత యుక్తిని గొంచు మృత్యువై
రావణ కుంభకర్ణులకు, రాముడు పుట్టె గుణాభిరాముడై



# వర్ణనలు

వేంకటేశ్వర కల్యాణం ఉత్పలమాల

శ్రీ కరమైన రూపమున జెన్నలరారెడు వేళ లక్ష్మి సు
శ్రీకుని వేంకటేశ్వరుని జేరి సనాతన సంప్రదాయ వి
జ్ఞాకృతి దాల్చ వేద విదులైన మనీషులు సుసర్వంబుతోన్
గైకొని మంత్రముల్ జదువ గాంతి చెలంగ వివాహమయ్యెడిన్
"పాలకులంతా అవినీతి పరులైతే ఎవరిననుసరించాలి"
వీనినుందువ వానినుందువ వేనినుందువె చిత్తమా
వానియందున వీనియందున బాలు రక్తము కల్మషం
బైన సంగతి నీవెఱుంగమ అందునిందును శూన్యమే
కానవచ్చును గాన చిత్తమ! కానలంబడి పోదుమా!
"గురుశిష్యవాత్సల్యము ఇప్పుడు అప్పుడు"
విద్యార్థుల్ గలరెందరోయపుడు సద్విజ్ఞానమార్జింపగన్
విద్యార్థుల్ గలరెందరో యిపుడునుద్వేగమ్ము సృష్టింపగన్
హృద్యంబై గురుశిష్యబంధమపుడెంతే గౌరవంబందగా
జోద్యంబిప్పుడు లాఘవ స్థితి గొనెన్ జూడంగ దుష్కాలమా
"ఇంద్రుడు సహస్రాక్షుడు కాగానే అతని భావము"
మూడే కన్నులు గల్గినా శివుడు కామున్ దగ్ధునిం జేసెనీ
నాడేనైతి సహస్ర నేత్రుడను బాణంబుల్ ప్రసూనంబులే
నాడే మన్మధుడేయుచో దిరిగి ప్రాణంబుల్ గ్రహింపంగ నె
వ్వాడున్ బ్రోవగలేడటంచు హరి తా భావించు డెందమ్మునన్
"కనక దుర్గ వస్తే ఆమెను చూస్తే భావన"
సంతోషించిన వాడనై సుకవితా సారస్యమింపొంద ని
శ్చింతన్ నేడవధాన సంగతిని వాసిన్ గాంచగానుంటి గా
వింతున్ సంస్తుతి దుర్గనెల్లపుడు దీప్తిం జెందనేతత్ప్రభా
ప్రాంతబందు వచించుచుండ గవితా వ్యాపారమేపారగన్

శ్రీమతి దశిక పద్మిని - నరసాపురం

"శబరిపండిన మనస్సు చంపకమాలలో"
తనకొకనాటికేనియును దర్శనమిచ్చును రాముడంచు పా
వనమగునట్టి భక్తి గుణ వైభవ రూపము డెందమందు న
మ్మని యిడునట్టి యాగతిని బూనికనూనుచు నిల్చె, రామచం
ద్రుని గనినంతనే శబరి దోయిలి వట్టెను బండె జన్మమున్
"వేంకటేశ్వర వర్ణన"
ఒక భార్యకు దాసుడనై
నక నక మనుచుంటి నేను నారీ ద్వయమే
దికమక పెట్టుట చేతన్
అకటకటా! పడితవేమొ అప్పుల పాలన్

"ఆకతాయి పరిస్థితి"

ఉన్నది భూమిపైనొ నిలుచున్నది యా దివిపైదానొయంచు
నెన్నగ లేక స్త్రీలు కనిపింపగ వారిని యప్సరోగణం
బన్నుల మిన్నలంచు సరయమ్మున బట్టగ లేవబోయి తా
దిన్నగనుండకుంట మఱి తీరికగా దినినాడులెంపలన్

"ద్రౌపదివస్త్రాపహరణంలో ధర్మజుని మనస్థితి"

చిన్నప్పుడే బండ చితుక గొట్టగలట్టి
వీరుండు భీముండు పెద్దవాడు
పశుపతిన్ మెప్పించి పాశుపతాస్త్రమ్ము
వడిగొన్న కవ్వడి నడిమివాడు
అశ్వ సారధ్యమ్మునందు వైశిష్ట్యమున్
గొన్నట్టి నకులుండున్నవాడు
కత్తి యుద్ధమునందు గడితేరి సహదేవు
డెట్టివాడే కడగొట్టువాడు

ఇందరుండియు చేయ నాకేమి వలయు
భార్యవస్త్రాపహరణాన పరిభవమ్ము
నొందుచుండగ జూచుచునుంటి గాని
నేనునిట్టి యలక్ష్మి యగ్నిని దహించు

"అవధాని మనోభావాలు

అవధానము కబళింపగ
అవధానతతోడనిచటనాశీనుడగాన్
అవధానిని గబళింపగ
అవధానత వచ్చినారలప్రస్తుతులే

"రాయలమృతి" పెద్దనగారి మనోభావన

పెద్దనవంటి వారలకు విజ్ఞుడు పెద్దరికంబునిచ్చి తా
బెద్దరికంబు నిల్పుకొనె వేడుక రాయడు గండ పెండెరం
బొద్దికనిచ్చి మెచ్చుకొని యుజ్వాల సత్కవితా విపంచి తా
ముద్దుగ మీటినాడతడు పోవుట స్వర్ణ యుగమ్ము పోవుటే

"మాచవరంలో గల ఆంజనేయ స్వామిపై మత్తేభం"

నిధివై మాచవరమ్మునందు గొలువై నిండారు వాత్సల్యమం
బుధిగా సాగెడునాంజనేయ! కవితా బుద్ధిన్ బ్రదర్శించి స
మ్ముదమున్ బొందగ బ్రస్తుతిన్ జలిపెదన్ ముమ్మారు నిక్కమ్ము నా
యెదయే యాలయమంచునెంచుకొనుమా! యీశాన పుత్రా హరీ!

"మీరే తిమ్మరుసు అయితే సాహిత్య సేవ ఎట్లుండును"

కవి గానట్టి మనీషి యొక్కడను లోకంబందు జీవింపరా
దవురా! నేర్పుడు ఛందమంచు రచనా వ్యాసంగమున్నేర్పి సూ
క్ష్మవచోరీతులునొంట బట్టుటకునై కాలంబు వెచ్చింతు రా
జ్యవధూటీ ప్రియులై కవుల్ సతతమున్ సౌభాగ్యమందింపరే!

"శరదృతు వర్ణన"

యుద్ధమునకేగు సేనకునుత్సవంబు
క్రొత్త జంటకు సరిక్రొత్త కొంటె తనము
కవుల హృదయంబులో వింత కలికితనము
కలుగుచుండును గద! శరత్కాలమందు

"విజయవాడలో అద్దెకొంపల అగచాట్లు" (చంపకమాల)

దొరికియు చావదాయె యొక త్రోవను గొంపలభించెనేని సం
బరపడరాదు చుట్టములు పక్కములద్దరి చేరరాదు బా
పురెతన జీతముందు దృణమో పణమో మిగులంగనింటియో
నరునకునద్దె గట్టవలె నారకమొపడునద్దె కొంపలన్

"పంచారామాల్లో ఒకటి"

ఆరామంబులయందునెంచెదను క్షీరారామమేయందు, నే
డౌరా లీటరు నాల్గు రూప్యములు పాలౌటన్ గొనన్ లేక దే
వా!రా రమ్మిటు నిన్నె మ్రొక్కెదను సుమ్మా! నీట నిన్ ముంచినన్
సారోదారత బాల ముంచెదవు సౌజన్యమ్ము నీదే సుమా!

"దీపావళి వర్ణన"

భేదమెఱుగక పిల్లలు పెద్దవారు
స్త్రీలు పురుషులు కోటి దీపాలు కూర్చి
సంబరము చేయు బాణసంచాలతోడ
జాతిమత భేద తమములు జారుకొనగ

"గర్భం వచ్చిన పురుషుడు, మీసంవచ్చిన స్త్రీ"
ఏమినొప్పులో ఏమినొప్పులో ఎట్లు స్త్రీలు భరింతురో
ఏమిమీసమొ ఈచికాకులనెట్లు మా మగలుందురో
ఏమికర్మమొ మాకు మీసములే యొసంగుము దైవమా
ఏమి బాధలో మాకు గర్భమునే యొసంగుము దైవమా

"పార్లమెంటుకి పోటీచేస్తారా?"

కవితారాజ్యము మాకు గల్గెనొక లెక్కావీని రాజ్యంబు సం
భవమౌసత్కవి రాజు కాగలుగ రాణ్మార్తాండుడేనాటికే
నవునా సత్కవి కాన శ్రేష్ఠపద విన్యాసంబు బోనాడి శై
శవ చాపల్యము తోడ హీన పద వైశారద్యమాశింతునే!

శ్రీ సిహెచ్. రెడ్డప్ప ధవేజి - నర్సాపురం

"శతావధాన లక్షణం"

తత్తన్మానవ మానసాద్భుతము వృత్తంబెంచి సద్భావ సం
పత్తిన్ గూర్చుచునొక్కమారు శతమున్ భాషించి యాపైని యా
వృత్తంబెయ్యేది వస్తువేమనక తానే ధారణన్ జేయుచో
నత్తున్ సుమ్ము శతావధానమనగానానంద సంధాయియై

యమ్. సతీష్ చంద్ర - భాగ్యనగరం

"కంప్యూటర్ అవధాని అయితే"

అవధానము యంత్రమ్మున
నవధానత సలుపవలయునంచెంచితివో!
అవురా! నీ సంసారం
బవునా! యంత్రమ్ము తోడనగుచో గొనుమా!

శ్రీ ఎ. కృష్ణ

"వరూధిని వస్తే ఏంచేస్తారు"

ఒక పద్యంబునునిచ్చుకొందు చనుమా! యుద్రేకమున్ జూపకే
అకళంకుండను నన్ను ముట్టుకొనకే ఔరౌర! యీపాటియ
ర్భకుడా! నీకులభించినాడటవె! భూరాజ్యంబునందున్ శకా
రకళాభిజ్ఞులు వేనవేలు కనవే! రామామణీ! పొమ్మికన్

శ్రీ పాలశంకర్ గారు

"వసంత కోకిల గానం"

పంచమ స్వరమాలపించుచు బందువున్ గలిగించుచున్
అంచయానములట్లు గానములందునందున సాగగా
బొంచి యుండిన తియ్య విల్తుడు పూని యల్లరి చేయగా
మంచి మంచి కతల్ స్ఫురించును మాదృశుల్ కలమంటుచో

కూచి రామకృష్ణ -తణుకు

"కవిగారు వెంట నక్షత్రకుడు పడితే ఏమిటి?"

అప్పుడుగంగ బోవకుమ! అప్పులనిచ్చెద కొన్నియేని నీ
విప్పటికింత చల్లపడి యింటికినేగుమ! యంచుచెప్పినే
నప్పటికొక్క మార్గమునవావల జేరెద వీడకున్నచో
జెప్పదనొక్క పద్యమును శీఘ్రగతిన్ బరుగెత్తకుండునే!

శ్రీ లక్ష్మీనారాయణమూర్తి

"సంధ్యాకాలము"

దివము పోయె ధనము తెచ్చు టెవ్విధియంచు
రాత్రిరాదు ప్రియుని రాకయెపుడొ
అంచు నలుగుచుండనాసంధ్యయును గూడ
నలుగు రేబవళ్ళ నడిమి బడుచు

శ్రీ సుబ్రహ్మణ్యం

"పెసరట్టు, ఉప్మా"

తమలపాకు వక్క తగిలిన యట్లుగా
పరిమళమ్ము తగుల స్వర్ణమట్లు
సన్మరందమొంద సంపెంగ యట్లుగాన్
ఉప్మ పెసరయట్టులొప్పు చుండు

శ్రీ నారాయణాచార్యులు

"కుళాయి దగ్గఱ స్త్రీల దెబ్బలాట"

బిందెల్ బిందెలు ఢీకొనెన్ ఒసె యొసేపేట్రేగి పోబోకు నీ
చిందుల్ మానవె తొందరెందులకె యోసీ! నీవు చెప్పాలటే
ఏందే నా మొగుడొచ్చిచెప్పవలెనా ఏందే మగోడన్న గొ
ప్పేందే నీకొక దానికే కలిగెనే ఎళ్ళెళ్ళు ఎళ్ళెళ్ళెహే!

"ఎలక్షనులో నాయకులు తెలుగు ఆడబడుచులకు ఇచ్చుమర్యాద"

తెలుగింటి యాడ బడుచులు
తెలివికి దక్కువగ నీదు దృష్టిన్ బడెనా
బిలబిలమని నీ పలుకుల
వల విసిరిననోటు చేప పడగలదటవో!

"అభిమన్యుని వీరవిహారము"

వీరవిహారము చేయుచు
సారింపగ బాణములను శత్రుద్గతినా
నారాచధారబడి నా
నా రాజన్యులును దడిసినారట భళిరా!

శ్రీమతి వి. శేషారత్నం - లంకలకోడేరు

"రాముని వాక్కులు"

బుక్కులు, ధర్మేతరులకు
చిక్కులు, నవముక్తికాంత చెక్కిలి పైనిన్
నొక్కులు, న్యాయాంబరమున
బక్కులు, శ్రీరామచంద్ర వాక్కులు సతమున్

శ్రీ నిట్టల రత్నాకరం - జంగారెడ్డిగూడెం

"లక్ష్మీదేవిని అచ్చ తెలుగులో"

అమ్మకునమ్మ అమ్మలకునమ్మయు మామకు మామయైన వా
నిమ్మయు తాత తాత వలపించెడి కొమ్మయు బమ్మయిమ్మ య
త్తమ్మయు, బత్తినిచ్చిన ముదమ్మన సొమ్ముల వాన దారలన్
గ్రుమ్మరిలంగ జేయు సిరికొమ్మయు సంద్రపుబట్టి లచ్చియే

"సముద్రుని కూతురు లక్ష్మి సముద్రుని భార్య గంగ గనుక లక్ష్మికి గంగ తల్లి. విష్ణుమూర్తి కూతురు గంగ విష్ణువు భార్య లక్ష్మి కనుక గంగకు లక్ష్మి తల్లి ఈ విధంగా లక్ష్మి తన తల్లికి తల్లియైనది అదే అమ్మకు నమ్మ' అనుమాటకు అర్థం. సముద్రుని కూతురైన లక్ష్మిని వివాహమాడిన విష్ణువు తన కూతురైన గంగను సముద్రునకిచ్చాడు ఈ విధంగా విష్ణువు మామకు మామ. ధాత అను సంస్కృతపదమునకు వికృతి తాత. బ్రహ్మ అని అర్థం సంస్కృతంలో తాత శబ్దానికి తండ్రి అని అర్థం బ్రహ్మతండ్రి విష్ణువు.

శ్రీ హనుమంతరావు

"శకుంతల కాపురానికి వెళ్ళునపుడు, కణ్వుని మనఃప్రవృత్తి"

విడువన్ జాలక యుండ జాలకయు దా వేసారు ఋష్యాత్మజన్
దడిపెట్టన్ జనదమ్మ కన్నులని సత్వస్ఫూర్తినోదార్చు క
ణ్వుడు గానీ మనమందు గుందునిల స్థాణుండేనినుద్వేగమున్
బడకుండంగల వాడె పుత్రికను దాబంపించునవ్వేళలన్

శ్రీ పార్థసారధి

"రారాజు, కవిరాజు, రేరాజు, యతిరాజు,(వీరిలో విశిష్టత)

రారాజత్వము శక్తియున్నయపుడే భ్రాజిల్లు శోభిల్లు నా
రేరాజేనియు రాత్రి భాగముల వర్థిల్లున్, ప్రకాశించుచుం
డొరా! యా కవిరాజు నెల్లపుడు విద్యా దేవతాభక్తుడై
స్ఫారంభౌ యతిరాజు తోడ, యతితో బాంధవ్యమవ్వానికిన్

**డా॥ అక్కిరాజు సుందరరామకృష్ణశర్మ**
భాగ్యనగరం

అవధానంబదిహేల యూతనికి! విద్యారాజ్ఞి ఆశీస్సులన్
భువిసంపూర్ణమునందినట్టి కవి సమ్మోహంబునన్ జూడగన్
రవిసంకాశుడితండెపో! నిజము! ధారాశుద్ధియున్, ప్రజ్ఞయున్
జవమున్ జీవము పల్కులందుగల శశ్వత్ కీర్తినిన్ మెచ్చెదన్

# అమలాపురం - శతావధానం

## సమర్పణ

**లయన్ బొండాడ వేంకట రాధారమణ గుప్త**

పాలకొల్లు

చేతులలో దానం
చేతలలో నిదానం
సమాజ హితమే ప్రధానం
అదే రాధారమణ విధానం



**1987 జూన్ 13, 14**

నిర్వహణ :

**త్రివేణి (నృత్యగీత సాహిత్యకళావేదిక)**

సంచాలకులు :

**ఆచార్య బేతవోలు రామబ్రహ్మం**

అధ్యక్షులు :

**శ్రీ రావూరి వేంకటేశ్వరులు**

ప్రధాన సారథులు :

**శ్రీ కందుకూరి పుండరీకాక్షుడు**

**శ్రీ ద్వా.నా.శాస్త్రి**

**శ్రీ బి.వి. రమణమూర్తి**

విశిష్ట పృచ్ఛకులు :

**ఉషశ్రీ (బురిజీ)**

శ్రీ వేదుల కామేశ్వరరావు - పెద్దాపురం

శ్రీరమణీయ రూపమున జెన్నలరారెడి శ్రీనివాసుడా
హారమటన్నచో ప్రణవమన్నది నిక్కమెఱుంగుడయ్య సం
సారమునందునన్ మునిగి జాణవుగావు పవిత్రమైన యోం
కారము తీపిరైయి సుఖముగా మురిపించెను భక్త బృందమున్

డా॥ అబ్బిరెడ్డి పేరయ్యనాయుడు (శతావధాని) - రెడ్డిపాలెం

అవధానమ్మనెవిధానములు వ్యాహరించునో నేర్చి సం
స్తవనీయమ్మగు సత్కవిత్వమున భాషాశక్తి సాధించి శా
స్త్రవచోనిష్ఠను సాగుగాలమున గాంతాపుత్ర లోకమ్మునే
"యవధానుల్ మరువంగ జెల్లును సమస్యా పూరణ వ్యాపృతిన్"

డా॥ రామడుగు వేంకటేశ్వరశర్మ - భీమవరం

పలుకున్ బల్కెదనాలకింపుమెపుడో వాక్రుచ్చి యున్నట్టిదే
చలమున్ బూని పవిత్ర తత్త్వమున సత్సంకల్ప సిద్ధుండుగా
గలిమిన్ శాశ్వతమంచునెంచక యశఃకాయమ్మునార్జింపు కో
వెల యాలేకద వంశవృద్ధికిరవౌ ప్రేమన్ బ్రసాదింపగన్

డా॥ జొన్నలగడ్డ మృత్యుంజయరావు, రాజమండ్రి

శ్రీమద్భవ్యమనస్కుడై సుగుణ సంసేవాగతిన్ సాగి వి
ద్యామాధుర్యము చిందునొందగల సద్యస్స్ఫూర్తిఁ జేబట్టి స
త్ప్రామాణ్యమ్ము గడించెనెల్లెడ వియద్వాణ్యాలయమ్మందుషః
"శ్రీ మాడ్కిన్ బటువాగ్వినోదకరులేరీ నేటి కాలమ్మునన్"

డా॥ అద్దేపల్లి రామమోహనరావు - కాకినాడ

అనితరసాధ్యమ్మియ్యది
గనుకను నేజెప్పుచుంటిఁగాంచుము కవిసూ
రన చెప్పిన కాశ్మీరపు
"వనిత వనితతోడ కలియ బాలికకలిగెన్ "
(బాలికకు + అలిగెన్ వనిత అనగా వనమాలి)

శ్రీ చక్రావధానుల రెడ్డప్ప ధవేజీ - నరసాపురం

నుదులందెంతటి తేజము
"కడిమిళ్ళవధానికెంత కండూతి యిటన్"
అడుగుటకై రెడ్డప్పకు
నడుగడుగునకుం జివాట్లె యామెతలౌచున్

డా॥ పోచిరాజు శేషగిరిరావు - పెద్దాపురం

సంగరమందుగాని సరసమ్ములయందునగాని పూని శత్రున
స్తంగతు జేయగాని నిజసంతతిఁగాచుటయందుగాని ప్ర
జ్ఞంగనుపింపఁజేయగల జ్ఞానియ యయ్యును వెన్నదోచునా
"దొంగకు మ్రొక్కినన్ నవనిధుల్ లభియించు శుభంబు చేకురున్

శ్రీ శిష్ట్లా సూర్యనారాయణమూర్తి - అమలాపురం

అవిరళ భక్తి తత్త్వములకంచులు ముట్టినవాడు కాగ గౌ
రవములు పొందగోరెడి విరాగి యిదేమి విచిత్రమాయె గూ
ల్చవు బలుశస్త్రముల్ మఱి హలాహలమగ్నియు వీని సుంత వే
"చవట, విరోధినామజపసంగతి సంతతముంట పాడియే"

శ్రీ పురాణపండ శ్రీనివాస్ - రాజమండ్రి

దర్భల్ చేగొని పూని సప్తపది సందర్భములో బ్రేమయా
విర్భావమ్మును బొందగా సరస సంప్రీతిన్ బ్రపంచించి యా
స్వర్భూమిన్ మరపించు సౌఖ్యముల నిచ్చల్ దేలగా జేయగా
"గర్భాధానమునాడె, కల్గిరిసుతుల్ కంజాక్షికిన్ జంటగా"

శ్రీ వెంపరాల శివబ్రహ్మశాస్త్రి - అమలాపురం

అమితోత్సాహము జూపుచు
సుమమట్టుల ధనువునెత్తి చోద్యముగాగన్
రమణుడు దశరథ భూపతి
"కొమరుడు గుణి యల్లుడయ్యె గురు జనకునకున్"

శ్రీ గుబ్బల మాధవమూర్తి - జగ్గన్నపేట

ధీ వైదుష్యము చూచి మెచ్చదగునెంతే స్పర్థఁజూపించినన్
ప్రావృట్కాలమువోలె వాదముల సంభారమ్ము ముమ్మారుగా
గావింపం గమనింపగావలయు సంఖ్యావత్ప్రకాండాళి పో
"టీ వీలుండెను జూచి మెచ్చ మునివాటిన్ బూర్వకాలమ్మునన్"

శ్రీ పోచినపెద్ది రామసుబ్రహ్మణ్యం (అవధాని) - దేవగుప్తం

అవలీలన్ గవనంబు సెప్పుటకునై వ్యాసంగమున్ జేసి శా
స్త్రవచోవృద్ధిని మేళవించి సతతోత్సాహమ్ము సంధించి తాం
డవమున్ జేయగ వాణి నాల్కతుద వీటన్ వీటనెందేవి గౌ
"రవమే ముఖ్యము మీకుమాకు సభలో రాజిల్లు బెక్కండ్రకున్"

శ్రీ బులుసు సోమన్న - ఐ పోలవరం

సలలిత నీలవర్ణుని విశాల మనస్థితి నించిమించి సం
కలితి విశేషభక్తి పలుకన్ బరతత్త్వములోని యుక్తి ని
చ్చలుగొను యాదవాళికి నిజమ్ము మనమ్ము వరమ్ము కాగ గో
"కులధనమే మహాధనము కోట్లు గడించినలాభమున్నదే"

శ్రీ వక్కలంక వేంకటనాగకిశోర్ - మానేపల్లి

కనకన విస్ఫులింగముల కాంతులు కన్గవనుండివచ్చి చే
రిన తటినెవ్వరేనియు సరే గనజాలరు తేరిపారనె
వ్వని విషయంబునందు పటు బాహుబలమ్మున శత్రుకోటియే
"వెనుకకు బోపు వాడె ఘనవీరుడనంబడు యుద్ధభూమిలో"

శ్రీ కాశీభట్ల కామేశ్వరరావు - అమలాపురం

చట్టులనుబిల్చి యొజ్జవిస్తారమతిని
వ్యాకరణపాఠమునుజెప్పనధివసించె
అధికి సరసననిజ్ఝుండుననవరతము
"అధి"యయిజ్ఝునకర్థాంగి యనగజెల్లు
(ఇజికావధ్యుపసర్గతో నవ్యభిచరతః)

శ్రీ వేదుల బాలకృష్ణమూర్తి - పెద్దాపురం

అతగులాట శమంతక
మాతతశక్తిని రచించి యార్జించె భళా
సాత్రాజితి దక్కె మురా
"రాతికి రత్నంబుతోడ రమణియు దొరికెన్"

శ్రీ బి.ఎ.ఆర్.ఎస్. శర్మ - శివకోడు

సంతసమన్న భోగముల చాటున గానము రాజరాజ శు
ద్ధాంతములందు గానము మదాలసతన్ బొడగాననట్టి ని
శ్చింతను బొందగోరెదవా చేయుము నీవు తపమ్ము ముక్తిసత్
"కాంతనుగోరి మానవులు కానకునేగవలెన్ రయంబునన్"

శ్రీ ఆదిరాజు వేంకటసుబ్రహ్మణ్యం - శివకోడు

అలయని సొలయనివాడే
సలలితముగ జన్నమొకటి సల్పినవాడై
తొలుత శ్వమాంసము తినెనా
"కలిబాధ సహింపలేక కౌశికుడడలెన్"

శ్రీ ఎ. ఆర్. కె. శాస్త్రి - అమలాపురం

అవైనంబది యేమొ? పంచశర విద్యాహృద్య సంభావనో
ద్భావమ్మున్ బొనరించుచున్ బ్రకృతి సత్కారముగానెంచి యెం
తేవిన్నాణముసూపి తెచ్చునది యేమేమీ పరిష్కారపే
"టీవిన్యస్తకరాబ్జ యొక్క కలకంఠీ రత్నమే తెంచెడిన్"

శ్రీ వడలి సుబ్బారాయుడు - మల్లాం

కనబడనీడు కాంతలను గంతుఁడెడందఁగలంచెనేమొ పా
వని పలుకాలకింపఁగల భవ్యమనస్కత మున్నెలేదు, నా
శనమును గోరి బుద్ధి పెలుచన్ గొనె వక్రత యట్టి, యింద్రజిత్
"జనకుని'ఁజంపినట్టి గుణశాలికి భక్తులు మ్రొక్కకుందురే"

శ్రీ పీసపాటి కృష్ణమూర్తి - అమలాపురం

భగ్నములైన యత్నములు పల్మరుసేసెడి బుద్ధికల్గి, యు
ద్విగ్న మనస్కుఁడై విరులు వేచఁగఁదాళఁగలేక కామసం
లగ్నతనొందు రావణుని లంకను సోకియు సీతనంటగాన్
"అగ్నివడంకెనీభువినినంగనలందురుఁ జూచుచుండగన్"

శ్రీ కొండపల్లి లక్ష్మీకాంతారావు - మోడేకుఱ్ఱు

ఎంతకాలమాయెనేనేగి భామరో!
నిన్న మొన్న కాదె నిజము సుమ్మ
వచ్చినాను గదటె! పండువ 'యీనాఁడు
"గణచతుర్థి' - నాఁడు ఫణిచతుర్థి"

శ్రీ కూచి కృష్ణప్రసాద్ - అమలాపురం

చీమల బొమ్మలు వేయుట
కైమనవాఁడిపుడు కుంచెనందిన యెడలన్
ఏమగు గొనముల 'కాణా
"చీ!'మలకేనుఁగులు పుట్టుఁజిత్రము వింటే"

శ్రీ సామవేదం సత్యనారాయణమూర్తి - పేరూరు

మసలుచునుండె వాఁడు మదమౌఢ్య మలీమస చిత్తుఁడౌచునా
యసురుల జేని రావణుని యాగడమెంచి, గమింపనెంచి, తా
నసమ విశేషశక్తిఁగొని యంజనిపట్టి మహాద్రి క్రుంగఁగా
"వసుధ వడంకఁజేయఁ గడు నైళమె లంకకునేగెనత్తఱిన్

శ్రీ టి.బి.ఎస్. శర్మ - అల్లవరం

పంటను గొని సంతానపుఁ
బంటకుఁబెండ్లిండ్లు చేసి పంప నలుగురన్
జంటల్ 'సుమాస్త్రుఁడూనిన
"వింటిని'ఁజూడ నలుగురకు వేవిళ్ళాయెన్"

శ్రీ కందుకూరి లక్ష్మీనరసింహమూర్తి - పిఠాపురం

ఏటికి వచ్చెఁగోపమది యిందునినేల శపించియుంటి, వా
గ్జాటమునల్లి భాద్రపద సంగత శుద్ధ చతుర్థియందునె
ప్పాటను జూడ రాదనుచు, భర్తయు చంద్రధరుండటంచుఁదా
"నేటికి నొక్కమాఱిగజ యీశ్వరుఁజూడదరుష్ట చిత్తయై"

శ్రీ కె.వి. ప్రభాకరశర్మ - అమలాపురం

అల్లిన బాణ సంతతినినాకసమందుననున్న రక్కసిన్
జెల్లఁగఁజేయనాయువును జేతను వింటినిఁదాల్చి దివ్యవి
ద్యుల్లతఁబోలునస్త్రము ప్రయోగముసేసి, 'సుబాహుతోడుగాఁ
"దల్లిని'ఁజంపి దాశరథి ధాత్రివెలింగెను సూర్యతేజుఁడై

శ్రీ బి.వి.ఆర్. సోమయాజులు - టి కొత్తపల్లి

అండజయాన! నీవలపునందగ రక్తిమ లేకకాదు, సొ
మ్ముండక కాదు, వేఱొకతెనొందఁగ బుద్ధియుఁబుట్టికాదు, వీ
తిండితనమ్మటన్న విని లేమవచించె'నపేత నీతిమత్
"పండితు'లైన వారలకబద్ధములాడుట భావ్యమేకదా!"

శ్రీ ఎ. సుబ్బారావు - ముక్తేశ్వరం

ఆనలినాహితాంబుజ హితాక్షుఁడునొక్కటఁ బక్షపాతియై
పూని మునీశ్వరుండొసఁగుఁబుష్పము రుక్మిణికిచ్చెనౌర! యు
ద్దానికి సైచియుంటినిది ధర్మమె! యీయుపహాస్యమేలనో!
"లేనిది లేకయుండ సరిలేమలు నవ్వుటయున్ దటస్థమా"

శ్రీ ఎస్.యమ్.వి.ఆర్.జి. కృష్ణస్వామి - అమలాపురం

శుచి సాహస్రము మిన్ను ముట్టినదియో! చోద్యమ్ముగా సూర్యుడే
యచలుండౌచుమనాతప ప్రసరణ వ్యాపారమున్ బూనెనో!
విచలద్గాత్రి హిడింబ గాత్రమునఁబెన్వేకుల్ జనింపంగఁద
"త్కుచ వస్త్రమ్ము పరిత్యజించి సతితాఁగోరెన్ దమిన్ మామనున్"

శ్రీ గరిమెళ్ల సోమయాజిశర్మ - అవిడి

చెండ్లవోలె రాలనెత్తి శ్రీకరాబ్ధి వైవఁగా
బండ్ల బండ రాలుతేలె వారధిన్ ఘటింపఁగా
నిండ్ల రాక్షసాళి దుఃఖమెసఁగి మున్గిపోవఁగా
"బెండ్లు మునిఁగె గుండ్లుతేలె వేడ్కజూడ వేలుపుల్"

శ్రీ అల్లంరాజు కామేశ్వరశర్మ - కేశనకుర్రు

సంకల్పించితివేమొ యానమునకున్ సన్నద్ధవై యుంటివో
సంకేతమ్ము గ్రహించినాఁడ ముఖసంస్కారమ్ముగావింపనే
శంకాతంకములేక వేచుమిట శీర్షస్నాతవై యుంట 'నీ
"రింకన్' గుంకుమబొట్టు పెట్టకుము తన్వీ!ఫాలభాగమ్మునన్"



# వర్ణనలు

శ్రీ పామర్తి రామారావు - మడికి

"వెంపరాలవారి కవితా వైభవం"

చక్కని సంస్కృతుల్ గురియు శారద తన్ముఖ రేఖ శోభిలన్
మిక్కిలి భక్తి పెద్దల సమీకరణంబున భాషణమ్మునన్
దక్కని యుక్తి పాణిని పతంజలి నాలుక తొంగిజాడ స
మ్యక్కలితార్థ శబ్ద నిచయమ్మది దక్కెను వెంపరాలకే!

శ్రీ కోట వేంకటలక్ష్మీ నరసింహం - తణుకు (శతావధాని)

"అవధానసభ"

సంస్కృతాంధ్రములందు సర్వకాలములందు
కృషిచేసి యెదిగిన ఋషులుగలరు
ప్రాపంచికాలోక పర్యవేక్షణలందు
మసలుకొన్నట్టి తాపసులు గలరు
అవధానములయందునభ్యాసములతోడి
యనుభవాస్పదులైన మునులుగలరు
విద్యతోబాటుగా వినయ సంపదల సం
గతి పెంచుకొను బృహస్పతులుగలరు

అట్టి కోనసీమను నిల్చి యార్యజనులు
ప్రోత్సహింపంగనిష్టికై పూనియుంటి
ఆప్తజనులార, హితులార, యార్యులార!
విజయవాణి వరింప దీవింపుడయ్య

శ్రీ ఆసు రాజేంద్ర - అమలాపురం

"శ్రీశ్రీ గొప్పదనం"

శ్రీ రంగంబున శ్రీనివాస హృదయ శ్రీగాంచి మేల్గాంచి వి
ద్యారాకేందులు గాక తప్పదెవరే తథ్యమ్ము వైప్లవ్య సం
భారమ్మున్ బొనరింపగాఁదగిన సన్మాన్యుండు ధీమూర్తి సం
చారమ్మున్ ప్రకటింపగాఁగలడు నిచ్చల్ కీర్తియే భాగ్యమై

శ్రీ సవేరా -అల్లవరం

"శ్రీలంక సమస్య"

శ్రీలంకన్ జయవర్ధనుండు ప్రభువై చెన్నొంద దామిళ్యమున్
గోలాంగూల సమూహమై యచట చీకున్ బొందు రాజీవుడి
వ్వేళన్ రామగుణాభిరాముడయి యుర్వీప్రాంతమందెచ్చటన్
జాలన్ ధర్మము నిల్పగాఁగాలడు నిచ్చల్ రావముల్ మాన్పుచున్

కుమారి కె. కాత్యాయని - నరసాపురం

"కొబ్బరిఆకుల నుండి జారు నీటిబిందువులు"

కోనసీమ కొబ్బరాకు గూడి వర్షబిందువుల్
మేనదాల్చు ప్రకృతికాంత మేని ముత్తెపున్ సరుల్
కానవచ్చినట్టులుండె గవులకెంత భాగ్యమో
ధ్యానమగ్నులౌచు జేయనంతులేని వర్ణనల్

శ్రీ నడిమింటి సర్వమంగళేశ్వరశాస్త్రి

"రాధాకృష్ణుల ప్రణయం"

రాధను నేను భక్తి భర రాజిత చిత్తను నేను నిత్యమా
రాధన సేయుదాన కనరా!యని వేడిననాడు కూర్మిమై
శోధన జేసి యాప్రణయ సుందరి మందిరమందు జేరెనా
రాధనసేయువారలనురమ్మున దాల్చును దైవమెప్పుడున్

శ్రీ కె. సూర్యనారాయణశర్మ - గంగలకుర్రు

"కౌరవపాండవులు సంధి చేసికొన్నట్లయితే కృష్ణుని మానసిక స్థితి"

మంచియు చెడ్డయుం గలసి మమ్మొక ప్రక్కకు నెట్టివైచి పా
మ్మంచును బల్కు చేయదగినట్టిది కర్జములేదు మాకికన్
మించిన పాపభారమది మేదిని యెవ్విధి మోయగల్గు ని
ర్వంచిత కాగ భూవనిత బాపురె వేరొక రూపు దాల్తునే?

శ్రీ ఎమ్.వి.ఎల్. నరసింహమూర్తి - అమలాపురం

"స్వర్గంలో రంభాద్యప్సరసల పాశ్చాత్య నృత్యం చూస్తే కల్గే అనుభూతి"

సశరీరుండనుగాగ శక్తిమెయి నే స్వర్గంబు దర్శించి సా
రస నేత్రల్ భళి నాట్యమాడ పద సంరంభమ్ము వీక్షించి సం
తసముం బొందెదనంచునెంచితిగదా నాట్యమ్ము పాశ్చాత్యమై
పస నార్జించెను నాకు వద్దికను స్వప్నంబన్నదేనాటికన్

శ్రీమతి వాడ్రేవు శారద

"త్రివేణి సంస్థ"

స్వర సంధానము సందడింప హృదయ స్థానమ్మునన్ వల్లకీ
వర నాదమ్మును గింకిణీ స్వనము దీవ్యచ్ఛక్తి సాహిత్య సం
భరమున్ బుల్కలు మొల్కలెత్త హృది సమ్మానమ్ముగావింప, సు
స్థిరమై శాశ్వతమై 'త్రివేణి' యిలపై చెన్నొందునాబ్రహ్మమున్

శ్రీ కె.వి. ఎస్. చిదంబరరావు - జనుపల్లె

"సినిమా పాటలలో అనౌచిత్యం"

చలన చిత్రములందున జలనమంది
పోయె సాహిత్యమెప్పుడో బూజుపట్టి
కలిమిగోరుచు జెప్పెడిగైత గాని
కైతలందున బలిమిని గానగలమె?

శ్రీ జి. బాలసుబ్రహ్మణ్యేశ్వర శర్మ

"వీణవాయిస్తున్న స్త్రీని శ్రీనాధుడై వర్ణించుట"

ఓతలిరాకు బాకు దొరకొజ్జనవుం సొగసున్ వెలార్చు సం
గాతపుగాణ జాణవె ఒకానొకమాట కవిత్వ సంగతిన్
చేతము బూనెనేని వివశీకృతులై తనివోవగావలెన్
నాతిరో! నీకు నాకు జత నాటుట పైడికి గంధమబ్బుటే

శ్రీ కొల్లూరి సత్యనారాయణశర్మ - అమలాపురం

"గ్రీష్మంలో స్త్రీ సంభోగం"

చలికాలమునందున నె
చ్చెలి చన్గవ ముర్మురముల చెలిమిని గాంచున్
బలిమిని వేసవియందున
గలిగించును జందనముల కమ్మందనముల్

శ్రీ యు. ఎస్. శర్మ - అమలాపురం

"త్యాగయ్య ఎందరో మహానుభావులు, అందరికీ వందనములు
అన్నాడు - మరి మీరేమంటారు?"

భావ కవి కోటికై భావ వందనములు
సరస కవి కోటికై రస చందనములు
నెసగు విప్లవ కవులకునెల్లనతులు
కవులకందఱకును గూడ కవన నుతులు

శ్రీమతి కమలాదేవి - పాలకొల్లు

"అరుణోదయంలో చీకట్లు"

బానిసతనమ్ములో మున్గ భారతాంబ
యర్ధరాత్రాన స్వాతంత్ర్యమందెనిదియ
యుదయమగుగాక చీకటి కదలకున్కి
నేటికినినయ్యిరులు మాకు నిలిచిపోయె

శ్రీ కె. ఉదయశంకర్ - కోటిపల్లి - ఆటవెలది

ఆటవెలదియైన యాడుచునాడించు
సరసులగుట దానినరయ గలరు
ఏది పల్కుగాక యెట్లు పల్కునుగాక
విశ్వదాభిరామ వేమఘనుడు

డా॥ ఎ. రాజకుమారి - రాజోలు

"ప్రభుత్వ ఆసుపత్రికి వెళ్ళవలసివస్తే రోగి మానసిక స్థితి"

ఇంకను గొంతకాలము వసింపగ గోరితి భూమిపైనినా
కింకరులైన ప్రాణములె కేవలమున్ గ్రహింయింత్రుగాని ని
శ్శంకగ వైద్యశేఖరుడు సంపద ప్రాణముగూడ దోచునా
వంక ప్రభుత్వ సంస్థలకు పోరము కల్గునె దోచివేయుటన్

శ్రీ సి హెచ్. మురళి - అమలాపురం

"ప్రముఖ శతావధానులను గూర్చి"

పరవు కవిత్వ వైఖరికి బట్టముగట్టిన సత్కవీంద్రులై
వరలు శతావధాన రస వైభవమాంధ్రికి పంచియిచ్చి సు
స్థిరతర భావసంపదల జేకొని కీర్తి గడించినట్టి యా
తిరుపతి వేంకటేశ కవి ధీరుల గొల్తు రస ప్రసిద్ధికిన్

శ్రీ వై. రాంబాబు - అమలాపురం

"వరద గోదారిని గూర్చి"

కడలి తేని పైని గన్ను వేసినదేమొ
పొంగి(యౌవనమ్ము పొరలిపోయె
పొంగి పొంగి మమ్ము ముంచి వేసిన దాయె
వరద వఱద యౌచుబదములిడుచు

శ్రీమతి వారణాసి జానకీదేవి - అమలాపురం

"అడవాళ్ళు గృహంలో చేసే అష్టావధానం గురించి"

ఆకట వధానమన్నయది యాడుది పుట్టుకతోడ నేర్చెనా
రక పిలువంగ జూచు దనరాజును పిల్లలునత్తమామలున్
ఒకపరి శాకపాకములనొద్దికగా ఘటియించుచుండనా
లికి యవధాన తత్త్వము ఫలించినదో సహజాతమై యిలన్

శ్రీ నేమాని నారాయణమూర్తి - నేదునూరు

"తోటకూరగింజపై శార్దూలము"

సారార్థమ్మును జెప్పుచుంటి గడువిస్తారంపు విశ్వమ్ములో
జేరున్ దా బరమాణు రూపుడగు రాజీవాక్షుడౌన్నత్యసం
భారుండై వనశాక బీజమును సమ్మానించి వాక్రుత్తునా
తీరున్ జూడగ చిన్న, సౌఖ్యమిడగా దేహానకున్ బెద్దయే



# అభినందనలు

శ్రీ రావూరి వేంకటేశ్వర్లు - కొవ్వూరు

శిష్యుఁడు పర్యవేక్షకుఁడు శిష్యుడు సేయు వధానమున్ గలా
ప్రేష్యము మీ త్రివేణిసభ శ్రేష్ఠులు ప్రస్తలు సూడగా మహా
భాష్యము బోధసేయుతటి భాగ్యము పట్టెను నాకు సత్య భా
భూష్యత మీరుగూర్చుటనపూర్వ ముదమ్మునఁగందళించితిన్

డా॥ బేతవోలు రామబ్రహ్మం

చెళపిళ వేంకటేశ కవి శేఖరులీ యమలాపురాన నిం
పుల దళుకొత్తగానెపుడొ పూర్వము తాము శతావధానమున్
సలిపిరటందురీవునిట సభ్యులు మెచ్చగ నూరు మందికిన్
పలుకుటలప్పగించుటలు భాసిలుగాక చరిత్ర ధర్మముల్

పలికిన పల్కులెల్ల నెటి పద్దెములై వికసించి మించగా
లలిత విధా విభాసుర విలాస సమంచిత గాంగనిర్ఝరీ
తులిత వచో నుభావములతోనవధానముచేసినాడవో
సలలిత రూపవై భవ ప్రసాదు! జయోస్తు యశోస్తు నీకికన్

రావురి వేంకటేశ కవిరాజుగురుండని పల్కినావు సం
భావితమయ్యె సోదరత భావి యుగంబిక నీది నాది ఆం
ధ్రావళి మోదముం బొరయునాకుకవిత్వమహత్త్వ వైఖరిన్
ప్లావితముం బొనర్తుమిక రమ్ము కరమ్మునురమ్ము గల్పుచున్

ఆశువుగాగ బద్దెములనల్లుటయందును గూడ నీవు న
భ్యాస వశాన సత్కవిత భాసిల బల్కితివో ప్రసాదు సే
బాసని మెచ్చినారలు సభాసదులెల్లరు ధన్యుడై తివా
వేశ కవిత్వ వైఖరికి విశ్రుత కీర్తిని నించి మించుమా!

లక్షలనీయరయ్యిరమలాపురమందలి పౌరులంచు సం
వీక్షణనెంచబోకుముసుమీ! గుణధాములు ప్రస్తులైరి నీ
శిక్షణ బట్టిచూచిరి వశీకృత చిత్తులు మెచ్చిరింక న
బ్జాక్షికి వాణికిన్ బసిడి పల్లకి మోయర! నా సహోదరా!

నీయవధాన యజ్ఞమును నిర్వహణంబొనరించినాడవ
త్యాయతమైన నీ ప్రతిభ "నక్షరశః"తిలకించినాడవో
హాయని మెచ్చినాడవొక యూపువ బద్దెములిచ్చినాడ దీ
ర్ఘాయువు భోగభాగ్యములునందుమ! సత్కవనంబు చిందుమా!!



# హేలాపురి- శతావధానం



సమర్పణ

**శ్రీ పాలంకి లక్ష్మీపతిరావు**

ఎల్.ఐ.సి. కరోడ్‌పతి, నర్సాపురం

వాణిజ్యంలో అలుపెరుగని గతి
ఆధ్యాత్మికతకు అంకితమైన మనస్థితి
కవిపండితలోకానికి సత్కృతి
సహృదయుడు పాలంకి లక్ష్మీపతి



**1990 అక్టోబరు 13,14**

నిర్వహణ :

**గరికపాటి ఆర్ట్స్ థియేటర్-ఏలూరు**

వేదిక :

**సీతారాంభర్తియా కల్యాణమంటపం**

డైరక్టర్ :

**శ్రీ గరికపాటి కాళిదాసు**

కన్వీనర్ :

**శ్రీ గుమ్మి వెంగళరెడ్డి**

సంచాలకులు :

**శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్య**

విశిష్ట అతిథి :

**ఆచార్య బేతవోలు రామబ్రహ్మం**

# సమస్యలు

శ్రీ పోచన పెద్ది సుబ్రహ్మణ్యం - దేవగుప్తం (అవధాని)

అమితోత్సాహముతో వధాన కవితా వ్యాపారమేపార, భా
వములోఁగ్రొత్తలు పొకడల్ నిలువ, దీవ్యచ్ఛక్తి యేపార, కా
వ్యములన్ వ్రాయుచునెల్లకాలమును శ్రేయంబందఁగా, దుర్విలా
"సమయస్ఫూర్తి యొకింతలేని కవికిన్ సత్కారముల్ గల్గెడిన్"

శ్రీ దేవరకొండ నాగేశ్వరరావు - కడలి

ధన్యత గల్గినట్టి యవధాని వధానము సేయువేళ, రా
జన్యులు పండితుల్, హృదయ సారస సూర్యులు, సత్కవీంద్రమూ
ర్ధన్యులు మెచ్చుకొంటలు పరాకృపయే యుగఁగాక, యయ్యసా
"మాన్యత కల్గియుండుటె యమానుషమయ్యె బుధాళికిచ్చటన్"

శ్రీ చిలకమర్తి సుబ్రహ్మణ్య శాస్త్రి - నరసాపురం

వినుడు వినుండు నా ప్రతిన, వెంగళులౌ నవనందులారా! బా
పని సిగ పట్టుటల్ నిజము పాపము పండుటయంచునెంచుడీ
ఇనుడను, చంద్రుఁగూడి వధియింతును మీకమవాస చూపుచున్
"నిను నిను నిన్ను నిన్ను నిను నిన్నును, నిన్నును నిన్ను నిమ్నుచున్
(నిను అను పదము 9 మారులు వచ్చినది నవ నందులతో
చాణుక్యుడుపై విధముగా పలెకెను)

శ్రీ రాళ్ళబండి కవితా ప్రసాద్ - ఒంగోలు (శతావధాని)

వశ్యుడవై నడవక, స
న్యస్యమ్మును గోరఁబోక నడువుము దృశ్యా
దృశ్యంబౌ యమ నియమా
"వేశ్యాగమనమ్ము బ్రహ్మవిద్యయ సుమ్మీ"

శ్రీ బి. వేంకటేశ్వరరావు - ఏలూరు

పాలకులైన వారు, గుణ బంధురులై యలరారు వారలున్
స్త్రీలను బూజ సేయునెడ దేవతలే తనివోదురంచు శా
స్త్రాలను జెప్పలేదో! కలుషమ్మగు జీవన వృత్తితోడ, నీ
"వాలిని గొట్టబోకుము శివా! దయ చూడు, శుభమ్ము నీకగున్"
(నీవు = ఆలిని)

శ్రీ సామవేదం జానకి రామశర్మ - వసంతవాడ

విజ్ఞానమ్మను బ్రహ్మతత్త్వమొకఁడే వెల్గున్ బ్రభాపూర్ణమై
సుజ్ఞానుల్ తపమాచరించి, సుకవీశుల్ వర్ణనల్ సేసి, బ్ర
హ్మజ్ఞానమ్మునెఱుంగఁగానగునుబో, మార్తాండ మధ్యంబునం
దు"అజ్ఞానమ్మె జనాళి బ్రోచు శతధా ఆనంద సంధాయియై"
('అ'కారమునకు 'బ్రహ్మ' అని అర్థము 'అజ్ఞానము' అనగా
బ్రహ్మజ్ఞానము "అకారస్తు పదే, భావే, పరితాపే, పితామహే" అని నానార్థ రత్నమాల.)

శ్రీ కోట లక్ష్మీనరసింహం - శతావధాని (తణుకు)

గోవునందు సురలు గూడియుందురు గాన
ఎల్లరకును పాలతల్లి గాన
లోకమందు నిజము రూపింపగా, నలు
"గాలి వాన గోవు మేలు గాదె"
(నలుగాలి వాన = చతుష్పాదజంతువులలో)

శ్రీ వడ్డి కృష్ణమూర్తి - మచిలీపట్నం

ప్రభవై, సత్కవితా విలాస రస సంపన్మూర్తివై, కీర్తి సౌ
రభముల్ చిమ్మగ బల్కు బల్కునెడలన్ రాకేందు తుల్యుండవై
అభివృద్ధిన్ గడియింపుమోయి, యిటులన్ వ్యర్థ ప్రలాపంబులన్
"సభలో నవ్వుల పాలు గాకు వినుమా! చాలింపుమా వాదనల్"

శ్రీ వద్దిపర్తి పద్మాకర్, (సహస్రావధాని) - గణపవరం

పలుకున్ బల్కెదనొండు, హృద్యమగు, సంభావ్యమ్ముగానుండు ప్రే
తల సింగారపు పంట, నవ్యనవనీత క్షిప్ర పాటచ్చరం
బలఘు ప్రక్రమ విక్రమ స్ఫురిత దైత్య ధ్వంసి తేజమ్ము శ్యా
"ములమున్ సూరి జనంబు మెత్తురు, రసాత్మంబుంచు వేనోళులన్"

శ్రీ సుంకర వేంకట రామయ్య, (అవధాని) - అర్థవరం

శ్రీ కరుఁడైన మాధవుని చిత్తము నీ వశమంచునెంచితే
ఢీ కొనినాడు రావణుడు, నిక్కము సీతయు వాని ఢీకొనిన్
ప్రాకటమైన గాథ వినుమోయి నిజంబు, వసంతసేన! ఆ
"రోకటి తోడ మాధవుని రుక్మిణి మోదెన్ సత్యమెచ్చగన్"

("మాట్లాడుతున్నది శకారుడు అతనికి యతి ప్రాసలతో పని లేదు
చెప్పే మాటలకు అనుగతి గాని, సందర్భా సందర్భములుగాని ఉండవు")

శ్రీ మీర్ జైనులా బుద్దీన్ -ములపర్రు

శౌర్యముకల్గి, నీ హృదయ సారసమందు రసమ్ము పొంగి, ధీ
వర్యులు మెచ్చునట్లు, రసవైభవముల్ ప్రచురించునట్లు, స
త్కార్యములందునట్టులవధానము జేసివర ప్రసాదుడా!
"ధైర్యము తోడ సాగుమిఁక దైవమ యిచ్చును సర్వసంపదల్"

శ్రీ చిట్టావూరి శివరామకృష్ణమూర్తి - ఏలూరు.

ముని లోకమ్ము తపమ్ము చేసినను దన్మూర్తిన్ గనన్ లేరు, వి
జ్ఞాని, దేవాత్మకు, సత్యతత్వమున మెచ్చుల్ పొంది భాసించు నా
ఘని సర్వాత్మకుఁబూజసేసి నుతిగాంతున్ బర్వతాపత్యకాం
"తుని దర్శింతును జిక్కులన్నియు విడన్ దుఃఖమ్ము దూరమ్ముగాన్!!"

శ్రీ రాంపల్లి శ్రీరామచంద్రమూర్తి - పోడూరు

ఈ పలుకిట్లు నేడు ధ్వనియింపఁగ భారతి కారణమ్ము గం
గాపగ యందు స్నానమునునాపయి పైతృక వేణిదానముల్
ప్రాపొనరంగఁజేయగల భవ్యులు యోగ్యులు త్రిస్థలాల, వే
"రే, పొనరించు సజ్జనుల రేపును మాపును బ్రస్తుతించెదన్"

" త్రిస్థలాలు: కాశి, గయ, ప్రయాగ వరుసగా గంగా స్నానము,
పిండప్రదానము, ముండనము విడివిడిగా చేయుట విధి,
వేణి = జుట్టు, దానము = ఖండనము"

డా॥ పి. రామనరసింహం - హైదరాబాద్

స్థితికిన్, సుస్థితికిన్, గవిత్వగతికిన్ శ్రీవిద్య మూలమ్ము ధీ
మతివై సాగుము సర్వకాలముల సమ్మానంబులంగాంచ, హృ
ద్గత నైర్మల్యము నిన్నుఁగాచునదియే తత్త్వమ్ము, నిచ్చల్ శుభా
"యతికిన్ నీకు వరప్రసాద వర! యాహా! మైత్రి చెన్నా రెడిన్"

శ్రీ కలపర్తి వేంకటేశ్వరరావు - ఏలూరు

అరిజన భీకరుండయిన యాతడు బాలుఁడు భీమసేనుఁడు
ర్వరఁదన శత్రువుల్ చలువు రాక్షస కృత్యముచేత గాంగని
ర్ఝరి మునుగంగనచ్చట భుజంగ జగమ్మును జేరనిల్చె, వి
"స్ఫురిత ఫణామణి ద్యుతులఁ బోల్చిన నాగకుమారుఁడో! యనన్"

శ్రీ తూములూరి విశ్వపతిశాస్త్రి - ఏలూరు

అల్లదె, దుష్ట చిత్తుఁడనయమ్మును గృష్ణను వేఁపఁజూఁచును
త్పుల్ల సరోజనేత్ర మనమున్ గ్రహియింపగ లేని మూఢుడై
ప్రల్లదమాడుచుంట గని, బాపురె, భీముఁడునూరకుండెనే
"పిల్లినిఁజూచి, యొక్క పులి భీతిని డాగుకొనంగఁజూచెడిన్

శ్రీ నేతి శ్రీరామ చంద్రమూర్తి -రాయవరం

తలమే బ్రహ్మకునైన, బ్రహ్మమును దత్త్వమ్మున్ గ్రహింపంగ, ని
శ్చల తత్త్వమ్మున, జిత్తమందు సతతోత్సాహమ్ము సంధించి, పూ
జలు సేయంగల సజ్జనాళికెపుడున్ సర్వమ్ముదైవమ్ము, కో
వెల యాల్దైవమటంచుఁగొల్తురిలలో విప్రాళి సద్భక్తితోన్
("కోవెల, ఆల్, దైవము" ఆల్ = ఆవులు)

శ్రీ కూచిభొట్ల వ్యాసలింగ శాస్త్రి - ఏలూరు

శివ సంధాయక శబ్దశక్తి, కవితా సేవా పరార్థైక గౌ
రవమార్జించి, రసంబు నించుఁగవితా రారజ్యమానుల్ కళో
త్సవ సంపత్తికి మూలకందములుగా సౌభాగ్య సంధాయులై
"కవితా రాజ్యమునేలిరా కవులు వాగ్గాంభీర్యముల్ జూపుచున్"

శ్రీ సి. బుజ్జిశాస్త్రి - ఏలూరు

మానితుఁడైన యా చిలకమర్తియ సాక్షి నిజమ్ము 'మిల్టనే'
జ్ఞానము గల్గి, చక్షువుల సంగతి లేమిని, బాహ్యదృష్టి లో
కానకునేలయంచుఁబలు కావ్యములన్ రచియించినారహో
"జ్ఞానము గ్రుడ్డివాని కరసంగత దీపికయా కనుంగొనన్"
("చిలకమర్తి లక్ష్మి నరసింహంగారు, ఆంగ్ల మిల్టన్ అంధులే")

శ్రీ వి.సీతారామారావు - ఏలూరు

అత్రిదశుల్ వియచ్చరులునబ్బురమబ్బుమంచుఁజూడ, జై
వాతృక మైత్రిగాంచి, యటఁబావని జానకిఁజూడఁబోయి, న
త్పూత స్మరింపఁ గన్నులకుఁదోచెను సీత గతింపనంతటన్
"రాత్రి, దివాకరుండదయ రాగముతోడ వెలింగెనంతటన్"

శ్రీ మునగాల రాములు - గుంటూరు

ఎల్లరు జెప్పునట్టి పలుకేగద విష్ణువు తండ్రియైన, సం
పల్లలితాంగి లక్ష్మి యసమాన నిజమ్ముగఁదల్లి గాదె, తా
నెల్లరు జెప్పినన్ వినని హీనుఁడు పంక్తి ముఖుండు సీతనా
"తల్లిని బొందఁగోరఁగను ధారుణిఁగూలెనధర్మవర్తనన్"

శ్రీ పి. ఉమామహేశ్వరరావు - మండపేట

సాధన చేయువారు విలసన్మతులై, మునుముందు నాట్య వి
ద్యాధికుఁడైన యీశ్వరు పదార్చన సేయుదురంచునెంచి, స
మ్మోదము తోడనీశునకుఁబూజలు సేయుచునుండుఁదత్పదా
"రాధిక యుమహేశునకు రాగము నేర్పినదేమి సౌఖ్యమా!"

శ్రీ చిల్లర శేషగిరిరావు - ఏలూరు

అనల సమాన తేజుడునునందము చిందులు వేయునట్టి మూ
ర్తిని, రఘురామమూర్తి, వినతిన్, వినుతిన్ గలఁబోసినట్టి జా
ణను హృదయాన నిల్పికొని నవ్వుత గాంచెను సీత, యయ్యాధీ
"త,నయుని బెండ్లి యాడఁగల తన్వియపో! చరితార్థ యిమ్మహిన్"

శ్రీ వేలూరి విద్యానాథ్- ఏలూరు

క్రొత్తగా వంటకము నేర్చుకొన్న చాన
పిండివంటలు సేయఁగా వేడ్క గల్గి
పంచదారకు బదులు లవణము వేయ
"ఉప్పు పాకానఁబడ్డ లడ్డుండ శతము"

శ్రీ మోపిదేవి భాస్కరరావు, (అవధాని) - చింతలపూడి

ఆయుత బుద్ధి శక్తి యనువౌ భుజశక్తి యు, దానిపైని, వి
ద్యాయుత శక్తి కల్గి, నయహైన్యముతోఁగుటిలత్వ దౌష్ట్య మా
యాయుత ఘోర చర్య నడయాడెడు సల్కము తిమ్మడన్ దగా
"రాయల కంటె హీనుఁడగు రాజును లేడు ధరాతలమ్మునన్"

శ్రీ దూడల రంగారావు - తణుకు

జిష్ణుండంజనిపట్టి సంతత శృత క్షీరాయిత స్వాంతుల
తృష్ణోగ్ర ప్రభవెల్గువాని, బహురంహో వైభవున్, శైలవ
ర్ధిష్ణున్ బుద్ధుని జేయఁబూని లఘు బుద్ధిన్ బ్రగ్గిరాయాసురుల్
"ఉష్ణీషమ్ముననఁగట్టనేర్తురె, మదవ్యూఢోగ్ర శుండాలమున్

## రసరాజు

తణుకు

పడిలేచిన పద్యానికి
గుడికట్టినవారు కలరు కొందరు - అందున్
కడిమిళ్ళాన్వయుడొక్కడు!
నుడికారపు దివ్వెనెత్తి నుతులంబడసెన్!

అవధానంబొక విద్య - దాని కనవద్యంబైన సాహిత్య వై
భవముంగూర్చుచునక్షరప్రభువులై ప్రాశస్త్యముంగాంచె - ధీ
రవరుల్ తిర్పతి వేంకటేశ్వరులు! తద్రాజన్యమార్గాన కీ
ర్తివిపంచిన్ "కడిమిళ్ల" మీటెను! రసాంధ్రీ! వాని దీవింపుమా!

ఒకరి మనస్సులోనగల యూహ మరొక్కరు గుర్తెరింగి - భా
వుక జగమెల్లమెచ్చ - రసపుష్టముగా - గురుశిష్యులొక్క ప
ల్లకిపయి కూరుచుండి యనురక్తి వధానము సల్పిరట్టి జం
టకు "కడిమిళ్లకోట"కు కడాని మెరుంగులు దిద్దుమో పరా!

# వర్ణనలు

శ్రీమతి వి. హేమలతా భాస్కర్

"నాడు - నేడు - రేపు - స్త్రీ"

దేవతాళి సంతసించు స్త్రీని బూజ సేయుచో
దేవతాళి శంకసేయు స్త్రీని గౌరవించుచో
కావవచ్చొ బ్రోవరాదొ కాలమింకఁజెప్పెడిన్
చేవఁగల్గు వాఙ్మయమ్ముఁజెప్పెనిట్టు నమ్మరో

శ్రీ ఇరగవరపు తమ్మిరాజు

"నన్నయ్య భట్టారకుని కవితా సుధాధార"

"అల నన్నయ్యయె శబ్దశాసన యశోహంకారుఁడై సత్కథా
వలికిన్ గూర్చెఁబ్రసన్న తత్త్వములు భవ్యంబైన సూక్తుల్ మనం
బులనిండన్ దగనక్షరంబులకుఁబ్రాపున్ రమ్యతా స్ఫూర్తి గో
కిలయే పాడినయట్లుఁగూర్చెగదరా! కీర్త్యాత్మకుండై ధరన్

కుమారి హేమలత

"శకుంతలకు మగపిల్లవాడు కాకుండా ఆడపిల్లపుడితే భావం"

నేనానాడెక ముగ్ధనైతిఁగనుకన్ నీవాక్క కిగ్గాడివై
ప్రాణంబీవని చెప్పి యిచ్చితివపత్యంబొండు నా కూతు వి
జ్ఞానాఢ్యన్ బొనరింతుఁబూరుషుల మోసంబెంత మాత్రమ్ము గై
కోనీనెప్పుఁడునంచుఁగుందు వడుచున్ గూతున్ సదా సాకునో"

కుమారి ప్రశాంతి

"అరణ్యావాసానికి ఊర్మిళ వెడితే రామాయణ స్థితి"

అవ్వన సీమకునూర్మిళ వచ్చిననక్కడ లక్ష్మణ సేవ భళా
చివ్వలు మన్మథుఁడేసిన యత్తఱి చేరిక రామునికీగలఁడా?
నొవ్విన రాముఁడు నొవ్విన సీతయు నొవ్వఁడు లక్ష్మణుఁడామెపయిన్
రువ్వును పువ్వులు రువ్వును నవ్వులు రువ్వును ప్రేమను బిడ్డలకై

శ్రీమతి జయప్రద

"ఊళ్ళు ఇస్తే ద్రౌపది పరిస్థితి"

రారాజెవ్వఁడు రాజ్యమిచ్చుటకు లేరా నాధులందింక, దో
స్సారాహంకృతిఁగల్గువారు సమరోత్సాహంబు సంధింపకెం
తేరాజన్యులు మెత్తురే సభను వృత్తిన్ లోకమీపైని మా
పో,రే పోనిరసింపదా? యని మొగమ్మున్ బ్రక్కఁగా బెట్టెడిన్

శ్రీ కె. సంగమేశ్వరరావు - గుండుగొలను

"ప్రణయ కలహం"

ప్రణయము సాగవచ్చునొక పట్టున దా బ్రళయమ్ము సేయఁబూ
నిన రస సంగతిన్ విడిచి నీరస సంగతి పట్టుకాదె కా
వున దయసేసి మీ హృదినిఁబుట్టిన కోపములన్ త్యజింపుడీ
యనయముఁబ్రేమతోడ నడయాడుట జంటకు బంటయే గదా!

శ్రీ ద్రోణంరాజు సుబ్బారావు - ఏలూరు

"కాళిదాసు గురించి"

కాళిదాసులో నిఘనమైన సంస్కార
గరిమనెఱిఁగినట్టి కాళిదాసు
గతికపాటి కాడు ఘనకుశాగ్రముపాటి
ఈ శతావధానమేఱ్వరించె

పి. శారదగారు

"కర్ణుడు శాపగ్రస్తుఁడు కాకపోతే భరతకథ"

శాప గ్రస్తుఁడుగాని కర్ణుని యశస్సారమ్ము దోస్సారమున్
ప్రాపై కవ్వడిలోని యావడికి తీవ్రత్వంబు క్షీణించు వి
ద్యాపారమ్యము చాప వేదమున శ్రద్ధన్‌బట్టి యున్నట్టి కుం
తీపుత్రున్ బరిమార్ప లోకమునఁగుంతీపుత్రుఁడే శక్యుడా

శ్రీ పోతుకూచి రామజోగేశ్వరరావు

"విఘ్నేశుని పితామహుడు"

ఆ విఘ్నేశుని తండ్రి తండ్రి హృదయోద్యాన ప్రసూనమ్ము, వి
ద్యావైదుష్య పరీమళమ్ములిడు మేధా దక్షిణామూర్తియే
శ్రీ విద్యన్ మునుముందు పూనికమెయిన్ సేవించెనామూర్తియే
శ్రీ విద్యా సముపాసనా విభముల్ సిద్ధింప దీవించెజడిన్

శ్రీ ఎస్. చంద్రశేఖరాచారి

"రామరాజభూషణుని పాండిత్యం"

శ్రీరామప్రభు పాదసేవనముతోఁజెన్నారుదాసుండుగా
నారూఢ ప్రతిభా ప్రభావుఁడగు వ్యాహారాంతరానందసం
ధారారజ్యదఖండిత ప్రథిత విద్యాశౌండతామండితుం
డారాధ్యుండుగనున్న పావనుఁడవయ్యా! రామరాట్భూషణా!

శ్రీ ఎస్. సూర్యనారాయణమూర్తి

"శతావధాన వేదిక - లలితా స్వరూపం"

విందైనచో చెవికిఁబొందైనచో జనికి మందారముల్ కవితలై
సందోహమై నడుమనందంబులన్ నిలుప బృందారకాంచితములై
కందోయినై నిలిచి డెందమ్మునై లలిత! విందీగదే శివకరీ!
స్యందింపవే సుధలు చిందింపవే కవిత వందారుఁడన్ భగవతీ

శ్రీ కూచి సీతారామమూర్తి

"సూర్యోదయవర్ణన"

నీరేజావళికిన్ ముదంబుగలుగన్ నీలాంబరంబందు వి
ద్వారాసిక్యము భక్తి తత్త్వమునమందంబైన భక్తాళి యా
త్మారామంబున సౌరభమ్ములకు భాష్యంబున్ వచింపదే
జీరావుల్ నడయాడ తిగ్మకరుడై చేరెన్ గిరిన్ దూర్పునన్

శ్రీ బి. శేషగిరిరావు

కృష్ణలీలలు

లీలలన్ జూపినీరేజ పత్రేక్షణా
హేలగా మానినీ హృద్గతంబైన రా
గాలతో సాగితో గౌరవంబందితో
చాలు నీయల్లరుల్ చాటు శృంగారముల్

శ్రీ వి. కృష్ణారావు

"పెట్రోలు పూర్తిగా లేకపోతే"

తైలములేని జీవనము ధారుణమై భరమై గమించు బా
దాలను శక్తి డిగ్గి నవతా యువతాచయమందుఁగానబ
ద్యాలను చెప్ప నేను నడయాడగలేను సుధావిశేషముల్
గ్రోలఁగ మీకదృష్టములు కూడకబోయెడివయ్య మిత్రమా!

శ్రీ మొక్కపాటి నరసింహమూర్తి

"అవధానంమధ్యలో కరెంటుపోతే భావన (పృచ్ఛకుల)"

ఈ కాంతిచ్ఛటలేల? సత్కవిత భాసించున్ విధుల్ కోటి, భా
షాకాంతిత్వమునొందివెల్గె కవితాసారమ్ము విద్యుత్తు భ
వ్యాకారుండగునట్టి లక్ష్మణయతీంద్రాఖ్యుండు సూర్యుండు వి
ద్యాకుల్ పెక్కుఁటు నిల్పియుండ కృతకంబాశింపగానేలనో
(ఆ సభలో లక్ష్మణయతీంద్రులున్నారు)

శ్రీ పుల్లాభొట్ల శ్రీరామమూర్తి - ఏలూరు

"వర్షాభావము"

వృష్టియొసంగనేల? రసవృష్టి వధానమునందుఁగల్గ సం
తుష్టినొసంగునట్లు దన తోచినయట్లును గైతలల్లువా
డిష్టుఁడు మీకు దిక్కులగుపింపక మేఘములేగిపోయె ధీ
పుష్టినొసంగనింద్రుఁడును బ్రోవఁగ నేనును నిందె నిల్చెదన్

శ్రీ ఎమ్. వెంకటేశ్వరరావు

"మానవ ప్రవృత్తి అప్పుడు - ఇప్పుడు"

నాగరికత తెలియకుండె నాటి మానవుండహో
నాగరికత నేర్చినాడు నవ్య మానవుండహో
నాగరికత యొకటెకాదు నాటి కాలమందునన్
ఆగడమ్మెఱుంగఁడాయెనాకలియునెఱుంగఁడే

డా॥ పి. భాగ్యలక్ష్మి

"శరత్కాల మేఘంలా చంచల చిత్తులు పురుషులు వరకట్న సమస్య"

శరదంభోద చలాంతరంగులట నిచ్చల్ పూరుషుల్ గానను
ర్వరనెవ్వారిని నమ్మరాదు వరశుల్క ప్రీతియే దక్క నీ
కొరకై ప్రేమనుజూప బోవరుసుమీ కూర్ముల్ ప్రపంచింపరే
తరుణీ! నమ్మకుము సత్యశాలునొకనిన్ దార్కొగనంజాలమే

కుమారి జ్యోత్స్న

"అచ్చ తెనుగు - ఆడుది"

"అచ్చతెనుంగు కైతవలె యాడుదియున్ గడిదేరునాడు తా
నిచ్చకు వచ్చినట్టులు రహిం బలుపోకలు పోవవచ్చునే
యచ్చపు నీల పెండ్లివలెనొనిక తొందర సుంత కల్గినన్
మచ్చయెవచ్చునింక వినుమా! కనుమా! తెలుగింటి నీమముల్॥

శ్రీ ఎమ్. వి.ఎస్. కుటుంబశాస్త్రి

"ఆధునిక సంఘంలో వ్యవసాయదారుని వివాహమాడుట కిచ్ఛగింపని కన్యలు"

దూరపు కొండలే నునుపు తోచుట సాజము లోకమందు 'నీ
వారము' ప్రాణదాయియను భావనడిగ్గిన కాలమందు నీ
వారమటంచు వచ్చిన వివాహమునేలకొయిచ్ఛగింపరీ
సారసలోచనల్ నిజమసార విలోచనలై చెలంగుటన్

శ్రీ నల్లా నారాయణరావు

"నాలుగు ఏరులు వస్తే పరిస్థితి"

ఏలురుపాటిపైనిచటనేరులు దాడిని సేసెనేని బ
ద్యాలను వృష్టిఁగూడి యవధాని, యొకానొక మేఘనాథుఁడై
హేలగఁజెప్పు గైతలకునింకనునెంతటి ముప్పు వచ్చునో
చాలును జన్మకియ్యదియె సంతసపుం జడి ముగ్గి తేలినన్

కోట వేంకటలక్ష్మీనరసింహం - తణుకు (శతావధాని)

"దాదర్ మరియు కాకతీయ ఎక్స్‌ప్రెస్సుల సంఘటనలు"

దారుణమ్ముజాడుమమ్మ దాదరెక్సు ప్రెస్సులో
కారుచిచ్చు రేగెనమ్మ కాకతీయ రైలులో
పోరునష్టమంచు జెప్పి పొందు లాభమంటివే
భారతాంబ! నీపవిత్ర వాక్కు తిరుగబడ్డదే

శ్రీ కొమాండూరి రంగస్వామి

"పెండ్లి పీటలపై దంపతులు పురోహితుని తొందర పెట్టుట"

ఎందుకీ పలుమంత్రముల్ నడిపింపుమోయి పురోహితా!
అందుకొంటిమి నీదు దీవెన స్వస్తి పల్కుము వేగమే
ముందు దంపతులైనవారికి ముచ్చటన్ విడెమిచ్చినన్
అందఱున్ సుఖియించువారలు హాయి నీకును మాకునున్

శ్రీ ఎన్. రామారావు

'అర్థంగాకపోయినా తలనూచేవారు"

ఈకళ వేనినేని మురిపించి రహింపఁగఁజేయుచుండునా
శ్రీకిని విద్యరాదు తనచిత్తములో వరివస్యతప్ప, య
ట్లేకద కాళమున్ మఱియునిట్టిదియే గద హస్తి సత్కళా
స్వీకరణమ్ము భద్రపదవీ నదవీయసియై చెలంగెడిన్

## గుండె గుడిలో కడిమిళ్ళ

-కోట

* బుడి-బుడి నడకల కవితకు
వడినేర్పిన ఘనుడెవండు? పండితులనునీ
యుడులోకములో వెలిగెడి
'కడిమిళ్ళ' వరప్రసాద కవిచంద్రుండే!

* విదితముగాదె!యాపరుసవేది రవంతగ దాకినంత, సం
పదలకునిక్కయౌ కనకభావమునందును లోహమట్లుగా
గదలనిదైన స్థాణువును గైగవ శ్రీ 'కడిమిళ్ళ' తాకుటన్
మొదలు తుదల్ విరుల్ విరుగబూచిన వృక్షమెయాయె గంటిరే!

* నాడువుటయే యెఱుగని నను
గడితేరగ జేసినట్టి ఘనునకు నిపుడీ
నుడినూలుపోగునిత్తును
'కడిమిళ్ళ వరప్రసాద' కవి చంద్రునకున్॥

# ఆశువులు

శ్రీ పార్థసారథి

"తెలుగు భాషపై ఆంగ్లభాషా ప్రభావము"

కలుపు గంటలు పొలమునందలమినట్లు
ఆకసమునందు కార్మొయిళ్ళమరినట్లు
తెలుఁగ బాసలో ఆంగ్లమ్ము కలిసిపోయి
కొంత చెడుచేసె, మంచిని గొంతజేసె

శ్రీ గరికపాటి శ్రీనివాసు

"తెలుగుపై సంస్కృత ప్రభావము"

తల్లి పోలిక పడుట సంతానమందు
సాజమేగాదె యందునాశ్చర్యమేమి
అమర భాషా ప్రభావమే ఆంధ్రమందు
అమరి యుండుటచేసి దివ్యత్వమబ్బె

మిస్. సిహెచ్. వైరోనికా

"హుస్సేను సాగర్‌లో పడిన బుద్ధుని బొమ్మ"

విగ్రహారాధనము మిమ్ము విడువుమంటి
నన్ను విగ్రహమ్మును చేయఁజన్నె మీకు
అనుచు హుస్సేను సాగరమ్మందు మునిగె
బుద్ధదేవుఁడు పరితాపమునఁగడంగి

శ్రీ పి. రామారావు

"యోగసాధకుడు షట్చక్రాలను ఉత్తేజింపఁజేయుట"

మూలమందుననైదు మోములను గలిగి
నాల్గు మూడు రెండొకటిగా నాట్యమాడె
వేయిదళముల పద్మాన వెలుఁగునట్టి
తల్లిదర్శించు యోగసాధకుఁడు నిజము
(లలితా సహస్రనామములలో షట్చక్రములలో అమ్మవారి
స్వరూపమును వర్ణించినది ఆధారముగా చెప్పిన పద్యము)

శ్రీ కంభంపాటి కనకరత్నం

"గరికపాటి సంస్థ - కాళిదాసుగారు"

గరికపాటి యటన్న 'గరిక' పాటియ కాక,
ఘనకుశాగ్రము పాటిగాఁగఁజెలగి
కళల మెచ్చుచుఁగళాకారులన్ రావించి,
సేవించి, విద్య భాసింపఁజేసి

సాహిత్య సౌహిత్య సారస్య సాంగత్య
సంపత్తినింత విశ్వమునకిచ్చి,
పెదపాడు గ్రామాన వెలయించి యొక సంస్థ
హేలాపురాన విస్తృత మొనర్చి

ఇల్లుగట్టుట యెట్టిదో, పిల్లపెళ్ళి
చేయుటెట్టిదో, యట్టిదై చెలఁగునట్టి
శతవధానము జరిపింప సాహసించు
'కాళిదాసుఁడు' నిజము సంస్కారపరుఁడు

శ్రీ కొండముది శాండిల్య

"సరస్వతి మ్రోయించే వీణ తీగలు తెగితే పరిస్థితి"

స్వరముల్ మేళనఁజేసి తాళమును విస్ఫారింపఁగాఁజేయఁగా
గరయుగ్మమ్మునన్న గంకణములున్, గాన ప్రపంచానకున్
వరవీణా మృదుపాణి పాణి గురువై వర్తిల్లనా కచ్ఛపిన్
వరలున్ దంత్రులు ముక్కలైన యెడలన్ బ్రహ్మాండమే ముక్కలౌ

శ్రీమతి ఎస్.వి.ఎల్. నరసమ్మ

"తెలుఁగు సాహిత్యంలో పోతన ప్రతిభ"

ఎవరి పద్దియమొక తూరియే పఠింప
గంఠ గతమౌనొ, మేను బుల్కలను గొనునొ
అమృతధారకు ధార పర్యాయమగునొ
అతఁడు రసరాజు పోతరాజతడె హితుఁడు..

మిస్ ఉషశ్రీ

"కైకేయి వరం కోరకపోతే రామాయణ గాథ"

ఆ కైకేయి వరమ్ము కోరకయె తానానందమున్ బొందుచో
నాకాకుత్స్థుఁడరణ్యమేగమియు, లంకాధీశు దౌష్ట్యమ్మున
స్త్రీకమ్మై చెలరేగు, మంచికపవాదుల్ కల్గు, ధర్మార్థముల్
సాకల్యమ్ముగ కామదూషితములై సాగున్ బ్రపంచమునన్

మిస్ శిరీష

"పాండవులు అజ్ఞాతవాసంలోపట్టుబడితే భారత గాథ"

పాండు పుత్రులే అజ్ఞాత వాసమందు
పట్టుబడిరేని కృష్ణు దైవత్వమేమి?
తుష్టినొందును దుష్ట చతుష్టయమ్ము
కడఁగి యేలును శత్రు షట్కమ్మె జగతి
భారతమ్మింక మంచికి భారమగును

మిస్ రాణి సుబ్బలక్ష్మి

"ఉల్లి మల్లిగాదు పన్నీరు పోసి పెంచినా"
ఉల్లి కిమల్లి గుణంబులు
చెల్లునె పన్నీరు పోసి సేద్యము సేయన్
ఉల్లము పైడియెయైనను
తల్లిబలెన్ సాక సవతి తల్లికివగునే"

మిస్ ఆండాళ్ళు

"కాళీపర్సుతొ సన్మానం చేస్తే"
కాళియె స్వయముగ నాకీ
వేళను పరసిచ్చె నేని, విద్యకు ఫలితం
బీలీల గలిగెనంచును
జాలివడిని నేను బొంద జాలనటయ్యా!

మిస్ పి. జయప్రద

"అవధానిని నక్సలైట్లు ఎత్తుకుపోతే"
ధారాళమ్ముగ పద్యము
లారూఢిగను విసుచున్ననత్తరిని నమ
స్కారమ్ములాచరించుచు
బారరాకో నక్సలైట్లు బలుపాకు తినన్

మిస్ ఎస్. వి. ఎన్. భాస్కరి

"సీత బంగారు లేడిని కోరక పోతే"
సీత బంగారు లేడి వాంఛింపకున్న
రావణుఁడు నేటికినిఁగూడ బ్రదికి యుండు
నేటి గూండాల పాట్లు వర్ణింపనగునె
పనియె లేకుంట బ్రదుకు దుర్భరము కాదె॥

మిస్. అశ్విని

"దూరదర్శన్ దాని చిద్విలాసం"
ప్రేక్షకుల యోర్పు సతము పరీక్షసేయు
దూరదర్శిని నేర్పు ప్రస్తుతిని గాంచు
సుంత చద్దికి నంజు రెండింతలట్లు
ప్రకటనలు వేలు విషయమ్ములొకటి రెండు ॥

మిస్. ఏంజిలా

"కిళ్లీలో సున్నం ఎక్కువైతే"
సున్నమెక్కువైనచో వీడియమ్మును
మాట లెక్కువైన బోటియున్న
పిల్లలెక్కువైన విత్తహీనునకును
నోటిచేటు, పొట్టకూటి చేటు

పి. రాహేలా

"మరువముతో మల్లెపూవు"

మరువము మల్లెతోఁగలిసి మచ్చిక ముచ్చటలాడెనేని, ను
ర్వరకది శోభదెచ్చుఁబరువమ్మునునందము గూడిట్టులున్
స్వరమును సత్యమున్ గలిసి సాగిన యట్లును, సంస్కృతాంధ్రముల్
సరసత సంగమించి కొనసాగిన యట్టులునందగించెడిన్

ఎ.వి. మంగతాయారు

"చల్లబడి పోయిన 'టీ' "

వయసు చెల్లిన వాఁడు జవ్వనినిఁగూడి
ఎంత తుష్టినినామె కందింపగలఁడొ
సౌరు గల్గినయట్టి తేనీరు గూడ
వేడి తగ్గినవట్టి తృప్తియ యొసంగు ॥

శ్రీ వారణాసి వేంకటేశ్వరశాస్త్రి

"విద్యావంతురాలైన స్త్రీ అవధానానికి వస్తే"

చదువు సంస్కారముల్ గల్గు చాన యొకతె
నాదునవధానమును జూచెనా! మనస్సు
చలనమందక యున్నె, విచార పడదె
నన్ను ముద్దాడ, తల్లిగాకున్న కతన ॥

మిస్. సిహెచ్. సుగుణకుమారి

"తెనాలి రామకృష్ణకవి "

అతని పద గుంభనమునకే యవని దాసి
అతని హాస్యమ్ము గాంచె కొండంత వాసి
పారిజాతమై నిచ్చలు బరిమళించు
రామకృష్ణుఁడు సుకవితారామ భవుఁడు

శ్రీ బి. విజయలక్ష్మి

"సూర్యోదయం - వనితాభ్యుదయం" పోలిక

వనితలన్నను వనజాలవంటివారు
జ్ఞానమే సూర్యకాంతి యీ జగతియందు
అబ్జజాతికి సూర్యోదయమ్ము వోలె
ఉవిదలకు మేలు చేయుజ్ఞానోదయమ్ము

ప్రెస్కిల్లా

"మిరపకాయబజ్జీ వంటి పురుషాధిక్యత"

మిరపకాయ వంటి పురుషుండు, పైపైని
సెనగపిండి వంటి చేతలుండు
నూనె మరగగాచి దాన వేచిననాడు
కారముండు, పురుషకారముండు

ఎ. దైవకృప

"పట్టుచీర"

పట్టుచీర కటిని బట్టుచీరయ కాదు
పట్టుచీర మగని బట్టుచీర
పట్టుచీర శుభము పట్టుచుండెడి చీర
కొనఁగవలయుఁ దెలిసికొనఁగవలయు

టి. భ్రమరాంబ

"అవధాని ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి అయితే"

వారమునకైదు సెలవులు పనిదినాలు
రెండు సేసెద, తిరుగు లేకుండఁగ్రొఁత
చెప్పువానిని మంత్రి గాఁజేయుచుందు
మందు ధరవరల్, కైతలేపండుచుండు

కె. నిర్మల

"చిల్లుగారె"

చిల్లుగారె మనకుఁజెప్పుచున్నది, ఛిద్ర
పూర్ణమవని, బ్రహ్మపూర్ణమనుచు
ఎవనికైన గాని యింతియే జీవితం
బింతియే యటంచు వింత యనుచు
(ఇంతియే = 1. ఇట్టిదే, 2, స్త్రీయే)

కె. రాజకుమారి

"జి. వేంగళరెడ్డిగారిని గూర్చి"

వేంగళరెడ్డికి, గవితా
ప్రాంగణమున నిలిచినట్టి వానికి, మదిలో
బంగరువు పరిమళించెడి
సంగాతపు పంటయైన సరసునకు నతుల్॥



# పెద్దాపురం - శతావధానం

సమర్పణ
శ్రీ ఎస్.ఎస్.ఎమ్. గోపాలరావు
నర్సాపురం

పలుకులలో మార్దవం
తలపులలో సౌహార్దం
మంచితనానికి తావు
ఎస్.ఎస్.ఎమ్. గోపాలరావు

**1992 నవంబరు 14,15 తేదీలు**

సంచాలకులు :

**ఆచార్య బేతవోలు రామబ్రహ్మం**

నిర్వహణ :

**ఆంధ్ర పద్యకవితా సదస్సు**

ప్రధాన సూత్రధారి :

**డా॥ కేశాప్రగడ సత్యనారాయణ**

# సమస్యలు

శ్రీ కాశీభట్ల సత్యనారాయణ -కాకినాడ

"అషడక్షీణము వారి వీరమకటా! ఆయుద్ధమే సృష్టికో"
ఋషిరాజోక్తముగా జెలంగునిది యుర్వీప్రాంతమందెల్లెడన్
ధిషణాహంకృతి గాఢ్ఢుపట్టి బలవృద్ధింగాంచి యాకీచకున్
గషణంబున్ బొనరింపగా ముఖరవోత్కారమ్ము శాంతింపగాన్
అషడక్షీణము వారి వీరమకటా! ఆయుద్ధమే సృష్టికో

శ్రీ నందుల గోపాలకృష్ణమూర్తి

"తోరణమ్ము సర్వానర్థ కారణమ్ము"
మూడునాడుల ముచ్చటె ముగిసిపోవు
పూవు విల్తుఁడ! నీవింటి పోలుపు గెలుపు
ఫాలనేత్రుడు రుద్రుడు వలదు శివుని
తో,రణమ్ము సర్వానర్థ కారణమ్ము

డా॥ ఎ.వి. రమణప్రసాద్, కొవ్వూరు (అవధాని)

"రేపటి పౌరులార! తమరే మనజాతి వినాశకారకుల్"
మీ పలుకాడు వేళ రసమేదుర సాదర హృద్యపద్యమై
ఆపగవోలె సాగవలెనంతియగాని, యుపప్లవంబుగా
రాపిడి వెట్టనేల గుణరాశిని వాసిని బాసిరేని యో
రేపటి పౌరులార! తమరే మనజాతి వినాశకారకుల్

డా॥ జొన్నలగడ్డ మృత్యుంజయరావు - రాజమండ్రి

"భగమ్మున్ గడిమిళ్ళ సత్కవి నిజాశుప్రౌఢి గీర్తించెడిన్"
ఇభరాడ్ప్రార్థననాలకించి తరుణీ హేలా పరిష్వంగ సా
రభమున్ వీడుచు వచ్చునట్టిదియు భద్రవ్రాతమూలమ్ము స
త్శుభసంధాయి మహామహమ్ము సతమక్షుద్రమ్ము దీవ్యత్కృపా
సుభగమ్మున్ గడిమిళ్ళ సత్కవి నిజాశుప్రౌఢి గీర్తించెడిన్

శ్రీ బి.వి.ఎస్. మూర్తి

"చరణముతోడ నాథునకు సాధ్వియొనర్చు సపర్య భక్తిమై"
సరసిజ శశ్వదుద్భ్రమణ సద్భ్రమర భ్రమకారి కుంతలో
త్కరవిలసన్ముఖమ్ము రసధారలపారముగా స్రవించును
ద్ధురతర మన్మథాస్త్ర పరితోషణ కారిణి సర్వసత్క్రియా
చరణముతోడ నాథునకు సాధ్వియొనర్చు సపర్య భక్తిమై
"జ్యోత్స్నల్ దిక్కులనాక్రమించె సుదతీ! సూర్యోదయం బయ్యెడిన్"
కృత్స్న ప్రేమ రసప్రపూర్ణ హృదయాకృష్టుండనై వచ్చితిన్
త్వత్స్నేహంబును గోరినాడను గదే వాల్లభ్యమున్ మెచ్చుచున్
ముత్స్నానంబొనరింపనీగదవె నీ పొందెంత విందో! స్మిత
జ్యోత్స్నల్ దిక్కులనాక్రమించె సుదతీ! సూర్యోదయం బయ్యెడిన్

శ్రీ భావరాజు సుబ్బారావు

రాముడు రాక్షసుండు మఱి రావణుడా పురుషోత్తముండిలన్
ఆమెతలిచ్చునట్టి సరసాంచిత గాథలు పుట్టపట్టి భా
షామతి చెప్పి పెట్టె విరజానది దాపున రామచంద్రుహృద్
రామను దొంగిలించె ఖలధాణ్మణియాతడె యాసురాంగనా
రాముడు రాక్షసుండు మఱిరావణుడా! పురుషోత్తముండిలన్?

శ్రీ శొంఠి రామమూర్తి, కాకినాడ

పానాసక్తుడు ప్రాణిలోకము సదా పాలించు శాంతంబుగన్
ధీనైశిత్య మహావిభూతిమయ వర్ధిష్ణుండు భ్రాజిష్ణుడున్
నానాశాస్త్రములన్ బఠించి యమరాన్నంబున్ భుజింపన్ వలెన్
సూనుల్ మత్రపజలంచునెంచవలెనచ్చో జ్ఞాన గంగాపయః
పానాసక్తుడు ప్రాణిలోకము సదా పాలించు శాంతంబుగన్

శ్రీ బులుసు వేంకట రామమూర్తి, అష్టావధాని - రాజమండ్రి

రాయలవారికిన్ తెలుగు రాదుగదా రసమున్ గ్రహింపగన్
ఊయలలూచినట్లు సమయోచిత రీతిని గొంతవచ్చి ఏ
దో, యిది చేసినట్లు మధురోహములన్ మురిపించునట్లుగా
హాయిని గొల్పునట్టి తెలుగవ్వలివారలెరుంగకుండిరా
రా!యల వారికిన్ తెలుగురాదుగదా!రసమున్ గ్రహింపగన్

శ్రీ తెరపల్లె ఆంజనేయులు

యోనిన్ గాంచి నమస్కరింతురమరుల్ యోగీంద్రులున్ మౌనులున్
నానాగాయన సత్కవీశ బుధరాణ్ణాట్యైక లోలాత్ములే
చానన్గొల్తురొ!యామెకున్ మొగములే స్థానంబుగాజేసి ని
త్యానంద ప్రథితాంతరంగుడగు లీలాయత్త దివ్యాంబురు
డ్యోనిన్ గాంచి నమస్కరింతురమరుల్ యోగీంద్రులున్ మౌనులున్

శ్రీ మధునాపంతుల సత్యనారాయణ, రాజమండ్రి

కార్శ్యంబందిన వారికే కలుగు సత్కారంబు లోకంబునన్
స్పార్శ్యంబందిన వారికే కలుగునుత్సాహంబు రాసిక్యమున్
భార్శ్యంబందిన నిష్ఠలోగలుగు దీవ్యచ్ఛక్తి, శాస్త్రార్థవై
మర్శ్యంబందిన సార్వకాలికత సంభావింప సచ్చింతనా
కార్శ్యంబందిన వారికే కలుగు సత్కారంబు లోకంబునన్

శ్రీ మ. జయరామయ్య

ఎంతయు వింత కాగనుదయించెను భానుడు పశ్చిమంబునన్
ఎంతటి వైపరీత్యమిది యింతలునింతలుకాగ లోకసం
భ్రాంతిగ ద్వాదశార్యములు వార్ధిని గ్రుంక మరొక్క సూర్యుడా
శాంతము వెల్గజొచ్చెనతడాద్యుడు క్లింటను నామధేయుడే
ఎంతయు వింతకాగనుదయించెను భానుడు పశ్చిమంబునన్

శ్రీ పంపన సూర్యనారాయణ - పెద్దాపురం

సారాత్రాగక పద్యమూడిపడునా! సంసారముల్ సాగునా!

సారోదార గభీర ధీర కవి వాక్సారమ్మపారమ్ము మి
స్నీరోపం జనదెందునన్ సమము కానేకాదు సంద్రమ్మువి
ద్యారామోద్భవ మల్లికాచయ మరందాలోలుడౌచున్ యశ
స్సారా! త్రాగక పద్యమూడి పడునా! సంసారముల్ సాగునా!

శ్రీ కొంపెల్ల రామకృష్ణ

నన్నయ్య నేడు లేడని మనంబుననేడ్చిరి సాహితీ ప్రియుల్

ఎన్నిక కల్గుకైత చెవికెక్కెడు దెల్గుపదాల మ్రోతయున్
క్రొన్ననపూత మేటి తళుకుం జిలుగుం గలపోత నేత వి
ద్వన్నియమ ప్రణేత మహిత ప్రథితాంధ్ర పురాణ ధాత మా
నన్నయ్య నేడు లేడని మనంబుననేడ్చిరి సాహితీ ప్రియుల్
(కీ.శే' మధునాపంతుల వారినినుద్దేశించి)

శ్రీ ద్విభాష్యం కామరాజు

వ్యభిచారమె లెస్సయనిరి పండితవర్యుల్

శుభ సంపత్కర పద సౌ
రభమందున మనము దగిలి రాణింపగదే
విభవమ్మిచ్చును విషయా
వ్యభిచారమె లెస్సయనిరి పండిత వర్యుల్

శ్రీ పురాణపండ సత్యనారాయణమూర్తి - జగ్గంపేట

సతి సేవించిన వారికెల్ల గలుగున్ సౌఖ్యోన్నతుల్ సంపదల్

అతులాత్యాదర సత్కవిత్వ హృదయాహ్లాదమ్మునందించున
ప్రతిమానాంచిత సార్వకాలిక యశోరాజత్కళాపూర్ణ సం
గతిమత్కావ్య కళావిలాస రసరాజస్ఫూర్తికృద్భారతీ
సతి సేవించిన వారికెల్ల గలుగున్ సౌఖ్యోన్నతుల్ సంపదల్

శ్రీ అధికారుల నీలకంఠం

మగడవుకమ్ము నాకిపుడమాంతముగా నిను నింగికెత్తెదన్

సొగసులు నాకు గల్గినవి చూడుము సీతను జూడుమయ్య నా
అగణితరూపవైభవ మహోస్థితి భూమిజకెట్లుకల్గు నా
మగడటు స్వర్గమేగె వినుమా! దశకంఠుడు సోదరుండికిన్
మగడవుకమ్ము నాకిపుడమాంతముగా నిను నింగికెత్తెదన్
(రామునితో శూర్పణఖ)

శ్రీమతి ఎల్. సావిత్రీదేవి

కాటుక కంటినీటికిని గారణమైనది - మద్యమే సుమా!

ఆటలనాడు జీవితములందు సుగంధము బాపి వైచి ము
ప్పూటల మాటకేమి యొక పూటకు బిడ్డకు తిండిలేని యి
క్కాటకమిట్లు వచ్చుటకు గారణమెవ్వడు?కాంతుడే గదా!
కాటుక కంటినీటికిని గారణమైనది - మద్యమే సుమా!

శ్రీ అల్లంరాజు కామేశ్వరశర్మ

దోస్తి, షోలె, డాన్, బాబి- హనుమత్ పరాక్రమం

స్థిరుడై యాహవ రంగమందు పటు 'దోస్తీ' క్షత్వమున్ జూపి బం
ధురు'డాన'ందము తోడ చెండు గపి శత్రువ్రాతమందందున
చ్చెరువున్ దాల్చుచు 'బాబి' బీబియనుచున్ శీఘ్రమ్ముగా బోవ వా
రి, రవమ్ముల్ మినుమిట్టుచున్నవి - యు'షోలేప'మ్ముగా దోచుటన్



# వర్ణణలు

శ్రీ ఆకెళ్ళ కృష్ణమూర్తి

త్రిమూర్తులు సినిమాహాలుకువచ్చి ఒకరిని గూర్చి మరొకరు అనుకొనుట

నేను గడగిన పాదమీనేలకేల?
నాదుపట్టికినిన్ని తొందరలవేల?
మూడుకన్నుల గప్పనెవ్వాడు కలడొ
యనుచు దొంగకు దేల్కుట్టినటులనుంద్రు

శ్రీ ఊర కొండలరావు

షిరిడీ సాయిబాబా అనుగ్రహం

గరిడీ సాములు చేయు సాములను లెక్కంబెట్టగానేలొకో
బురిడీల్ కొట్టక తప్పదెప్పుడయినన్ ముక్తిన్ బ్రసాదింపగా
హరుడీతండిటు వచ్చినాడు మఱి సంప్రార్థించినన్ జాలునా
షిరిడీ సాయి యనుగ్రహించి తగునాశీర్వాదమందించెడిన్

తిన్నని భక్తి

ఎన్నగానెన్నగానెంత యుద్దండుడో
తిన్నడా సామికిన్ దింటనేర్పించెనే
కన్నులన్ దీసి ముక్కంటికర్పించెనే
మిన్నయా భక్తియే మేరయా ముక్తికిన్

శ్రీ శిష్టా సత్యనారాయణ మూర్తి

దేవులపల్లి చినవేంకటశాస్త్రిగారిపై సంస్కృతం

ధీమాన్ దేవులపల్లి వంశతిలకో న్యాయాధ్వగస్సర్వదా
శ్రీమాన్వేంకటశాస్త్రి నామ లసితో విద్యోత్పలోద్యద్విధుః
సర్వైః కీర్తిత సద్గుణైః ప్రముదితః భక్త్యంబుధేశ్చంద్రమాః
తంవందే సుకళానిధిం గుణమణిం పాటచ్చరంచాపదాం

శ్రీ కర్రి అప్పల నరసింహారావు

శ్రీ గవలసాని గోపాలకృష్ణ - ప్రభుత్వాధికారి - సంస్కృతం

స్వయం గోపాలకృష్ణోసౌ మరిడంబా పదాంబుజే
బ్రమతి భ్రమరో భూత్వా ధన్యం తం నౌమి సర్వదా

శ్రీ దశిక కృష్ణమోహన్ - నర్సాపురం

స్వర్గస్థులైన శ్రీ రావూరి, శ్రీ మధునాపంతుల వారలు మీ అవధానాన్ని అచట నుండి తిలకిస్తూ కావించుకొనుచున్న సంభాషణ :

మధురకవివోలె దోచున్
మధుజీవన కర్తయంచు మదికనిపించున్
సుధలను వరప్రసాదుడు
మృదువుగ చిలికించుండె మేలు లభించున్

శ్రీ వద్దిపర్తి పద్మాకర్, (సహస్రావధాని) - ఏలూరు

అధ్యక్షుడు రామబ్రహ్మంగారు తండ్రి, భారతీపుత్ర శతావధాని పుత్రునిగా పరస్పర సంబంధ వర్ణన

నేను వరప్రసాదుడను నిక్కము భారతి తల్లినాకు వి
జ్ఞానియితండు బ్రహ్మ రస సంగతికిం దులతూగుచుండ భా
షానళినీ సుగంధములు సత్ఫలన్ బ్రచురించుచుండు వి
జ్ఞానులు మీరలెల్లరును సాక్షులు మాయనుబంధ వైఖరిన్

శ్రీ చిలకమర్తి సుబ్రహ్మణ్యశాస్త్రి - నర్సాపురం

రజతాద్రి, అంజనాద్రిపై నుండి పక్షులు ఎగురుతున్నప్పుడు రెక్కలపై పడు తెలుపు నలుపు రంగులను వర్ణించుడు.

పక్కికి రెక్కలు చీకటి వెల్గుల పట్టున దోచుట గాంచినచో
అక్కమలాక్షుని వాహనమే త్రయి, యందు నిషేధములున్ విధులున్
చిక్కని చీకటి యజ్ఞత జూపును చిందెడి కాంతులు జ్ఞానమగున్
జిక్కని పక్కికి మ్రొక్కులు పెట్టెద జాలును జన్మము ధన్యమగున్

శ్రీ రేకపల్లి శ్రీనివాసమూర్తి - అమలాపురం

త్యాగయ్య, పోతన భక్తితత్వము సాహిత్య విశిష్టతల గురించి సీస పద్యము

నాదంబునందెయున్నదటంచు బ్రహ్మంబు
తనివోయినాడల్ల త్యాగరాజు
ఆదటవోవని యతులిత భక్తిమై
మురిసిపోయినవాడు పోతరాజు
పద్యమ్ము సెప్పినా హృద్యమై గంధర్వ
గానయోగ్యంబౌచు గదలుచుండు
గీతమ్ము వలికెనా చేతమ్ము వికసించు
నారదాదులకునానందకరము

రామభక్తుడై రామకీర్తనములనియె
రామభక్తుడై కృష్ణవర్ణనము సేసె
త్యాగరాజన్న యది భక్తి యోగమయ్యె
పోతరా జన్న యది పైడి పోతయయ్యె

శ్రీ ఉప్పలపు ఆంజనేయరాజు

పెద్దాపురంపై అవధాని స్పందన

శ్రీ పాదవారి కథలకు
శ్రీ పదమై టెంకియయ్యె సిరులకు గౌరీ
రూపిణియౌ మరిడమ్మయు
ప్రాపునె పెద్దాపురాన బట్టుగ నిల్చెన్

శ్రీ జి. ధర్మరాజు

మీకు ఈ రాత్రికి మా పెద్దాపురం పట్టణంలో ఎటువంటి ఏర్పాట్లు కావాలో?

వారిజ సంభవుండయిన బ్రహ్మకు మేటియనుంగురాణి అం
భోరుహవాసి మోములకు ముద్దులతో గిలికించితమ్ములన్
దీరుగబెట్టువాణి రస దృష్టినొసంగుచు సర్వకాల వి
స్తారకమైన సత్కవన తత్వము రాత్రికి నాకొసంగుతన్
(వేదాంతపరంగా రాత్రి అనగా జన్మము)

శ్రీ రేగిళ్ళ సత్యనారాయణ శర్మ

రామవనవాసానికి తల్లడిల్లుచున్న తండ్రియైన దశరథుని మనోభావాలు

శ్రీ నలినాననానన మరీచుల రోచులనాచికొంచు భూ
యోనమదాశ్రితానుపమ యోగ్యతయోగ్య తనిష్ఠ నిష్ఠగా
మానసమందు నిల్చు నిగమ ప్రతిపాద్యుడు రామచంద్రుడే
కానకునేగనిట్లనియె గానక కన్నది కానకే గదా!"

శ్రీ కె. ఎల్. నరసింహం

దూర్వాగ్రాన ఉన్న మంచు బిందువుపై ఉన్నచంద్రకిరణాలు

గరికపై మంచు బిందువు వరలుచుండ
దానిపై చంద్ర కాంతులు తనరుచుండ
గరిక దైవమ్ము బిందువై వరలు జీవి
గురుని ప్రేమయే చంద్రుని కిరణమయ్యె

శ్రీ యర్రాప్రగడ రామకృష్ణ - రాజమండ్రి

మద్యపాన వ్యతిరేకోద్యమంలో పాల్గొంటూ ప్రచారం చేస్తూ మద్యపానం చేసే భర్తల వైఖరి చూసి, భార్య లేమనుకొంటారు.

మద్యమనునది చీడపురగని మంచి పలుకులు పల్కుచున్
హృద్యమగు గతి చెప్పుమెదలిడి యేలదడబడుచుంటివో
విద్య గఱపుట చూడ సులభము విద్య దనియుట కష్టమౌ
చోద్యమయినది నాథ! ఇక సుర జోలిబడి పడిపోకుమా!

శ్రీ నిట్టల రత్నాకరం - పరిగ, వికారాబాద్ మండలం

"అద్వైత మతాచార్యుడు ఆదిశంకరుని ప్రతిభ"

అద్వైతామృత వర్ష ధారలకు దివ్యాభ్రమ్ము! తత్వార్థ సం
పద్వైశిష్ట్యము పంచిపెట్టిన పయోవారాశి! ధీరాశి! శ్రీ
మద్వాగ్జృంభణ లీల శేషుడు! యశోమాన్యుండు! ధన్యుండునై
సద్వైపుల్యముగాంచినాడట తపస్సారా! నమశ్శంకరా!

"కిర్లంపూడి (1993 జనవరి)శతావధానం ప్రతి లభ్యంకాలేదు లభ్యమైన రెండువర్ణన పద్యాలను పాఠకుల ముందుంచుచున్నాము"

శ్రీ మంకు శ్రీను, కొప్పర్రు

"వర్షంలో తడుస్తూ బిడ్డను రక్షిస్తున్న తల్లి"

తన బిడ్డన్ దడువంగనిత్తునె పయోధారాళిచేనంచు నం
దను బొత్తిళ్ళను ముంచి పైచెను బయోధారాళిచే దాదృశల్
జనయిత్రుల్ మృదుచిత్తయుక్తలు పరాశక్తి ప్రభావమ్ముతో
దనరున్ మాతృత వారికెల్లెడలనే దాసాను దాసుండనే!

శ్రీ పోచినపెద్ది సుబ్రహ్మణ్యం, కాకినాడ

"భాద్రపదంలో వానలు"

భాద్రపదమ్ములో గలుగు వానలు తేనెల సోనలే వియ
చ్ఛిద్రమ్ము కల్గినట్లయిన చేలు జనాలు నదీనదాలచే
భద్రత వాయునేటి పరవళ్ళ రవళ్ళకు బెళ్ళగిళ్ళుచున్
నిద్రను జేయదో భవిత! నీరవమై జని నీరుగారదో!



# దత్తపదులు

శ్రీ కొంపెల్ల రామజోగిశర్మ

శృంగి, భృంగి, సంగి, నింగి, రామాయణార్థం

శృంగిని జిచిత్రకూటమున జేరిక కూరిమి చేసియుండనా
భృంగి సమాన తాత్త్విక వివేకియునౌ భరతుండు వచ్చి వే
సంగిని బ్రొద్దుగా నిలువజాలియు బాద్యమి చంద్రుడౌటవా
నిం,గిరి తుల్యునిం గనుచు నెవ్వగ బూనెను భ్రాతృ భక్తిమై

డా॥ జి.వి.ఎస్. భాస్కరరావు - రాజమండ్రి

మల, కల, వల, ఇల స్వార్థరహింతంగా అయ్యప్ప మాహాత్మ్యం

మలపును జాడ్యతత్త్వము నమానుష ధర్మము రూపుమాపు రా
కలపయి మోహమున్ దుడిచి కల్లలపై గల రక్తి త్రుంచి అ
వ్వల సుఖశాంతి యుక్త రస వైభవముల్ పచరించుండు గో
యిలవలె రాగమున్ నిలుపునీశ మురారి సుతుండు నిచ్చలున్

శ్రీ కె. కోటారావు-అనకాపల్లి

చలి, పులి, కలి, బలి (ఆధ్యాత్మికం)

చలితములైన కాయములు శాశ్వతమంచు భ్రమింపనేల? ధీ
కలిత విశిష్ట శీలమున కంస విరోధ్యమునుయాయివౌచు చూ
పులియగనీకు దౌష్ట మున నూహములన్ బదివేలు సేయునం
బలికిని నోచుకోవు భగవంతుని పాదములాశ్రయింపుమా!

శ్రీ ఆదిరాజు వేంకట సుబ్రహ్మణ్యం

అప్పు, రొప్పు, తప్పు, చెప్పు (భారతార్థం)

అప్పురమేలువవ్విరటునాశ్రయమున్ గొని ధర్మసూతి సొ
రొప్పునటంచు బాచికలనూరక తీరికవేళ దాల్చి వం
తప్పుడ యిప్పుడా యనుచునాడుచునాడుచు జెప్పు శాంతమం
చెప్పుడు వాని శాంత గుణమే కలి దౌష్ట్యము బాపు గావుతన్

జయలలిత, జయప్రద, జయసుధ, జయమాలిని,
"బాలలకు సందేశం"

జయలలితానురాగమనిశమ్ము కరమ్మున దాల్చి పండితా
హ్వాయ నయ మార్గమందున జయప్రదమౌనటు సాగుడయ్య దు
ర్జయ సుధనారగింపగల జాణలు మీఱలు బాలలార శ్రీ
మయమగు జీవితమ్ము జయమాలివి మిమ్ము వరించు నెప్పుడున్

డా. వేదుల కామేశ్వరరావు

దుర్గ, భర్గ, సర్గ, వర్గ ( దేవీ పరంగా)

దుర్గము గట్టి శిష్ట పరితోషణ భాషణ వీథియందు త్రై
వర్గ మహామహమ్ము రసవత్కృతిమత్కృతియట్లు నిల్పిత
ద్భర్గ శిరంబుపై నిలుచువానిని బోలెడి నేత్ర కాంతి నై
సర్గముగాగ శాంకరియె చల్లని చూపుల చూచు గావుతన్

శ్రీ వేదుల బాలకృష్ణమూర్తి

భైరవి, తోడి, కల్యాణి, మోహన (రుక్మిణీ కల్యాణపరంగా)

భువి నీకంటెను నాకు తోడిడగ బ్రాపున్ గూర్తురెవ్వారు భై
రవికానందము గూర్చి వేగమ యరివ్రాతంబులన్ జెండి వా
రవియన్ నన్గొని పొమ్ము మోహనముగానాశ్చర్య సంధాతవై
గవయన్ రమ్మనె కృష్ణు రుక్మిణి జగత్కల్యాణియై రాణియై

డా॥ శనగవరపు రవిశంకర హృషీకేశశర్మ, నరసాపురం

ఉల్లి, పిల్లి, బల్లి, నల్లి, - భారతార్థం

ఉల్లిఖితమ్ము భారత మహోదధి రత్నచయమ్ములుండు కో
పిల్లి జలేచరాలు నిను వేచినచో వెరపొందబోకు తా
నల్లిన పద్యరత్నములనంత గుణమ్ముల పుట్టినిండ్లుగా
బల్లిదులైన పాండవుల పావన గాథలు చెప్పినిల్చెడిన్

శ్రీ బి. వి. ఎస్. మూర్తి

అన్నుల, మిన్నుల, కన్నుల, వెన్నెల అదే క్రమంలో శరత్కాల వర్ణన

అన్నుల మిన్నల కన్నుల వెన్నెలలయ్యావి శారద చంద్రికలే
మిన్నుల కాంతుల స్నానముసేయగ మేదురమైనది సాదరమై
కన్నుల జంటలు చాలవు చందము కాంచగ గాంచగ సంతసమా
వెన్నెల వన్నెల చిన్నెల జున్నుల వెన్నుడు కన్న సుతుండుగొనున్

శ్రీ పి. నాగేశ్వరరావు

నవత, కవిత, యువత, సవిత, నేటి భారతదేశ పరిస్థితి

నవతకు నాటపట్టగుచు నాగరిక ప్రభకాలవాలమై
కవితలవోలె సర్వజన క్షేమ గుణంబులకిక్కయౌచునో
యువత! గ్రహింపుడయ్య మనకున్నది పెన్నిధి నీవు జ్ఞానివై
సవితగ వెల్గుమయ్య యనిశంబును భారతమందు వెల్గువై

శ్రీ వారణాశి రాజేశ్వర శాస్త్రి - పిఠాపురం

అధునా, మధునా, నిధినా, విధినా

అధునాతన్య కవి ప్రకాండ చయమందాతండె యాతండెపో
మధునాపంతుల సత్కవీశ్వరుడు సన్మానార్హుడౌనెప్పుడున్
నిధి నాకబ్బెను మీకునబ్బినది రాణింపంగనాంధ్రాన దుర్
విధినా జెల్లునె మంచివాని జనికిన్ వేగమ్మమందమ్మగున్

శ్రీ అల్లంరాజు కామేశ్వరశర్మ

దోస్తి, షోలె, డాన్, బాబి- హనుమత్ పరాక్రమం

స్థిరుడై యాహవ రంగమందు పటు 'దోస్తీ' క్షత్వమున్ జూపి బం
ధురు'డాన'ందము తోడ చెండు గపి శత్రువ్రాతమందందున
చ్చెరువున్ దాల్చుచు 'బాబి' బీబియనుచున్ శీఘ్రమ్ముగా బోవ వా
రి, రవమ్ముల్ మినుమిట్టుచున్నవి - యు'షోలేప'మ్ముగా దోచుటన్

అతడు కడిమిళ్ళ ప్రఖిత శతావధాని
కవిజనమ్ముల పాలిటి కల్పశాఖ
వాని శిష్యులై సత్కీర్తి బడయుచున్న
శిష్య కుసుమమ్ము లెన్నో! రోచిస్సులెన్నో!

- తోలేటి పార్థసారథి
నర్సాపురం



## కాకినాడ - సంస్కృతాంధ్ర శతావధానం

సమర్పణ

**శ్రీ కొండేపూడి తాతబ్బాయి**

తెలుగుపండిట్, కాకినాడ

కలంకదిపితే మంచి కవిత
కవి పద్మాలను పోషించే సవిత
కవితాంగనా హృదయశాయి
కొండేపూడి తాతబ్బాయి



**1995 ఫిబ్రవరి - 11,12 తేదీలు**

వేదిక :

**సూర్య కళామందిరం**

సంచాలకులు :

**డా॥ గరికపాటి నరసింహారావు**

కార్య నిర్వాహకులు :

**శ్రీ కొమ్మూరి శేషగిరిరావు (గాంధి)**

**శ్రీ గోపాల శ్రీనివాసరావు**

సభా నిర్వహణ :

**శ్రీ రాణీ సుబ్బయ్య దీక్షితులు**

# సమస్యలు

శ్రీ కందుకూరి శ్రీరామచంద్రమూర్తి - కాకినాడ

"నాంత్వామన్నను బొజ్జలేచునటవే నాళీక పత్రేక్షణా!"

సాంత్వంబందునుపాసనా రతకళా శక్తుల్ ప్రవరిల్లు నీ
మంత్వారంభము కాలమున్ మెసవు ప్రేమస్యంది చిత్తంబులన్
గంత్వాయత్త పరస్పర స్మర కళా గ్రంథంబులేకే గణా
నాంత్వామన్నను బొజ్జలేచునటవే నాళీక పత్రేక్షణా!

శ్రీ శ్రీపాద శ్రీరామమూర్తి - కాకినాడ

"రుక్మిణి చను మొనల మీద రోకలి మొలిచెన్"

రుక్మంబే యెద యంతయు
రుక్మిణి! చను మొనల మీద రోకలి మొలిచెన్
రుక్మాంశుక! చాల్పాలని
రుక్మిణి తానల్లి పూవు త్రోసి హసించెన్
(రోకు + అలి = వికసించిన జలపుష్పం)

"కడకు కడిమిళ్ల కడిమెల్ల కవితగాదె"

మధుర మధురమ్ము మంజుల మంజులమ్ము
నవ్య నవ్యమ్ము నిత్య నందన వనమ్ము
అందచందాల తెల్గు తియ్యందనమ్ము
కడకు కడిమిళ్ళ కడిమెల్ల కవిత గాదె

"శవమే దివ్యరసానుభూతినిడుచున్ శాంతిన్ బ్రసాదించెడిన్"

సవనంబైనది యౌవనమ్ము పిదపన్ సంసారమా రోత గా
రవమార్జించుచు బండినీడ్చినను వార్ధక్యమ్ము ప్రాప్తింప వా
చవి గానేరదు నీదు పల్కు గనుకన్ సంతోషమే నిల్చు, శై
శవమే దివ్య రసానుభూతినిడుచున్ శాంతిన్ బ్రసాదించెడిన్

శ్రీ గాడేపల్లి సుబ్బారావు - కాకినాడ

"తొమ్మిదినుండి యొక్కటియు ద్రోయగ దాఁబదియౌనుగా భువిన్"

నెమ్మదియందునొక్కపరి నీరజ నేత్రను సంస్మరించి, యె
క్కమ్ముల నేర్చి లెక్కలకు గల్గిన చిక్కులనాలకించి మొ
త్తమ్ముగ పట్టు బట్టుచు ముదమ్మున సాగగదయ్య రెంటిపై
తొమ్మిదినుండి యొక్కటిని ద్రోయగ దా బదియౌనుగా భువిన్

శ్రీ జొనదుర్గా మల్లికార్జునరావు (బాలకవి)

"భామయు భామయుం గలియ బాలుడు పుట్టెను సత్యభామకున్"

ఆమెత కాగ లోకమునకందగజేయు గథావిశేష భా
షామయమైన భాగవత శాస్త్రమునందున నాయకుండునౌ
రామహిషీ సమస్తమును రంజిల జేయుచునుండెనట్టి శో
భామయు భామయున్ గలియ బాలుడు పుట్టెను సత్యభామకున్

శ్రీ గరిమెళ్ళ కుమారస్వామి-మోడేకుఱ్ఱు

"చవట జనార్దనున్ గొలిచి సంపదలందుడు మీరలందరున్"

అవమతి చేయకుండ హృదయమ్మును దేవళమందు నిల్పి కే
శవుని స్మరింతువేని విలసన్మతివై సుఖమున్ గడించి గౌ
రవములు పొందవచ్చు వినరా!యిహలోకపు బాధలింక వే
చవట జనార్దనున్ గొలిచి సంపదలందుడు మీరలందరున్

డా॥ ధూళిపాళ మహాదేవమణి - కాకినాడ (అవధాని)

" కంఠే బబంధ గరళం కమలాపతిర్హి"

చిత్తే బబంధ సతతం జగతీం మురారిః
తద్రక్షణాయ భగవానవతీర్ణ ఏషః
పాదాహతి ప్రహత మస్తక కాళియస్య
కంఠే బబంధ గరళం కమలా పతిర్హి!

శ్రీ పోచనపెద్ది సుబ్రహ్మణ్యం - అష్టావధాని, కాకినాడ

"రాముని రామునిన్ మఱియు రాముని జానకి చూచెముఉవ్వురిన్"

రాముని, సర్వశాత్రవ విరాముని బెండిలి యాడి వచ్చుచో
నామహనీయునిన్ గనుటకై దిగివచ్చెను దేవనాథుడే
రాముడు చాపమున్ విరిచెరా!యని భార్గవుడేగుదెంచె, సు
త్రాముని రామునిన్ మఱియు రాముని జానకి చూచె ముఉవ్వురిన్

శ్రీ వద్దిపర్తి పద్మాకర్ - సహస్రావధాని - ఏలూరు (సంస్కృతం)

"పిపీలికా చుంబతి చంద్ర బింబమ్"

విచిత్ర రూపా ఖలు భాగ్య రేఖా
యదాగజాసహ్యా వియోగ కాలే
శివోధరణ్యాం శయనం కరోతి
పిపీలికా చుంబతి చంద్రబింబమ్

డా॥ కేశాప్రగడ సత్యనారాయణ - అవధాని - కిర్లంపూడి

"రాసభమున్ వరించె గద ద్రౌపది బ్రాహ్మణ కోటి మెచ్చగన్"

ఈసు జనించి కొందరు రుచింపమి గోలను బెట్టుచుండనా
కాశచరుల్ భళీయనుచు గమ్మగ దీవెనలిచ్చుచుండనా
యీశుడు ఫల్గుణుండట రయమ్మున ఛేదిత మత్స్యయంత్రుడై
రా, సభ, మున్ వరించెగద ద్రౌపది బ్రాహ్మణ కోటి మెచ్చగన్

శ్రీ ఇజ్జాల వెంకట్రావు

"అర్జునగర్వ భంగమునకందఱు మెచ్చరె భారతంబునన్"

ఆర్జవమెల్ల కృష్ణ హృదయంబుననున్నది పూనుకొమ్ము వే
గార్జిత రోషుడై చెలగునట్టి మునీశుడు భార్గవుండు తా
మూర్జిత శక్తితో బరశునూని వధింపడె నాటి కార్తవీ
ర్యార్జున గర్వ భంగమునకందఱు మెచ్చరె భారతంబునన్

"రమణి కుచమ్ముపై నిలిచె అంపము నాగము రాజహంసమున్"
సుమతిని చేతియందునిడి చూచుచు చూచుచు బండఊాల శి
ల్పములుగ దీర్చిదిద్దు సవిలాసుడు చక్కని బొమ్మ చెక్కనం
దములకు బుట్టినిల్లయినదా యనగా,మకరాంకితంబుగా
రమణి కుచమ్ముపై నిలిచె అంపము నాగము రాజహంసమున్

శ్రీ కందుకూరి సూర్యప్రసాదరావు - కాకినాడ
"రాలేమిన్ రహివీడి రిక్తము నిరర్థంబంచు లజ్జింపడే!"
ఆలోకించి సమస్త శాస్త్ర కవితా వ్యాసంగ సంపత్తి భా
షాలీలన్ బ్రకటించి సత్కవన వైశారద్యమున్ జూపి ల
క్ష్మీలీలారహితుండుగా చెలగె గాసిం బొందెనీరీతినా
రా!లేమిన్ రహివీడి రిక్తము నిరర్థంబంచు లజ్జింపడే!

శ్రీ దేవర కొండ శేషగిరిరావు
"పువ్వు నందు నొక్క పువ్వు పూచె"
భవ పదాబ్జ హృదయ పద్మసంగతి చేత
జిత్రమైన యొక్క చిత్రమందు
దోచు చుండెనయ్య దుష్ట దేవరకొండ
పువ్వునందునొక్క పువ్వు పూచె
(గసడదవాదేశం వలన తుష్ట దుష్టయైనది)

శ్రీ శివలెంక ప్రసాదరావు
"రంభకు మీసముల్ మొలిచె రాముని కౌగిట జేరినంతనే"
శుంభదశేష నిష్ఠమగు జొప్పున తీవ్ర తపంబు సేసి యు
జ్జృంబిత మేనకన్ గనిన జిత్తమొకింతగ సంచలించెనా
దంభము దగ్గ కౌశికుని తత్వమునన్ బురుషాయత క్రియా
రంభకు మీసముల్ మొలిచెరా! మునికౌగిట జేరినంతనే!

శ్రీ చింతా యాజ్ఞవల్క్య మహర్షి
"గురు కృపఁజూచిరేని సమకూరనిదేది ప్రజా యుగంబునన్"
స్థిరమతి నామనస్సు నలసేవకు నిశ్చితమయ్యె సర్వశం
కరులగుగాక వేరొకని గాంచను నేననలున్ స్పృశించెదన్
వరుడనలుండెయైనయెడ వారికి చెప్పగదయ్య మీరు న
ల్గురు కృప జూచిరేని సమకూరనిదేది ప్రజాయుగంబునన్

శ్రీ పురాణపండ సత్యనారాయణ - జగ్గంపేట
"రాతిన్ గాంచినమాత్ర నాతియును దా ఊాయయ్యె చిత్రంబుగన్"
చేతోబ్జార్యముడయ్యె దేవపతి గాసింబొందె దద్గౌతముం
డే తన్వీకరమందియుంట రసవాటిన్ జొక్కగాలేక ప్రా
భాతంబందున కుక్కుటంబయిననవ్వానిన్ దమిన్ దద్బలా
రాతిన్ గాంచిన మాత్రనాతియును దా ఊాయయ్యె చిత్రంబుగన్

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ - కాకినాడ

"ధవునిన్ జంపిన భర్తగాంచి సతి యానందంబు బొందెన్ మదిన్"

అవలీలన్ బదునాల్గు లోకములనయ్యైరీతి బాధించి శా
స్త్ర వచో రీతికి భిన్నమార్గమున యాత్రన్ సల్పుచున్నట్టి దు
ష్ట వరిష్ఠున్ వధియింపగా వలయు వేటన్ బూన్చి తచ్ఛత్రు బాం
ధవునిన్ జంపిన భర్తగాంచి సతి యానందంబు బొందెన్ మదిన్

శ్రీ వింజమూరి నాగఫణిశర్మ

"భవుని భవుండు గూల్చె భవ భావి సతిన్ రతి మూర్ఛ ముంచుచున్"

పవలును రేయి తత్తపము పాలొనరింతువె జీవితమ్ము గౌ
రవమది పుత్రవంతునకె లాభము మూడు జగాలకంచునా
శివుని మనమ్ము కాంత వివశీకృతమున్ బొనరించు దన్మనో
భవుని భవుండు గూల్చె భవ భావి సతిన్ రతి మూర్ఛ ముంచుచున్

శ్రీ మల్లంపల్లి వీకోరామ సిద్ధుడు - సీతారాంపురం

" కంఠీరవః పరిభవం సహతే మృగీభ్యః"

మాయా దురోదర కళారత ధార్తరాష్ట్రైః
ద్యూతే విజిత్య కపటేన పరాబభూవుః
ధర్మాత్మజం మృగపతిర్విపరీత కాలే
కంఠీరవఃపరిభవం సహతే మృగీభ్యః!!

శ్రీ వి. సత్యనారాయణ

"భవ్యపదమ్ము మానవ సుభాగ్యదమే పరచింతలేలొకో"

అవ్యయుడైనవాడు హృదయాబ్జములన్ గిలికించితంబుతో
నవ్యత గూర్చిపెట్టు నవనందనమై నరజీవితమ్ము సం
స్తవ్యముగాగ దైవమున తప్పక దృష్టిని నిల్పుమయ్య యా
భవ్యపదమ్ము మానవ సుభాగ్యదమే పరచింతలేలొకో

శ్రీ బాలాంతరపు సత్యనారాయణ

మశకము మశకమును గఱచి మత్తిలి చచ్చెన్
ప్రశమిత శక్తుండగు మా
నిసిమందుల జల్ల నేర్చె నేర్పరి యౌచున్
విసమది ఫలమున బడగా
మశకము మశకమునుగఱచి మత్తిలి చచ్చెన్

శ్రీ వడలి సుబ్బారాయుడు - పెద్దాపురం

"అఘమున్ జూచుచు సంచరింపుమయ ధర్మార్థంబు ముఖ్యంబుగాన్"

మఘవుండేనియు శౌరియేని భవ సంబంధంబు బంధింప ద
ల్లఘిమన్ బొందుట తథ్యమాభవుని యుల్లంబందునన్ నిల్పి యా
విఘసమ్మున్ గ్రహియింపుమెల్లపుడు సద్విజ్ఞానివై పుణ్యము
న్నఘమున్ జూచుచు సంచరింపుమయ ధర్మార్థంబు ముఖ్యంబుగాన్

ఆకెళ్ళ లక్ష్మీనరసింహశాస్త్రి

"బాల శిఖాగ్రముల్ కలికి భాగ్యము నింద్యము దేవతార్చనన్"

వేళకు దేవతార్చన వివేకము గల్గుటలెస్స గాని యీ
వేళను తెచ్చితీవిరులు విజ్ఞతలేమినినెన్నడేని యీ
పూలెవరేని నిల్పిరొకొ పూజనమందున గాన గేతకీ
బాల శిఖాగ్రముల్ కలికి భాగ్యము నింద్యము దేవతార్చనన్

శ్రీ అల్లంరాజు కామేశ్వర శర్మ - కేసనకుఱ్ఱు

"కలమును జంపె సత్కవి పికావళి కోయని సంస్తుతింపగన్"

సలలిత సాధు శబ్ద రస సంగతియే హృదయంగమంబును
జ్వలమతులైన వారు పలుచక్కని కావ్యములల్లినారలా
పలుకులతేడు రాముడట భావ్యమెఱుంగని యట్టి సోకుమా
కల, మును జంపె సత్కవిపికావళి కోయని సంస్తుతింపగన్

శ్రీ అడ్దూరి సూర్యనారాయణ

నక్కలు భారతావనిని నాల్కలు చాచుచునుండె దుర్విధిన్
ఇక్కురు భూమిలో శుభములేర్పడు పైనము గానరాక స
మ్యక్కలితార్థ వాక్య నిచయంబులు దూరములౌట జేసి పెం
పెక్కనధర్మ సంగతి నశించుట తథ్యము కౌరవేశ్వరా
నక్కలు భారతావనిని నాల్కలుచాచుచునుండె దుర్విధిన్

శ్రీ ఎస్.టి. జ్ఞానానందకవి - కాకినాడ

"ముండను భక్తిభావమున పూజలుసేసెను మోక్షసిద్ధికై"

భాండము సర్వవిశ్వమను భావనలో గలియంగచుట్టి బ్ర
హ్మాండము తానయై నిలచునట్టి పరాంబిక పూజసేసి, దుః
ఖాండజ సర్వమంత్రమగునట్టి జపమ్మును బొందగోరి చా
ముండను భక్తి భావమున పూజలు సేసెను మోక్ష సిద్ధికై

శ్రీ ఎస్. వి. రాఘవేంద్రరావు - రాజమండ్రి

కలుసేవింపుడని పల్కి గణ్యుండయ్యెన్
అలవైకుంఠుడు రాముడు
జలజభవుడునాదిగాగ సర్వులు జేజేల్
కలిగిరి యాతనికై లెం
కలుసేవింపుడని పల్కి గణ్యుండయ్యెన్

శ్రీ సి.బి.ఆర్.కె. శర్మ

సవతిని చూచిమెచ్చెసతి చల్లని దృక్కుల భర్త జేర్చుచున్
కవనము చెప్పినాడొకడు కావ్య కళాపరిపూర్ణశక్తి సం
స్తవమును బొందినాడు కృతి జక్కని చిల్కయు పాత్రమయ్యె వా
చవి కలిగింప సంతసము శారదకబ్బెను నాడు తద్విలా
సవతిని చూచిమెచ్చె సతి చల్లనిదృక్కుల భర్త జేర్చుచున్

# వర్ణనలు

శ్రీ ఇంద్రగంటి దీక్షితులు

(సంసారాన్ని జీవనసారంగా)

సారము జీవన సారము సుమ్మిది సంస్కృతితో నడిపించిన సం
సారము వేల్పుల బోనముగానగు సంస్కృతి తగ్గిన బన్నములే
సౌరులు నింపెడి మార్గము చూపుము సద్వ్యవసాయము నేర్పుమయా
ఆరమణీయత యాకమనీయత యంతయ యింతయ యెంతటిదో

శ్రీ కొంపెల్ల శ్రీరామచంద్రుడు

వీరేశలింగం, తి.వెం.కవులు, గిడుగు స్వర్గంలో సంభాషణ

పల్లె పల్లెలో బద్యాలు పాడినాము
తెలుపు చీరకు రంగులు పులిమినాను
పలుకు బ్రజలకు దగ్గఱ పఱచినాడ
ఎవరి యంతటి వారు వారే గదయ్య!

కోనసీమలో రైళ్ళు వస్తే

కోనసీమయందు రైళ్ళు కూడ వచ్చియున్నచో
కానవచ్చునందు గూడ కర్కశమ్ము చిచ్చు సౌ
ఖ్యానకెంత దగ్గరైననాపదలకునట్టులే
లేనిపోని కోర్కెలేల లేమ! వద్దు వద్దులే!

శ్రీ కూచిభట్ల భీమశంకర్

(అంపశయ్యభీష్ముడొక సుమమాల)

ఆ కురువంశ మూల పురుషాకృతి వ్యాకృతి చేసి ధర్మవి
ద్యాకమనీయమూర్తి యసురారి క్రియాగతులెల్ల సంయుగ
ప్రాకటితమ్ము చేసి తన భక్తి సుమమ్ముల ప్రోగుచేసి పూ
జాకృతులన్ బొనర్చెనట సర్వవిదుండగు భీష్ముడచ్చటన్

శ్రీ వడలి సుబ్బారాయుడు - పెద్దాపురం

(సూర్యుని వద్ద హనుమ విద్య నేర్చుకొను విధము)

కొండలు రెంట బాదములు గూర్చి సమస్తము నేర్చినట్టి యు
ద్దండుడు వాయు పుత్రుడు ముదమ్మున తమ్ములతేని యొద్ద ధీ
మండితుడైన యాతనిని మాయురె తత్కుల జాతుడైన రా
ముండె ప్రశంస జేసెనదె పున్నెము మోక్షము జన్మజన్మకున్

"ఘంటసాలపై పద్యం"

అమృతము జాలువారినదియా! యనునట్లుగ 'ఘంటసాల'గా
నమునొనరించినాడు భువి నందనమైనది నాటివేళ గ
ర్ణములవి విచ్చుకొన్నవపురా యవి నేటికి విచ్చిపోవు కా
లము మన పాలబడ్డది విరాగులు గావలె భోగులేనియున్

శ్రీ ఎస్.వి. రమణ

బ్లోఅవుట్ ప్రభావాన్ని వర్ణిస్తూ
భూగర్భ స్థిత వాయు వీచికల సామ్మున్ జేయగా నారము
ద్యోగంబున్ బొనరింప మిత్రుడట వేగోద్రేక సంప్రాప్తిచే
దాగర్జించి జ్వలించుచుండెనచటన్ దార్కొన్న యయ్యర్కుడా
వేగంబున్ బరిమార్పగా విఫలుడై పిల్చెన్ బరబ్రహ్మమున్

శ్రీ అయ్యగారి శ్రీనివాసరావు

అర్ధాంగిని ఆర్థికమంత్రి చేస్తే
ఆలి విత్తమంత్రి యగునేని మన జీత
బత్తెములకు శూన్య ఫలము కలుగు
ఆలి ముఖ్యమంత్రి అయినచో యజమాని
పదవిగూడ నిన్ను వదలిపోవు

శ్రీమతి ఎ. సీతారామలక్ష్మి

పార్వతీ పరమేశ్వరుల భావన - అవధానంపై
పరిపరి యాతడు ప్రాశ్నిక
పరిపరి నిరసించుచుండ భావైక్యంబై
యిరువురమొకటై యచ్చట
స్థిరమతి చరియింతుమంచు శివలనుకొనరో!

శ్రీ శంకరభాను - కాకినాడ

అడుగ వలసిన విషయం మరొకరు అడిగితే
అడుగ దలచినదితరులే అడిగినారు
అడుగుటింకెట్లు నా భావమడుగు బట్టి
అడుగు బట్టంగ భవము నేనడుగు వేసి
శివుల యడుగు దమ్ముల బట్ట జేరినిలతు!

శ్రీ చింతా లక్ష్మీనారాయణ

ఈ అవధానంలో తిరుపతి వేంకట కవులుంటే వారి భావన
తిరుపతి వేంకటేశ కవి ధీరులు మా సభ చేరిరేని అ
చ్చెరువుననంద్రు మాకుగల శిష్యత యున్నది భావగౌరవా
దరములు గల్గి యీ శతవధానము చక్కగ సాగుచుండెనా
గరిమకు నేటి కాలమున గల్గిన ప్రేక్షకులే యుదాహృతుల్

శ్రీ కె. భాస్కర రామారావు

వేంకటేశ్వరుని కల్యాణం వీనుల విందుగా
సిరిగల వానికి బెండిలి
అరయంగా సిరులనిచ్చునట్టిది జనికిన్
కరువుం గాలము దీరగ
పరుగిడెదము వేంకటేశు బరిణయమునకై

శ్రీమతి తల్లాప్రగడ సత్యవతి

పుట్టింటివారు, హితులు సభలో ఉంటే

సారోదార మనః ప్రయుక్త కవితాచాంక్రమ్యమాణమ్ముతో
సారోదార రస ప్రపూరిత మనశ్చాంక్రమ్యమాణమ్ముతో
పారావారమవార పారమగుచున్ వర్తిల్లునానందమీ
యూరన్ బంధువులున్ హితావళియు నాకుత్సాహమందించుటన్

బి. కాత్యాయని

భారతీయుల పరిజ్ఞానం విదేశీయులకంటే తీసిపోదు (బ్లోఅవుట్)

పొరిగింటి పుల్లకూరకు
దరుగవునే సొంతకూర తరుణీమణిరో
భరతాన్వయ మేధావికి
సరిగలదా! మంటలార్ప జాలునతండే!

శ్రీ వాడ్రేవు హరగోపాల్

మాధవీ లతా నికుంజమును శ్రీ వైకుంఠంతో పోల్చాలి (సంస్కృతం)

మాధవీ లతికా గేహే
సుధాచాస్తి పరీమళః
మాధవీ దివిషద్భోజ్యం
విరాజేతే హరేర్గృహే!

శ్రీమతి కల్లూరి శ్రీదేవి

(పారారాక్షసియైనా చస్తుంది కాని వరకట్న పిశాచం మాత్రంచావదు)

వరశుల్కాసుర జీవనాడి యెచటన్ వర్తిల్లునోగాంచి త
ద్గరిమన్ ద్రుంచి మహత్వమెంచగల భూకాంతుండు జన్మించి యై
శ్వరమున్ గాంచగనౌను సంస్కృతికి విశ్వాసంబు సంధింప ద
న్నరపాలుండుదయించునంతవఱకున్ నారీమణీ యింతియే!

శ్రీ వి. సుబ్బారావు

(సముద్రలంఘనం చేయువపుడు హనుమ శరీరసౌష్ఠవం)

అతని యియాసలో గలుగునట్టిది సౌష్ఠవమై స్ఫురింప సు
స్థితమతి గాడ్పుపట్టి వివశీకృత లోకుడు నింగినంటుచున్
కతలకు కారకుండయిన కాలమునందున గాత్ర సౌష్ఠవం
బతులితమంచు చెప్పుకొనుటార్షమతంబగునా?వచింపుమా!

శ్రీ ఆకెళ్ళ శ్రీరామమూర్తి

(దీపావళినాడు అమావాస్య వెన్నెల)

కటిక చీకట్లు పాలించు గాలమందు
పుచ్చ పువ్వులై వెన్నెలల్ పొడమెనేల?
ఒక్కనీచుడు మరణింపనుత్సవమ్ము
నొక్కధార్మికుడుదయింపనుత్సవమ్ము

శ్రీ కందుకూరి లక్ష్మీనరసింహం

"కొన్నిఇజాలతో బిజీబిజీగా కవితా నిర్మాణ కుతూహలులకు సందేశం

కవితాకన్నియ నీదు కౌగిలిని జొక్కంజేయుమా శాస్త్ర సా
రవచో నైపుణి జిక్కబట్టుకొని యుల్లాసంబునం దేర్చి గౌ
రవమున్ గాంచుమిజాల గోల మనకేలా లావు నీకైతలో
రవళింపన్‌వలె ప్రక్రియా సరళికై రాద్ధాంతమేలా సఖా!

ఇ. శరభయ్య

" అప్రస్తుత ప్రశంసపై

కలిగెను నాంతరీయకుడు కావలె గావున గల్గినాడు ప
ల్కుల పస లేకపోయినను గూరిమి నేరిమి వారి వల్లనే
కలుగును బ్రస్తుతేతరుల ఖ్యాతి యశాశ్వతమౌనుగాక ని
చ్చలు మన సన్నిధానమున సంగతి పొందుట తప్పదే కదా!

ఎన్. శ్రీరామాచార్యులు

"వసంత కాలవర్ణన మందాక్రాంతంలో" (సంస్కృతం)

మందాక్రాంతే మధుర నినదే కౌకిలస్య ప్రభావాత్
భవ్యానందస్సమజని కళా కల్పితాంతర్గృహేషు
సంతుష్టోహం త్వమపిచ తథా సర్వ కావ్యైఃప్రశస్తః
ఆనందోయం సుర విరహితో మానవానాం విశేషః

ఎన్. పద్మావతి

"సూర్యుణ్ణి - అవధానసూర్యుణ్ణి మేళవించి"

సప్తాశ్వరథారూఢుడు
దీప్తినొసగు నింగినుండి తేజోమయుడై
గుప్తాశ్వరథారూఢుడు
దీప్తినొసగు వేదినుండి తేజోమయుడై

గుంటూరి

"హైస్కూల్లో పిల్లలగోల ఇక్కడ పృచ్ఛకుల గోల"

పిల్లలకు గోల కైతల
అల్లికలకు హేల నిలచుననవరతంబున్
ఉల్లాసంబందువాకో
అల్లది మన మనమునందునమరగ వలయున్

శ్రీ రాణీచంద్రశేఖర శర్మ

"గాయత్రీ మంత్రంపై పద్యం"

గానము చేసెడి వారిని
జ్ఞానంబిడి రక్షసేయు గాయత్రీ! వి
జ్ఞానంబొసగుమ తల్లీ!
నీ నామస్మరణమందె నిలిచెదనమ్మా!

శ్రీ ఇ. వి. రమణమూర్తి

"సీతరాముని ఒడిలో"

భగవంతుని యొడియందున
భగవతియే పండుకొనియె భద్రంకరుడా
మెఁగనియె ఆమె యతని గనె
దృగతీత రసైకతాన తృప్తియె మిగిలిన్

శ్రీమతి యం.ఎన్. రత్నమాల

"పెన్నిధి సుఖమో... త్యాగరాజస్వామివారిపై"

పెన్నిథి సుఖమో రాముని
సన్నిథి సుఖమో వచింప జాలవటయ్యా!
అన్నా యని పల్కిన త్యా
గన్నయ యిలువేల్పు మాకునాంధ్రావనికే!

శ్రీ బి. అప్పారెడ్డి

గద్దర్ అవధానం చేస్తే పద్యంతీరు

ఏందిరా యీడిగోల గణమేందిర ప్రాసలవేందిరా రసం
బేందిర! యీసమస్యలివి యేందిర! యీటికి పూరణేందిరా
మందికి తిండిలేదు పరమాన్నమునాడికి పెట్టుటేందిరా!
యేందిర యింతసేపు శ్రమయేందిర చెమ్మట కానదేందిరా!

శ్రీ జి. విశ్వనాథ్

శృంగేరి పీఠాధిపతి సమక్షంలో అవధానం చేసిన మీ అనుభూతి

అర్థము శబ్దమున్ గలియునట్లుగ నేనొక చిన్నిపొన్ని వి
ద్యార్థిని నిల్పియుండ గవితాంబర చంద్రుని చేసి వెన్నెలల్
ద్వ్యర్థిగ నిల్పినారు గద ధార్మిక జీవములైన భారతీ
తీర్థులు వారికీ యెడద దేవళమై వెలుగొందునెప్పుడున్

"మహిళలకు చలం సందేశం"

పృథ్వి చర్మ పూరితము గావింపనేల
పాదరక్షలు ధరియింప వలయుగాని
ప్రభుతసైననే ఆధార పడగనేల
ఇంతి ఇంతియు ప్రగతి సాధింప వలయు!

# దత్తపదులు

శ్రీ కోట లక్ష్మీనరసింహం - శతావధాని - తణుకు.

"అలకల, చిలుకల, వలపుల, లలలల"

అల కలకాదు వాస్తవమహోయని సందిట గోరి చేరి రా
చిలుకలవోలె ప్రేమసుధ చిందగనందము చిందునంత క్రొ
వ్వలపులు పేర్చికూర్చి రసవైభవమున్ ప్రచురింపజంద్రశా
లల లలనా మనోహరుడు రామయు పాటలు పాడిరత్తటిన్

శ్రీ తటవర్తి వేంకటరమణ - మండపేట

"వియ్యము, నెయ్యము, కయ్యము, బియ్యము" (ప్రస్తుత ప్రభుత్వం)

నెయ్యము రాజ్యాంగముతో
కయ్యము నరసింహరాయ కాంగీయులతో
వియ్యము శ్రమశక్తులతో
బియ్యము పేదలకొ! గాక బేలట్ కొఱకో!

"కడిమి, ఎల్ల, వరప్రసాద్" (శ్రీకృష్ణస్తుతి)

(గోవర్థన పర్వతధారణము)

ఔరా! యా కడిమెట్టి పాటిదాగదా!అశ్మొత్తవర్షమ్ముతో
నీరంధ్రంబగుచుండనెల్ల పురమున్ దీంద్రింపగా వేలుపుల్
సారోదారము కావరమ్ము చిదుపన్ శక్తుండు కృష్ణుండు మం
దారుండైన వరప్రసాదుడు గిరిన్ దాల్చెంగదా వ్రేలిపై

శ్రీ ఊర కొండలరావు

"పెద్దాపురం, రాజమహేంద్రి, అమలాపురం, కాకినాడ"

కవి'పెద్దా!పుర'మందు నిక్కముగ వీకన్ జూపునవ్వాడె యి
య్యవుపో 'రాజ! మహేంద్రి'యిమ్ములను ద్రోయంజాలునవ్వాడె మా
యవధానం'బమలా!పురంబునకు శ్రేయంబిచ్చునే'కాకినా?
డ'వులున్ జూపెదనింక గైతలను వీటస్వీటనెందేనియున్
(డవులు = రీతి)

శ్రీ బి. రవీంద్ర

"భడవ, పడవ, నడవ, కడవ, (సభను వర్ణించుట)"

కడవడిన్ బరిక్రమింప గైతలల్లు వేళలో
నడవకుండునొక్కొ! నందనాల పాద యుక్తముల్
పడ వడిన్ పదాలు మాకు బద్యవిద్య మెచ్చగా
సుడులు పుట్టె కైతవాక శోభ డవలు చూపగా

శ్రీ దేవదానం రాజు

"కల్లు బ్రాంది సారాయి విస్కి" (ప్రభుత్వ స్థితి)

ఓ జస్సారా యిదియే
నీ జవమగు విస్కి బ్రాంది నిలుపుట యొకటే
ఆ జతగా కల్లగునా
భూజానీ బియ్యమెంత పుణ్యము సేసెన్

శ్రీమతి నిష్ఠాణి పద్మావతి

"కటకట, వికట, మకుట, నికట (ద్రౌపది మనస్తత్వము)"

బోయ కటకటలాడునే పులుగుచూచి
మకుటమే లేని రాజు దుర్మార్గుడయ్యె
నికటమున బతులుండియు నెగ్గకుంటి
వికటశీలుని గూల్పనెవ్విధిని గొల్తు

"తుల్య, శల్య, హల్య, కుల్య - భారతార్థం"

ఔర! యహల్యశాపము రయంబున బాపినవాడు కృష్ణుడై
ధీరుడు శల్యమున్ గొనక తీర్చునె తేజము కౌరవాళికిన్
భారతమందు పాండవులవారిత తేజాలు వర్షతుల్య వి
స్తారము బాణలోకమగు జాడ్పున జ్యేష్ఠుడు కుల్యనొందెడిన్

శ్రీ వడ్లమాని సూర్యనారాయణ

"అరసిక, విరసిక, సరసిక, సురసిక"

"రాధామాధవులు శతావధానానికి వస్తే"

అరసి కవిత్వ తత్త్వము రయమ్మున శాస్త్రమహాబ్ధి నీదు భా
సుర సికతాతలమ్మున యశోధన రాధయు మాధవుండు త
త్సరసి కవిత్వమున్ బలుకు జాయలు దోప రహించినారు మో
వి రసిక తుష్టిగానటుల వెల్లవలెన్ గవితల్ జగంబులన్

శ్రీ వేదుల లక్ష్మీ గణపతి శాస్త్రి - కాకినాడ

"నది, మది, తుది, పది, శివరాత్రి పరంగా అద్వైత సంప్రదాయం"

ఔనది యద్వైతంబే
ఆనీలగ్రీవమది సమస్తంబయ్యెన్
నేనిక పదిపదిమారులు
ప్రాణము తుదినందుదాక పలుకన్వలెనా!

శ్రీ ఆకొండి సత్యనారాయణ - కాకినాడ

"చక్కెర, సెక్యూరిటీ, బ్లోటౌట్, జాతీయ శైలిలో విక్రీడితం"

ఒకచో చక్కెర కుంభకోణమున దాను(బ్లూగె దేశంబు వే
రొకచోదేశమునూపివైచినది సెక్యూరిటీలునాత్రోవనిం
కొకచో పీఠము గూల్చివైచినది యయ్యో పెద్ద బోఫోర్సు వం
చకులీ రీతివి పొగుచుండునెడ దేశంబెల బ్లోటౌటగున్

డా॥ అబ్బిరెడ్డి పేరయ్యనాయుడు - శతావధాని - రాజమండ్రి

"స్కోరు, విన్, నెట్, బంతి"

ఆయశస్కోరు జీవితమందునెన్ని
వెతలు కల్గినో జనము భావిన్ను తింప
నెటుల నెట్టినో చరిత భాసింప రామ
భద్రజీవితమొక మేలు బంతి కాదె!
(ఆసమంతాత్ యశః అస్యఅస్తీతి ఆయశస్కః)



# ఢిల్లీ- శతావధానం

సమర్పణ

**డా॥ జి. హరికిషన్,** పి.హెచ్.డి.

పారిశ్రామిక జగతిని అలుపెరుగని కృషి
ఆధ్యాత్మికరంగంలో అధునాతన ఋషి
సామాజిక శ్రేయస్సే తనకెపుడూ సమ్మతి
తాత్త్విక పరిశోధనలో మునిగి తేలు బృహస్పతి
ఆ జీవనమే ఒక ఛారిటబుల్ మిషన్
అతడే డాక్టర్ హరికిషన్



**1995 ఏప్రియల్ - 1,2 తేదీలు**

**ఉగాది ఉత్సవం - యువ ఉగాది**

వేదిక :

**ఆంధ్రప్రదేశ్ భవనం**

సంచాలకులు :

**డా॥కేశాప్రగడ సత్యనారాయణ**

సెక్రటరీ :

**బెనర్జీ**

కన్వీనర్ :

**శ్రీ గుమ్మి వెంగళరెడ్డి**

కో ఆర్డినేటర్ :

**చక్రావధానుల రెడ్డప్ప ధవేజి**

# సమస్యలు

శ్రీ కోట లక్ష్మీనరసింహ శతావధాని - తణుకు

"లలలల నా యొడల్ వణకె లావును బింకము తగ్గె నమ్మమా"

పలుకులు కావు కప్పురపు పల్కులు, కుల్కులు దైవతాపగా
విలసనముల్, ముఖమ్మదియు విచ్చిన తమ్మియ, రంభలూరువుల్
చలి కలిగించు నీ చిలిపి చైదములున్, రతివేది - చంద్ర శా
లల, లలనా! యొడల్ వణకె లావునుబింకము తగ్గె నమ్మమా

డా॥ శనగవరపు హృషీకేశశర్మ - నరసాపురం

"వలచె లవంగి నాదుణిసి పండితరాయయటంచు ధర్మవే"?

పొలతిని నేను నా హృదయమున్ దమకిచ్చితినింతలోనె తూ
పులు విరులైన వాడు తన పోడిమి చూపెడి, నీకు మాత్రమున్
గలుగదొంకింత జాలి, నను కౌగిలినీగదె యంచు రాజ! తా
వలచె లవంగి నాదు ణిసి పండితరాయయటంచు ధర్మవే!

శ్రీ పోచినపెద్ది సుబ్రహ్మణ్యం అవధాని- కాకినాడ

"పుత్రికతోడ పెండిలి ప్రమోదమొసంగదె యెల్లవారికిన్"

గాత్రము నీల నీరద వికాస మనోజ్ఞ మహత్త్వయుక్తమై
చిత్రములైన చూపులు రచించుచునున్నవి కావ్యకోటి త
ద్రాత్రికరాత్త సత్కళల లావును కల్గినవన్నెకాడు భూ
పుత్రిక తోడ పెండిలి ప్రమోదమొసంగెదె యెల్ల వారికిన్

శ్రీ ఎఱ్ఱాప్రగడ రామకృష్ణ -రాజమండ్రి

"మరణము కోరివచ్చినది మానిని నీవెటులాదరింతువో"

సరసుడవంచు తద్హృదయ సారస సూర్యుడవంచునెంచి న
శ్వరములుదేహముల్ గనుక సౌఖ్యము ముందుగ బొందుమంచు, సుం
దరతర కామలీలకు ముదమ్మున భాష్యము చెప్పి యామెకా
మ,రణము గోరి వచ్చినది మానిని నీవెటులాదరింతువో

శ్రీ చిలకమర్తి సుబ్రహ్మణ్యశాస్త్రి - నరసాపురం

"సింహము రాజయ్యె నేడు శేముషితోడన్"

అంహోదూరుడు నిర్ణయ
రంహోదూరుండు పదవి రంజిల్లె సుమీ
బృంహితమై పీవీనర
సింహము రాజయ్యె నేడు శేముషితోడన్

శ్రీమతి కడిమిళ్ళ మీనాక్షి (తెలుగు పండిత్) - నరసాపురం

"భార్యలిద్దఱు శ్రీరామ భద్రునకును"
శివునివిల్లును విఱిచెను, సీత గూడి
పెండ్లియాడంగ వచ్చెడి వేళయందు
హారతినిబట్టుచుండిరా యజుని శివుని
భార్య లిద్దఱు శ్రీరామ భద్రునకును

శ్రీమతి కోట ద్యుమణి (తెలుగు పండిట్) - తణుకు

"రణములు చేయుడయ్య సుకరమ్ముగ గౌరవమబ్బు మీకిటన్"
గణగణమంచు మ్రోగవలె గంటలు భారత దేశమందు భూ
షణములు నీదుపల్కులట సత్కవితల్ వచియించు వేళ భా
షణములు వేల్పు బోనముల చాయన నిల్చును గాన బద్యపూ
రణములు చేయుడయ్య సుకరమ్ముగ గౌరవమబ్బు మీకిటన్

శ్రీ కె. శేషగిరిరావు -ఢిల్లీ

"సంధ్యా వందనమేవగింతురు బుధుల్ స్వర్లోక సౌఖ్యమ్ముకై"
వింధ్యాద్రిన్ దలయెత్తనిత్తురొకొ? యావిష్కారమేపాటిదో
అంధ్యంబందిన నాస్తికాధములు దివ్యత్వమ్ము గర్హించుచున్
సంధ్యావందన మేవగింతురు; బుధుల్ స్వర్లోక సౌఖ్యమ్ముకై
కంధ్యంతర్గత శేష శాయికిని మ్రొక్కంజాతురెవ్వేళలన్

శ్రీమతి లత - ఢిల్లీ

"చేప కొంగను మ్రింగెను జెట్టుమీద"
చెఱువు గట్టుననొక చెట్టు చివురు కొమ్మ
దానిపై కొంగ నిలుచు ముదమ్ము తోడ
వెనుక బడ్డది యొకనాడు పిల్లి-ముక్కు
చేప కొంగను మ్రింగెను జెట్టు మీద
(ముక్కునందు చేపగల కొంగ)

శ్రీ టి.వి.ఎస్. మూర్తి - ఢిల్లీ

"విసమును గ్రక్కంగ వచ్చె విజ్ఞానమిటన్"
అసమ ప్రజ్ఞా యుతులై
పసనా 'పాశర్లపూడి' బావిని ద్రవ్వన్
వెసవెస నిప్పులు చెఱగుచు
విసమును గ్రక్కంగ వచ్చె విజ్ఞానమిటన్

డా॥ ఏల్చూరి మురళీధరరావు - ఢిల్లీ

"గోఅగ్రణి నెక్కి శివుడు గోరిపు గాచెన్"
అ ఆలు నేర్చునాడే
ఊ అనకుండగనె శివునినూరక గొలిచెన్
అ ఆ యన కుండగనే
గో అగ్రణినెక్కి శివుడు గోరిపు గాచెన్

శ్రీమతి సత్యజ్ఞానేశ్వరి - ఢిల్లీ

"కుట్టివధాని దెబ్బ మన గూబ పగుల్చునె రాజధానిలో"
బుట్టి మహాగణాంకమును బోలుచునున్నదొ! హేలకాగ దా
బట్టిగ కైత సాగి రస వైభవమున్ బ్రచురించుచుండ నే
జుట్టెద నాకవిత్వమును జుట్టిగ జొట్టిగనంతలోన నా
కుట్టివధాని దెబ్బ మన గూబ పగుల్చునె రాజధానిలో

శ్రీ డి.వి.ఎస్. శాస్త్రి - ఢిల్లీ

"శవ జాతర సాగిపోయె సంతోషముగన్"
అవతార దశకమందున
నవనీతము దొంగిలించు నల్లనివాడే
కవితల నెలవగునో కే
శవ! జాతర సాగిపోయె సంతోషముగన్

శ్రీమతి ఎస్.ఎస్. లక్ష్మి - ఢిల్లీ

"మధుపానమె కూర్చు గీర్తి మహిలో నిజమౌ"
బుధులన్ దరిజేరుచునం
బుధియౌ యీ బాసలెల్ల మొత్తముపట్టన్
పదునెక్కిన యా కైతల
మధుపానమె కూర్చు గీర్తి మహిలో నిజమౌ

శ్రీ డా॥పి. జగన్నాథరావు -ఢిల్లీ

"తురకలు సంధ్యవార్తురట తోయమునీయవె తోయజాక్షిరో"
సరవిని మత్తులోబడుట సంతసమై యలరారువారలీ
దరికి పరిక్రమింతురు ముదంబున మద్యము త్రాగగోరి, యీ
శ్వరపరులైన వారు మన సన్నిధి జేరిన వేళలందు దె
త్తురకలు, సంధ్య వార్తురట తోయమునీయవె తోయజాక్షిరో!

శ్రీ యమ్. గోపాలకృష్ణ - ఢిల్లీ

"రంభను ప్రేమతో బిలిచె రాముడు లోకము సంతసిల్లగన్"
శుంభదశేష మార్దవ విశోభిత గాత్రియు బ్రేమధాత్రి, యు
జ్జృంభిత సద్గుణాత్త రససేవధి జీవధి దూరమేగుచో
కుంభినిపట్టి సిగ్గుపడి, కూర్మిని బేర్మిని చూపియావ నా
రంభను ప్రేమతో బిలిచె రాముడు లోకము సంతసిల్లగన్

శ్రీమతి పద్మ - ఢిల్లీ

"సాంద్రంబయ్యె తమస్సు పట్టపగలే చంద్రుండు వేడెక్కగన్"
తంద్రాభావ పవిత్ర కామ పురుషార్థ ప్రాప్త దాంపత్య నీ
రంధ్రంబైన విశిష్ట లక్షణము చెల్లన్ దాశకన్యా నదిన్
పంద్రంబై గొనగా బరాశరుడు తత్ స్థానంబునందెల్లెడన్
సాంద్రబయ్యె తమస్సు పట్టపగలే చంద్రుండు వేడెక్కగన్
(చంద్రుడు వేడెక్కుట అనగా చంద్రవంశం వృద్ధినొందుట)

శ్రీమతి ఎ. పద్మావతి - ఢిల్లీ

"ముండను మ్రొక్కు నీవికను మోక్షము గల్గును నిశ్చయంబుగన్"
అండజయాన, గల్గు జగమంతయు తద్హృదయాన నిల్చును
ద్దండను, సర్వశాత్రవ విదారణ శీలను, భక్తకోటికిన్
బండుగ జేయునట్టి గుణవైభవ మూర్తిని, గోరి చేరి చా
ముండను మ్రొక్కు నీవికను మోక్షము గల్గును నిశ్చయంబుగన్

శ్రీ పి. సూర్యనారాయణ - ఢిల్లీ

"గళరెడ్డిని వదిలిపోయె కాదనగలమే"
పలుకులు కప్రపు బలుకులు
నలవోకగనెట్టి కార్యమైనను జేయున్
అలతిగనహమే యా వెం
గళరెడ్డిని వదిలి పోయె కాదనగలమే

శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి - ఢిల్లీ

"స్పందీ!నన్ దయచూచి ప్రోవగదె! నీపాదంబులన్ గొల్చెదన్"
మందారంబవు నీవు భక్తులకు ప్రేమస్యంది చిత్తంబులన్
సౌందర్యంబునకీవయిక్క భువనోత్సాహంపు బుట్టింటివై
చిందన్ బ్రేమరసంబులెల్లపుడునుజ్జీవింప జేయన్ రస
స్పందీ! నన్ దయచూచి ప్రోవగదె! నీ పాదంబులన్ గొల్చెదన్

శ్రీ వినోద్‌పాల్ - ఢిల్లీ

"జీరోకై వెలుగొందె భారతి రసశ్రీలొప్పగా హస్తినన్"
సారాసార వివేచనా పటిమ విస్ఫారించి సారించి వి
ద్యారాకేందుడు కాగ వెల్గి కవితాహ్లాదమ్ము సంధించి భా
షారాసిక్యము మేళవించి రసవిస్తారుండెయౌ నా బెనర్
జీ-రోకై వెలుగొందె భారతి రసశ్రీలొప్పగా హస్తినన్
(బెనర్జీ - ఎ.పి. భవన్ సెక్రటరీ)

శ్రీ మల్లంపల్లి ఏకోరామసిద్ధుడు - నరసాపురం

"పురుషునకున్ బురుడు వచ్చి పుత్రిక పుట్టెన్"
పురుషోత్తమునకునొక సుం
దరి తోడను బెండ్లి జరిగె, దన్వీమణియున్
సరసాన్వితయై సుఖమీ
బురుషునకున్, బురుడువచ్చి పుత్రిక పుట్టెన్

శ్రీ జి. వెంగళరెడ్డి - ఢిల్లీ

"కల్లును త్రాగియే నడుము గట్టిరి మద్యము మాన్ప గోమలుల్"
అల్లదె! యక్షరాస్యతకునాలయమై విలసిల్లనేమొ? నే
డిల్లును చక్కదిద్దుకొని యింతులు ముచ్చట జేయువేళ రం
పిల్లును ధూర్త భర్త తన విజ్ఞత కోల్పడి మంచి పల్కులన్
కల్లును త్రాగియే నడుము గట్టిరి మద్యము మాన్ప గోమలుల్

# వర్ణనలు

శ్రీమతి డా॥ భువనేశ్వరీ దేవి - ఢిల్లీ

"ఇంద్రప్రస్థవర్ణన - హస్తినాపురం, పద్మనాభవృత్తం"

ఓయింద్ర ప్రస్థమ్మ నిన్ జేరునివ్వేళనుల్లాసమే నన్ను జేరంగ వచ్చున్
ఈయుత్సవంబెల్లనాధర్మరాజాదులీశత్వమున్ బొంది పాలించియుంటన్
నాయుల్లమున్ బొంగె మీ యుల్లమున్ బొంగు నానాట నానాట సంతోషమొప్పన్
ధీయుక్తులైయుండు వారెల్లనిందుండి తేజమ్ము బొందంగ వీలున్నదే

శ్రీ డా॥ యమ్. రామమూర్తి - ఢిల్లీ

"అలనన్నయ్యకు లేదు" పద్యం నన్నయాదులు వింటే వారి భావం"

పొగుడుచున్నాడా! తనను దా బొగడు కొనెనా!
ఇంత వింత శిష్యులను దర్శింపలేదు
కవులు క్రాంత దర్శులనుట కల్లయయ్యె
విశ్వనాథుడవైతోయి విశ్వనాథ!

శ్రీ ఎస్. ఎన్. శాస్త్రి - ఢిల్లీ

"మూడవ ప్రపంచ యుద్ధం జరిగితే పరిణామాలు"

కష్టములు కల్గె సుఖములు కల్గుచుండె
మరల కష్టముల్ సుఖములు మసలునేమొ
యుద్ధములు వచ్చు శాంతుల యునికి కలుగు
భాగ్యపంక్తియు జక్రార పంక్తి గాదె

శ్రీమతి యమ్. గిరిజ -ఢిల్లీ

"విష్ణుమూర్తి భూలోకమునకు వచ్చిరాయి, రప్ప చెక్క ముక్క అయితే"

కాలు నిలువని చంచల కాంతయయ్యె
భార్య భూమియు తిరుగుళ్ళు పడుచునుండె
కొడుకు గొడవల మారి యా పడుక చిలువ
కొయ్య యయిపోయె బూరి వికుంఠుడపుడు

శ్రీమతి ఎం. కుసుమ - ఢిల్లీ

"పనికిరాని వస్తువు"

గరిక పూవు కూడ గణపతి పూజకు
బనికి వచ్చునమ్మ పడతి వినుమ
పనికిరానిదైన వస్తువు జగతిలో
కానరాదు మాకు గవితకయిన

శ్రీ ఎ. లక్ష్మణకుమార్, ఢిల్లీ (భుజంగ ప్రయాతం)

"విశ్వనాథుడు చంద్రమండలంపై కాలు పెట్టునపుడు భావం"

వేయనా? పాదమున్ వీనిపై మానవా?
నాయనా చంద్రుడా! నాకు సేమంబొకో!
నీయెడన్ భక్తుడన్ నిక్కమే నమ్ముమా!
వేయనా మానవా! విశ్వనాథుండనే!

"నేటి సర్వమంగళ భర్తకు విషమిస్తే"

మ్రింగెడి వాడు విభుండని
మ్రింగెడిదియు గరళమనియు మేలగునాకున్
మ్రింగుమనె నేటి భార్యయు
మంగళసూత్రంబు నేడు మామూలయ్యెన్

"బంగారం ధర తగ్గితే కాంతలభావం"

10గ్రాములు 25 రూపాయిలు అయితే
వెల తక్కువ బంగారము
వెలదులు తామిష్టపడరు వెల వెల పోవన్
కలిగిన యంతకు వెండియ
పాలతుల కిష్టంబెయగునా? భూషించుకొనన్

" భార్యాభర్తలు ఒకరి విధులు వేరొకరు చేస్తే భావం"

భార్యమూతిపై మీసాలు వరలునేమొ
భర్త పురిటినొప్పులు కూడ పడునాయేమొ
కనుక సాజమ్ములిచ్చుటన్ గలుగవలయు
పైని మీయిష్టమగురీతి బరగుడయ్య

"అవధాని బుఱ్ఱకు -కంప్యూటరు"

పెద్దయంత్రమయ్యు ఫీడింగు వలయును
చిన్నమెదడు దానినెన్నబోదు
కనుకనీవధాని కలయంత్రములకెల్ల
ఘనుడు వానికంటె ఘనము లేదు

"చల్లని సాయంకాలంలో మగువ విమానం నడుపుతుంటే మానసిక స్థితి"

చల్లని వేళలో చదలు చంద్రుని గూడెడి వేళ రివ్వునన్
సల్లలితాంగి నేర్పుమెయి జక్కగ బూనుచు వ్యోమయానమ
య్యుల్లదె చేయుచున్నదిసుమా! తనచిత్తమునంతకంటెను
త్ఫుల్ల సరోజ మిత్రునకు దోబుచులాటలు నేర్పనెంచెనో

"ఏపి-భవనం - ఢిల్లీపై

ఏపీ భవనము మేనికి
తాపము తగ్గించె హృదయతాపము తగ్గెన్
ఆపలుకులువాసత్కృతు
లాప్రేక్షక కార్య కర్తలానందకరుల్

"మంథర పల్కులు విన్న కైక భావం"

పొట్టిది కాదిది నిజముగ
గట్టిది యౌన్నత్యమెంత కలిగెనొమదికిన్
ఇట్టిట్టు పలికి మంథర
అట్టేనను రాజమాత యగునటు చేసెన్

"మనిషి కాలూనగా చంద్రుని భావన (సీసం)"

చందమామా! రమ్ము జాబిల్లి! రమ్మంచు!
పసిపిల్ల తల్లులు పాడుచుంద్రు
చందమామను బోలు జాన మోమని చెప్పి
కవిపల్కుచుండును గళమునెత్తి
ఆరోజులే పోయె ఆతీరులే పోయె
వారలే యిచ్చోట పదమునూన
కాలునాపైనిల్పి గాననే గ్రిందైతి
విపరీతమేమి యీవింత సృష్టి

వాడు నా వద్దకై వచ్చి పడిన నాడు
నేను భూమికి జేరగా నేర్వలేనొ
అనుచు జాబిల్లి యనుకొన్నసంతమానొ
ఎల్లవిశ్వమ్ము బిగిసి కృశించిపోయి

"బాబూమోహన్ సౌందర్యం"

జగమే బాబూమోహన్
అగణితముగ పొగడచుండెనయ్యా విన్నే
తొగలందు నల్లకలువవు
సొగసొక్కటిలేదు కాని సొగ్గాడివయా!

"గిరీశం మళ్ళీపుడితే"

కతయడ్డము తిరిగెనుబో
వెతదై సౌజన్యమెల్ల వెడలెను సుమ్మా!
పతిహీనలు నీ బోటులు
జతలేమినినెట్లు బ్రదుక జాలుదురు భువిన్

"యువాబ్దికి - స్వాగతం"

స్వాగతమ్మో యో యువా! విశాల భావదీపికా
భోగ దుష్క్రియాంధకారములను బార ద్రోలవే
ఆగడాల ఆకురాలుపంతరించిపోయి నీ
ఆగమనమె ఐక్యపల్లవాంకురితము కావలెన్

# దత్తపదులు

శ్రీమతి సత్యవతి ఆంజనేయులు - ఢిల్లీ

"యువత, నవత, సవిత, కవిత" రాజధాని శతావధానం

యువతకు వరమై నవ మా
నవతకునూపిరియు గాగ నవ్యోత్కర్షన్
సవితయుగా వే వెలుగుల
కవితలనవధాని వెలిగె గద ' హస్తినలో!

శ్రీ ఆర్. సురేష్ - ఢిల్లీ

"జమానా, దివానా, పర్వానా, మస్తానా, కాలేజీ వాతావరణం"

ఈ జమానాలలో శిష్యులిట్టులుండె
ఏదివానర జాతికి నీశులయ్యె
దౌష్ట్యమొక్కటియే సమస్తాన నిలిచె
మారి మధుమాస పర్వాన మసలుడయ్య

శ్రీ యమ్. రవీంద్రనాథ్ - ఢిల్లీ

"పూరి, భేరి, గారి, కోరి - విష్ణుస్తుతి"

పూరి గరచిరి రక్కసుల్ పులుగు రౌతు
భేరి మ్రోయింపనంతలో భీతులగుచు
గనుకననగారి యుండగా గలుగు సుఖము
కోరికలు వీడి మోక్షమే కోరవలయు

శ్రీ పి. సూర్యనారాయణ - ఢిల్లీ

"సోముడు, భీముడు, రాముడు, కాముడు, - శ్రీరామ స్తుతి"

కాముడు జానకీ హృదయ కంజ వికాసన హేతువౌట ద్వి
ట్భీముడు సర్వ శత్రుజన భీకరుడై వెలుగొందియుంట దా
సోముడు వెన్నెలల్ తనను చూచిన వారికొసంగుచుంట శ్రీ
రాముడు మానవుండనగ రాదు సుమా! పురుషోత్తముండగున్

డా॥ జె. లక్ష్మీరెడ్డి - ఢిల్లీ

" ఉసురు, ముసురు, గసురు, విసురు"
సంపాదకుడు రచన వెనక్కు పంపుతూ వ్రాసే లేఖ

ఉసురుసురంచు పాఠకులహో! పరివేదన గాంతు రేమొ నీ
విసురులు మానగా వలయు విశ్వము చూచి రచింపుమమ్మ యీ
ముసురుచునున్న బాధలకు పొందికనద్దము పట్టుమమ్మ! బా
గసురులు పొందరాదు సురలందవలెన్ రచయిత్రి! సోదరీ!

శ్రీమతి లీలావతి కులశేఖరం - ఢిల్లీ

"శంక, వంక, జింక, బంక రామాయణపరంగా"

శంకర! ద్విణ్ణాశంకర!
జింకను గోరితిని నేను జేద్పడితిని యా
వంకకు బోతివి ముఖమున్
బంకజమను రామచంద్ర! వాడినదయ్యా

శ్రీమతి రంగనాయకమ్మ

"బంధ, సంబంధ, అనుబంధ, కబంధ లక్ష్మీరూపంగా

'బంధ'ములయందు కవన' సంబంధమొకటి
శ్రీ'క బంధము' కావలె జీవితమున
జనులకనుబంధమును బెంచు జానవీవు
కనుక మాయందు దయచూపు కమల సతము

శ్రీమతి డా॥ టి. సుశీల - ఢిల్లీ

"అహంకార, అలంకార, ప్రతీకార, కార భారతార్థం"

ఔర! వారికినీ'యహంకార'మేల
నారునూరైన కార'ముల్ నూరుగాక
త'త్ప్రతీకారమును జేసి తనరకున్న
కౌరవులకదియొక 'యలంకార'మగునె?

శ్రీ డి. హరిహరస్వామి - ఢిల్లీ

"స్నేహ, దాహ, మోహ, రోహ - నేటి యువతీ యువకులపై"

అది తీరని 'దాహ'ంబై
యెదలో గామ ప్ర'రోహ'మే సర్వంబై
కదిలించెడి మోహంబున
నిదురించెను 'స్నేహ' దృష్టి నేటి యువతలో!

శ్రీమతి పి. లక్ష్మీ - ఢిల్లీ

"లేజి, కాలేజి, మేరేజి, మైలేజి - స్వేచ్ఛ"

'లేజీ'తగాని సుత 'కా
లేజీ' చదువులకు పోయి లీలలు పలు 'మై
లేజీ'లు దాటి పో, 'మే
రేజీ' యెటులౌనొ! చెపుమ! లేవో విలువల్

శ్రీ వి.వి. రావు - ఢిల్లీ

"రండ, ముండ, కుండ, దండ -శ్రీకృష్ణుని గూర్చి"

దండము విశ్వంభరునకు
రండటు పూజింపవలయు రక్షకుడటు పో
కుండగ భయమేలకు మే
ముండగ కన్నయ్య మనకునూనిక యెపుడున్

శ్రీ మహారాజా - ఢిల్లీ

"ప్రవత్తి, ప్రతిపత్తి, ఉత్పత్తి, వ్యుత్పత్తి - విశ్వనాథ పై"

భావమందున భక్తి ప్రపత్తి గలదు
పదపదమున రస ప్రతిపత్తిగలదు
శబ్దముత్పత్తి యగుటయే సాజగుణము
విశ్వనాథుని వ్యుత్పత్తి విశ్వమయము

శ్రీమతి బి.వరలక్ష్మి- ఢిల్లీ

"తొలకరి, పలక, తాత, ఈత
ఆం॥ప్ర పల్లె ప్రాంతం తాతామనుమల సంభాషణ"

తాతా పలకన్ గనుమా!
యీ తప్పుడు గీతలేమి? యివి యక్కరముల్
యీ తొలకరిలో నాగలి
చేతన్ గొనరాదొ! చదువు జెప్పించుమయా!

శ్రీమతి కె. విజయ - ఢిల్లీ

నయము, నయనము, అభినయము, వినయము
"మీ అవధానం ఆపి నేను నృత్యం చేస్తే మీ అభిప్రాయం"

నయనములయందు నీయభినయమునందు
నడుగునడుగుననాభిజాత్యమ్ము గలదు
యనయమును గూడ మా హృదయంబునందు
వినయమున్నది విశ్వ వివేకముండె

శ్రీ జి. వెంగళరెడ్డి - ఢిల్లీ

"నవన, నాన, నీన, నాని - ఇష్టం వచ్చిన రసంలో"

లల'న నన' బోడి మదన విలాసమెంచి
మోవి'నాన'గ బ్రియమార ముద్దు'నీన'
'నాని' పోయినదాపె కన్యాత్వమెల్ల
శిశువు మొలకెత్తుటకు నాంది చెలగెనేమొ!

# మండపేట - శతావధానం

సమర్పణ
శ్రీ ఎస్.ఎస్.ఎమ్. గోపాలరావు
నర్సాపురం

తన చేతికి ఎముకలేదు
ఏనాడూ లేదన్న మాటరాదు
కవిజన కామధేనువు
ఎస్.ఎస్.ఎమ్. గోపాలరావు



**1995 జూలై - 8,9 తేదీలు**

వేదిక:

**టౌన్‌హాల్**

**శతావధాన నిర్వాహక కమిటీ**

అధ్యక్షులు :

**శ్రీ వి.వి.ఎస్.ఎస్. చౌదరి, M.L.A.**

కన్వీనర్ :

**శ్రీ పున్నమరాజు ఉమా మహేశ్వరరావు**

సంచాలకులు :

**డా॥ ప్రసాదరాయ కులపతి**

**డా॥ బేతవోలు రామబ్రహ్మం**

# సమస్యలు

శ్రీ వద్దిపర్తి పద్మాకర్ (సహస్రావధాని) ఏలూరు

చక్రము విష్ణుండు చీల్చె సర్పులు పొగడన్

సక్రమమో యక్రమమో
యాక్రమ మెఱుగంగలేని, యాశిశుపాలున్
విక్రమమును జూపుచు నీ
చ క్రము విష్ణుండు చీల్చె సర్పులు పొగడన్

శ్రీ అల్లంరాజు కామేశ్వరశర్మ, కేశన కుర్రు

"విఘ్నంబుల్ దగునెన్నికన్ గెలిచినన్ బీతమ్మదిష్ఠించినన్"

శ్రీఘ్నంబైనది నేటి జీవనము వాసిన్ దక్కి సౌభాగ్య తే
జోఘ్నంబై యలరారు నైతికత తా జొక్కంగ జొక్కంగ శ
త్రుఘ్న భ్రాతను బోలు బాలకుడు తోడ్తో వచ్చునందాకనీ
విఘ్నంబుల్ దగునెన్నికన్ గెలిచినన్ బీతమ్మదిష్ఠించినన్

శ్రీ నృసింహదేవర ఉమామహేశ్వరరావు

"పూవునబుట్టు బూవులవి పొల్పుగ వింటిని గంటినీయెడన్

ఓవనజాస్య! నీ కనులునుత్సవముల్ కలిగించు బూవులై
నీవరివస్యనం దుకొన నేర్చిననాడె మరందమబ్బె భా
షావిధికందనట్టిది విశాల జగత్తున జిత్ర చిత్రమై
పూవునబుట్టు బూవులవి పొల్పుగ వింటిని కంటి నీయెడన్

శ్రీ గొర్తి సూర్యనారాయణ

భానుడు భానుడా! కర విభాసితుడా! కమనీయ మూర్తియా!

ఔనట వామనుండు తనయంతటి వాడొరుడుండనట్టుల
భ్రాన త్రివిక్రమత్వమున బాపురె యింతకునంతయౌచునెం
తేనియు వృద్ధి బొంద రవియే కర భూషణమయ్యె నాటియా
భానుడు భానుడా! కర విభాసితుడా! కమనీయ మూర్తియా!

శ్రీ బి.ఎస్.జి. కృష్ణమాచార్యులు

"తలమున నిట్టి నేతలు యథావిధి నీతరమా సృజింపగన్"

పలికినదెల్ల బంగరువు బాటకు మేలిమి యొజ్జబంతి చే
తలు కనుగొందుమా సతము దార్శనిక స్థితి కల్గియొప్పునా
తలపులు వంక చౌదరికి దార్కొనునప్పుడె పండునీధరా
తలమున నిట్టినేతలు యథావిధి నీతరమా! సృజింపగన్

శ్రీ చక్రవర్తుల వెంకటశాస్త్రి

"ఏకు మేకయి పీడింపదే లతాంగి"

మగడు సురద్రావి పరదార మాటు చేరి
ఆమె తోడుత సరసమ్ములాడెనేని
అసలు కంటెను వడ్డీయె యధికమగుచు
నేకు మేకయి పీడింపదే లతాంగి

డా॥ కేశాప్రగడ సత్యనారాయణ - అవధాని - కిర్లంపూడి

అత్త సుభద్రనెట్టులిక వాసవ సూనుడు పెండ్లియాడునో

అత్తమి యెట్టిపాటిదొ! యొయారముగా దన తీర్థయాత్ర గ
మ్మత్తుగ జేసి ఫల్గుణుడు మానినితో సరసమ్ములాడుచున్
హత్తుకొనంగ నాహలికినయ్యది యిష్టము కామినా ప్రభా
వత్త సుభద్ర నెట్టులిక వాసవ సూనుడు పెండ్లి యాడునో!

శ్రీ పురాణపండ సత్యనారాయణ - జగ్గంపేట

సవతిన్ దెచ్చిన మెచ్చి మ్రొక్కె బతికిన్ సంతోషిత స్వాంతయై

అవలీలన్ దపియించి సాగరియ దీక్షాయత్తుడై గంగకున్
భువిమార్గమ్మును జూపినాడచట శంభుండిచ్చె శీర్షంబు, గా
రవమీ లోకులపైని బార్వతికి నౌరా! యామె నాడా విలా
సవతిన్ దెచ్చిన మెచ్చి మ్రొక్కె బతికిన్ సంతోషిత స్వాంతయై
(సగరస్యగోత్రాపత్యం సాగరిః భగీరథః)

శ్రీ మోటూరి సత్యం - జగ్గంపేట

"రావణుడయ్యె రాఘవుడు రంజిలె రాజ్యము రామరాజ్యమై"

ఆవరివస్య లోకమునకై కొని తానవతారమెత్తె దౌ
ష్ట్యావృత శీలసంపదకునాకరమై వెలుగొందునా దశ
గ్రీవుని ప్రాణముల్ గొనుటకే దిగివచ్చుటనయ్యరీభవ
ద్రావణుడయ్యె రాఘవుడు రంజిలె రాజ్యము రామరాజ్యమై

శ్రీ ద్వాదశి నాగేశ్వర శాస్త్రి - అమలాపురం

హ్యాట్సున్ బూట్సునకున్న గౌరవము శాల్వా నీకు లేదాయెగా

ద్వీప్సంతానము రెచ్చిపోయినది సందీపించి వ్యాపించి ఆ
ఛీట్స్ రాజ్యము నేలుచుండిరిగదా! చింతింపనేముండెలే!
హేట్సాఫంచు వచింపగావలయుజుమ్మీ నేటికాలమ్ములో
హ్యాట్సున్ బూట్సునకున్న గౌరవము శాల్వా నీకు లేదాయెగా

డా॥ అబ్బిరెడ్డి పేరయ్యనాయుడు - శతావధాని - రాజమండ్రి

చితిమీదన్ జరిపించిరుద్వహమునాశీర్వాదమున్ బల్కుచున్

క్షితిపై యెవ్వడు శైవ చాపమును భంజింపంగ శక్తుండు ప్రాం
చిత లీలన్ గురుసేవ చేసికొనుటన్ శీఘ్రమ్మ తచ్ఛక్తి సం
గతినాకై యొన గూరె విద్యలటులే కాంక్షించి సాధింపనే
ర్చితి, మీదన్ జరిపించిరుద్వహమునాశీర్వాదమున్ బల్కుచున్

శ్రీ కోటమర్తి వేంకట లక్ష్మీ నరసింహమూర్తి - కొవ్వూరు

కులపతి కోకలెత్తుకొని కొమ్మల చాటునకేగెనింతలో

పలికిన గీత పల్కగల వైఖరియున్నది చేత వెన్నము
ద్దలు గొనిపోవు లక్షణము తార్కొనియున్నది చిన్ననాటి చే
ష్టలు వచియింపగా దరమె స్నానము చేయగ వ్రేతలెల్ల గో
కుల పతి కోకలెత్తుకొని కొమ్మల చాటునకేగెనింతలో

ఆచార్య జోస్యుల సూర్యప్రకాశరావు - వారణాసి

"తనయుడు మామయై తనరె దండ్రికి సర్వులు సమ్మతింపగన్"

తన కృతినంకితమ్ముగ ముదమ్మున దండ్రికినిచ్చినాడు త
త్తనయను దండ్రి గైకొను విధమ్మున మామగ మారినాడు విం
తను ఘనుడయ్యె లోకమున దండ్రికి బిడ్డకునెట్టి బంధమో
తనయుడు మామయై తనరె దండ్రికి సర్వులు సమ్మతింపగన్

శ్రీ పోచినపెద్ది సుబ్రహ్మణ్యం కాకినాడ (అష్టావధాని)

పదముల కూర్పు వీడినను బద్యములల్లగ వచ్చు సోదరా!

అదనుగ సత్కవిత్వ హృదయాంబుజ భవ్య మరంద ధార సం
పదగ గ్రహించెనేని రసవైభవముల్ పచరించెనేని స
మ్మదముగ సత్కవీశతను బొందగవచ్చునెఱుంగుమయ్యదు
ష్పదముల కూర్పువీడినను బద్యములల్లగవచ్చు సోదరా!

శ్రీ గరిమెళ్ళ కుమారం - మోడేకుఱ్ఱు

బొట్టును లేని వాడొకడు బొట్టును బెట్టెను బొట్టుకోసమై

తిట్టగలేని వాడొకడు తిట్టగ జొచ్చెను దిట్టుకోసమై
పట్టగలేని వాడొకడు పట్టగ జొచ్చెను బట్టుకోసమై
పెట్టగలేని వాడొకడు పెట్టగ జొచ్చెను బెట్టుకోసమై
బొట్టునులేని వాడొకడు బొట్టును పెట్టెను బొట్టుకోసమై

శ్రీ కందుకూరి లక్ష్మీనరసింహం - అష్టావధాని (కాకినాడ)

"తల్లిన్ జంపిన వాని దైవమని నిర్ధారించె సద్గ్రంథముల్"

అల్లన్ జేపయొ కూర్మమో కిటియొ తానందందునేదేని రం
జిల్లన్ రూపములెత్తినాడు హరి సుశ్రీదాయియై కోపమున్
బెల్లానన్ నృపలోకమున్ దునిమె తత్పిత్రాజ్ఞకున్ బద్ధుడై
తల్లిన్ జంపిన వాని దైవమని నిర్ధారించె సద్గ్రంథముల్

శ్రీ పున్నమరాజు రామచంద్రరావు - మండపేట

"సతి సతి గలియంగ బుత్రసంతతి కల్గెన్"

రతి రతి కుంతీమాద్రుల
గతులం గల మాన్మధ కళ కాంక్షించుటచే
అతులిత రాసిక్యుండై
సతి సతి గలియంగ బుత్ర సంతతి కల్గెన్

శ్రీ కోట లక్ష్మీ నరసింహం - శతావధాని - తణుకు.

కుండలు జూచి మ్రొక్క సమకూరును నీకు సమస్త సౌఖ్యముల్

భాండము విశ్వమై హరుడు భాండకరుండుగ సృష్టినెల్లనొ
క్కండుగ జేసి లోకమును గాచి లయించుచునుండు సుమ్మ వీ
రిండితనమ్ముతో హరుని లీలలు దూరకుమయ్య గూఢపా
త్కుండలు జూచి మ్రొక్క సమకూరును నీకు సమస్త సౌఖ్యముల్

శ్రీకొండేపూడి వెంకట జోగన్న

కాజా, లడ్డూ, బజ్జీ, వడ - భారతార్థంలో

నీ'కాజా'మున మృత్యువు
మోకా'లడ్డూ'ను గాక ముప్పు తొలగునే
శ్రీ కం'బజ్జీ'వితమని
నీకలయా సింధురాజ! నేలవడంకున్

శ్రీ కందుకూరి లక్ష్మీనరసింహం

గోపరి, కోపరి, కీపరి, కాపరి బాలకృష్ణుని ఉత్పలమాల

కోప రిపు ప్రభావమునకున్ జడియుండట బాలయోగి, ఆ
గోపరిపాలకుండు కొనగోటిని పర్వతమెత్తినాడు శ్రీ
కాపరిపాలనమ్మునకు గావలె నీదగు శక్తి యుక్తి మా
కీ పరివేష మొక్కటియ యిచ్చును ముక్తిని బంధ హైన్యమున్

శ్రీమతి కె. సత్యశ్రీ - ధవళేశ్వరం

ఆమని, సౌందర్య, రోజ, ఊహ - శ్రీ కృష్ణునిపై

ఆర్యుడు నల్లవాడు వనితావళి గుండియలం బిగించు 'సౌం
దర్య' యుతుండు'నూహ'లను దాగెడువాడు రస ప్రలోలుడున్
శౌర్యము కల్గియున్ సరస సంగతి పుల్ల స'రోజ' నేత్ర స
త్కార్యములంది 'యామని' ముదంబున నింపువవార్తవంబుగాన్

# దత్తపదులు

శ్రీ రేగడమిల్లి సత్యనారాయణ

నెత్తి, మొత్తి, సుత్తి, హత్తి (ప్రస్తుత రిజర్వేషన్ల రగడను గూర్చి)

ఎంత సౌజన్యమిపుడు పైనెత్తి'కొనిన
'హత్తి'నట్టి దుర్భావములాగ గలవె
మంచి యూ'సుత్తి'మాటగా మసలుచుండె
'మొత్తి'కొన్న గేటాయింపు పోదు పోదు

శ్రీ దంతుర్తి శ్రీరామ చంద్రమూర్తి

కర్త, భర్త, హర్త, వార్త (రామాయణార్థంలో)

కర్తవు నీవు లోకముల గారడిలోని వినోదలీలకున్
హర్తవు నీవు బంధనములన్నిటినిన్ బరిమార్చు వేళ భూ
భర్తవు నీవు లోకముల పట్టును నిల్పగలట్టి వాడవీ
వార్త జనావనుండవు శుభాశిషమీగదె రామచంద్రుడా!

శ్రీ పున్నమరాజు మల్లేశ్వరరావు - మండపేట

మండపేట, మురమండ, పెద్దాపురం వేల్పూరు షేర్‌మార్కెట్ స్థితిగతులు

వినుడు వినుడయ్య మే'మండ పేట' పేట
మోస'ముర మండ'వచ్చునా బుద్ధియేల
వినుము'పెద్దా! పురం'బందు వెలయషేర్లు
నట్టి పురమెపో 'వేల్పూరు'నాగ జెల్లు

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ శాస్త్రి - కాకినాడ

తులువ, చెలువ, వలువ, లలిత (జయలలిత అవమానాన్ని వర్ణిస్తూ)

వలువను బట్టి యెక్కరుడు పాలక కోటికి సిగ్గుదెచ్చెగా
తులువను నాడు తామిళులె దూరిరి స్త్రీని బరాభవింపనా
చెలువయె భూమినేలగల చేడియగా విలసిల్లు నేడు స
ల్లలిత జయాస్పదంబగుట రాముని మైత్రిని జాటుచున్నదో

శ్రీ చింతా యాజ్ఞవల్క్య మహర్షి

శిఖ, శిఖి, మఖ, రేఖ వాతాపి ఇల్వలుల చంపిన అగస్త్యుని అంతరంగం

విశిఖార్చుల్ కురిపింపగావలయు దోర్వీర్యంబు నిర్జించి ర
క్కసి కోపాగ్ని శిఖా విశేషమున రేఖామాత్రుడై యొప్పె తా
పసినై నేను మఖమ్ముచేయునెడ దుర్వ్యాపారమున్ జూపువా
డశిఖిన్ భస్మముగాడె! చేసెను మహర్ష్యగ్రుండగస్త్యుండహో!

శ్రీమతి కొండేపూడి రుక్మిణి - మోడేకుఱ్ఱు

లంచము, కంచము, మంచము, కుంచము,
నేటి రాజకీయ పరిస్థితిని వ్యంగ్యధోరణితో

లంచములకు బానిసీడు లావు పదమునందినన్
కంచములను గూడు కల్గు గానివారికెల్లనీ
కుంచము సిరియయిన వారికుర్చీ యిట్టులుండె నీ
మంచమిక విధానమయ్యె మంచి ప్రొద్దు కల్గునా

శ్రీ చిలకమర్తి సుబ్రహ్మణ్యశాస్త్రి, నరసాపురం

చేపుట, మేపుట, ఆపుట, రేపుట లంచగొండితనం

మేపుట చేపుట కొఱకే
ఆపుట రేపుటల కొఱకె యదిలంచములో
రూపాంతరమును జెందును
దాపరికంబేలనవియ తాంబూలంబుల్

శ్రీ ప్రభల సుబ్రహ్మణ్యం - రాజమండ్రి

హస్తిన, ద్వారక, మయసభ, తేటగీతిలో రామాయణార్థం

హస్తి న'రపుంగవుడు రాముడైన యెడల
దోమయ సభాస్థలిన్ గల్గు దులువ యితడు
వచ్చినాడను నేను న'ద్వారక'లిత
మార్గముననుండి రావణా!మాట వినుమ

శ్రీ డి.వి. రమణమూర్తి

కృష్ణ, చిరంజీవి, మనీషా, విజయశాంతి భగవద్గీతార్థంలో

ఈయుద్ధంబున యందునన్ 'విజయ! శాంతి'ఒపంగ నీకొప్పునే
శ్రేయోదాయకమౌను జన్మము 'చిరంజీవీ!' మనీషా' క్రియన్
ఏయంగా రిపుకోటి పూనగదటోయీ యన్ననాలించి మి
ధ్యాయాథార్థ్యమునుజ్జగించెనట!'కృష్ణా!' బోధ యేపాటిదో!

శ్రీ కృష్ణస్వామి

లాసెట్, ఆసెట్, యంసెట్, క్యాసెట్ భాగవతపరంగా

ఆసెట్టైనను తీరకుండునొకొ కృష్ణా! నిన్ను ప్రార్థించినన్
కేశెట్టుల్ భువి గూలినాడట పరిక్షిణాత్మకుండౌచునే
లాసెట్టుల్ సమకూరు నీ మహిమలుల్లాసంబుగా బల్కగా
నీ సంసారము రోజు రోజు విటమిన్యెంసెట్టుగా మారెనే!
(కేశి = ఒక రాక్షసుడు. కేశిహా హరిః - విష్ణు సహస్రం : 62)

శ్రీ ఆకొండి విశ్వనాథం

గము, రంగము, తురంగము, చతురంగము మాడుగుల ద్విశతావధానం

గములు గములుగా తత్పుణి కైతలెల్ల
యాడె చతురంగమచ్చోట యాడి యాడి
భాగ్యనగర రంగమునకు బండువాయె
రయమునందుననింద్ర తురంగమేమొ

శ్రీ సూరంపూడి వేంకటరమణ - కంచుమర్రు

"వేమన" నాల్గు పాదాలలో ప్రాసస్థానంలో వచ్చేట్లుగా వరకట్న దురాచారాన్ని గూర్చి

నీవే మన జాతికి నిధి
కావే మనకొసగు జన్మ కాంతయె గాదే
రావే మన సంస్కృతిలో
చేవే మనవచ్చు శోక చింతలవేలా!

## అనువాదములు

ఒక్కడె పుత్రుడంచు అతడొక్కడె అనుపద్యమునకు అనువాదం

ఏకః పుత్రః కులాధారః
సచ్ఛీలో గుణ సంయుతః
దయాంత్యక్త్వా సుతం గృహ్య
గచ్ఛసిత్వ మలం ప్రభో!

కరారవిందేన పదారవిందం అను శ్లోకమునకు అనువాదం కంద పద్యంలో

కరపద్మము చరణాబ్జము
నొరయన్ ముఖపద్మమందునుంచినవాడై
వర వటపత్రమ్మున ని
ద్దురవోయెడి బాలకృష్ణు దోడ్తో గొల్తున్

శ్రీ జయంతి సోమయాజులు

"వాగీశాద్యాః సుమనసః" అను శ్లోకమునకు అనువాదం

వాగీశాదులు జేజే
లే గణపతినిన్ స్మరింతురీప్సితములకై
యాగణపతినే గొలిచెద
వాగీశత్వమ్ము నాకు బట్టువడంగన్

శ్రీ వారణాసి వేంకటేశ్వరశాస్త్రి - కొవ్వూరు

"అర్థం సత్ర్పతి బంధ" అను శ్లోకానికి అనువాదం

కన్నుల్ గల్గిన దివ్వెలేని యెడలన్ గాంచంగ శక్తుండె రా
త్రిన్నంధుండు సఖుండులేని యెడలన్ దీక్షామతిన్ సాగినన్
మన్నన్వచ్చును కష్టముల్ గనుక ప్రేమ స్యంది చిత్తంబుతో
నిన్నున్ సాకెడి వాడొకండె యిలలో నేస్తంబు వీక్షింపుమా!

శ్రీ మల్లంపల్లి వీకోరామ్ - సీతారామపురం

గ్రీవాభంగాభిరామం అను శ్లోకమునకు అనువాదం

గ్రీవాభంగముచే మనోజ్ఞమగుచున్ లేజింక పర్వెత్తి తే
రే వీక్షించు గుచించుకాయమును వేగేషు ప్రపాతార్తిచే
నావేగమ్మునకర్ధ ఖాదిత తృణ వ్యాప్తమ్ము మార్గంబుగా
ద్యావాపృథ్వులు హెచ్చుతగ్గులుగ గెంతన్నేర్చె వీక్షింపుమా!

శ్రీ గుంటూరి సాంబశివరావు

జ్ఞానానందమయందేవం అను శ్లోకానికి అనువాదం

జ్ఞానానందమయుండట
తానచ్ఛపు ముత్తియముల తళుకులకిక్కై
మానుగ విద్యాధారుం
డావట నా యేటికోళ్లు హయ వదనునకై

శ్రీ తటవర్తి వేంకటరమణ - మండపేట

కేయూరా న విభూషయంతి పురుషం అనుశ్లోకమునకు అనువాదం

కేయూరంబులు చంద్రహారములు మూకీ భావమున్ దాల్చు దా
నేయే లేపనమాచరించినను స్నానేష్ట వ్రతుండైన భా
షాయోషాకృప మాత్రమే నరునికిన్ సౌందర్యమందించు వీ
వేయేభూషలు దాల్చినన్ విలుచునే యీ భాష క్షీణించునే

పోచిన పెద్ది రంగనాథం

"అంబలి ద్వేషిణం" వందే అను శ్లోకమునకు అనువాదం

బలినిన్ వంచిన వానిని
తలచిన వారలకు శుభము తనిపెడు వానిన్
అల మర్దిత కాళియునే
తలచెద నా తలనుపండు దలపులు పండన్

# వర్ణనలు

శ్రీ పామర్తి రామారావు - మడికి

"అవధాన సభను చూచి దివిలో ఉన్న రావూరి వెంకటేశ్వర్లుగారి ఆనందం"

రావురి వేంకటేశ కవిరాజు నభస్స్థలమందునుండి వి
ద్యావరివస్య జూచి యవధాన విధానమునాలకించి యే
మీ విధియెట్టి పాటిదొ కదే యిపుడచ్చటనుందునేని మో
దావహమైన పుల్కలనొయారము చూచెదనంచునెంచునో!

శ్రీ అయినవిల్లి సత్యనారాయణ -ఏడిద

"దేవవ్రతుండు వివాహం చేసుకుంటే"

ఆ దేవవ్రతుడే వివాహముగుచోనా సంతతుల్ గ్రుడ్డిదో
కాదే బాండు వివర్ణదేహయుతమో కాకుండునే గాన నే
నీదేశానకు బాలకుండనని వేరెవ్వారలున్ సంగరం
బీధాత్రిన్ బొనరింపకుందురు గదా! ఏభాగ్యమెట్లుండునో!

శ్రీ ఆనంద్

వాసవీ కన్యకాపరమేశ్వరి - వర్ణన

సురు చిర గుణ సంపన్నయు
వరదాత్రియునైన యట్టి వాసవి కన్యా
పరమేశ్వరి గాత్యాయని
పరమంబగు బదమునిచ్చు భక్తిన్ గొలువన్

శ్రీ వి. కొండలరావు

"మెహెర్‌బాబా జన్మదిన స్తుతి"

వారింపన్ భవ బంధ జాడ్యము మెహర్‌బాబాకు గైమోడ్పెదన్
పారింతున్ బలు పద్యరత్నములనర్ఘ్యాపూర్తి గావించెదన్
సారాసారవివేచనా సహిత విజ్ఞానమ్మునార్జించి మం
దారప్రఖ్యము జీవితమ్మునిక బొందన్ దిక్కు నీవే సుమా!

శ్రీ దుడ్డు రాజయ్య - యానాం

"బాలాత్రిపుర సుందరిపై పద్యం"

స్వర సంధాన విధాన మాధురులు విస్ఫారింప బాలాంబికా
కరయుగ్మ స్థిత రత్నకంకణ ఝుణత్కారంబు తోరంబుగాన్
వరలన్ భవ్యము శ్రావ్యమౌచు గవితాపాండిత్య మూలాత్త భా
సుర నాద ప్రణవంబుతో మదిని సంశోభించునాయంబయే!

శ్రీ యం. సత్యనారాయణ

"అమెరికాలో అవధానం చేసి వస్తుంటే భారతి ఆనందం"

తానాలో గవనాంబుదంబు గురియన్ దానమ్ములాడించి వి
ద్యానాథుల్ పదిమంది మెచ్చుకొనగా దాక్ష్యమ్ము చూపించి సం
తానంబిప్పుడు వచ్చుచున్నదని చిత్తమ్మెట్టులు ప్పొంగునో
ఆ నా భారతి పొందు సంతసములే యాశీస్సులెల్లప్పుడున్

శ్రీ ఏలూరి సత్యనారాయణ

"తొలకరి చినుకుపడితే భూమి తల్లి పులకరింత"

తొలకరించెనాకసమ్ము తూగి యూగె భూమియున్
పులకరింప బుడమి మేను బుల్కలెత్తె రైతుకున్
కలిమియన్న యన్నమన్న జ్ఞానమున్న వారికిన్
తొలకరించు మొయిలు కన్న దోచదొండు దైవమే

శ్రీ ఏలూరి శ్రీనివాస్

"సాహిత్యం, ఆనందానికా, కీర్తికా, లోక ప్రయోజనానికా!"

మనసానందంబొందిన
వెనుకనె కీర్తియును వచ్చు వెల్గున్ జగమున్
కనుకన్ మూడింట బ్రయో
జనమున్నది నేర్చుకొనుము సాహిత్యంబున్

శ్రీ మీర్ జయబాల్

"కర్ణుని దాతృత్వం"

అడిగిన తక్షణంబు తనకక్కర కల్గిన వస్తువేని దా
నిడుటకు సందియంబిడక యెవ్వడొసంగునొవాడెకర్ణుడౌ
తడయని వాడు గాన దగు దాల్మిని బొందిన వాడు గానెనె
ల్లెడలను బేరు గాంచెనదియే గద సత్య యశమ్ము చూడగన్

శ్రీ గరికపాటి శ్రీరామమూర్తి

"కపట బ్రహ్మచారి వచ్చినప్పుడు పార్వతి మానసిక స్థితి"

శివుడేనిన్ శివనింద చేయునెడలన్ జిత్తంబు నాకొప్పునే
భవ వాక్యంబులు మానుమింక భవ సంవాసంబె నాకిష్టమం
చు వచింపన్ నగజాత, మెచ్చిహరుడే శోభామయుండౌచు గౌ
రవ సాక్షాత్కృతి గల్గజేసెనట యౌరా! భాగ్యమేపాటిదో!

శ్రీ తటవర్తి రాఘవరాజు

"భార్యను పొయ్యిలో పెట్టినపుడు పొయ్యిమనస్తాపం"

కట్టెను గాల్చెడి నాయెద యందున గొంతను నిల్పిన దుష్టుడవే
పట్టున నీ మగపాడిని జూపగ భార్యను జంపుట చేవయొకో
పుట్టినయప్పటినుండియు నాకిట బున్నెము చేయుట సాజమగున్
ఎట్టెటు జేసెద బాపమటంచుననెవ్విధి ప్రొయ్యిలు కుందెడినో

శ్రీ కందుకూరి లక్ష్మీ నరసింహం

"డబ్బులేక అవధానానికి రాని వారి మానసిక స్థితి"

డొక్కాడుటకై నిండుగ
రెక్కాడగ వలయు బ్రతుకు రిక్కలతోడన్
చక్కిలిగింతలనాడెడి
నక్కాతల వినెడి భాగ్యమబ్బనిదయ్యెన్

శ్రీ జి. సుబ్బయ్యశాస్త్రి

(సభావర్ణన నిరోష్ఠ్యంగా)

కైతల గనియై నిలచిన
దీ తతి రసజగతియాత్ర యిట్టే గడచెన్
నా తల్లియైన జగతికి
ఖ్యాతికివిది యిక్కయయ్యె గాంచగనయ్యెన్
(జగతి = సరస్వతి "పంచమంజగతీ ఖ్యాతా-")

శ్రీ పి. విజయసారథి

"బాలకృష్ణుడు కాళీయునిపై చేసిన నాట్యం"

కాలియ మస్తక లీలా
హేలా హేరాళ నృత్యహేవాక గతుల్
లీలా వేలాలంకృత
హేలాంచిత గతులనొప్పె గృష్ణుని చేష్టల్

శ్రీ మంత్రవాది అనంత శాస్త్రి

"తెలుగువారు ప్రధానమంత్రి అయితే తెలుగు తల్లి ఆనందం"

తెలుగుతల్లి బిడ్డడిపుడు దేశనేత యయ్యెనే
కలలు పండి యిన్ని నాళ్ళ కాంక్షదీరె జగతికిన్
పలుకు పలుకు మధ్యయెంత వ్యవధి పట్టుచుండునో
తెలివియన్ననద్ది సుమ్మ దీక్షబూని నేర్చుమా

శ్రీ చింతా రామం

రామావతారంలా మిగతా అవతారాలు పల్లె పల్లెలో ఎందుకులేవు?

అవురా రాజ్యము వీడి పల్లియలయందల్లాడె రాముండు కే
శవ సాక్షాత్కృతి రామునందు గలిగెన్ సంతోషిత స్వాంతులై
భువనంబెల్లను నేలువానికిచటన్ బూర్ణ ప్రభావాత్తతన్
గవియం జేసిరి గోపురంబులవి శ్రీ కాముల్ మనోరాములై

శ్రీ గొర్తి సుబ్రహ్మణ్యశాస్త్రి - నరసాపురం

మీ అవధానంలో నాగఫణిశర్మగారు సంచాలకులుగా ఉంటే
నాగఫణిశర్మ కవన విన్యాసమునకు
నిచట కడిమిళ్ళ కవన వాగీశతకును
భారతీదేవి యుప్పొంగ వలయునయ్య
ఎవరి బిడ్డలు వారలకెంత సొగసు

శ్రీ చుండూరి రామమూర్తి

దుర్గ, రాధ, లక్ష్మి, సరస్వతి, ,సావిత్రి, వీరు జనులనేవిధంగా రక్షిస్తున్నారు.
చలయున్ రాధయు, దుర్గయున్ మరియు నాసావిత్రియున్ వాణియున్
జలజాతాసనవాసవాదులకు నిచ్చల్ కోర్కెలీడేర్చు ని
స్తులసౌభాగ్యములందజేయు గవితాశోభామతిన్ గూర్చి పూ
జలుచేయన్ దగుమాతృవర్గమునకున్ సంతోషమేపారగన్

ఆచార్య కొంపెల్ల రామసూర్యనారాయణ - తిరుపతి

"ప్రగతి సాధించలేని యోగసాధకునికి - యోగి ఉపదేశం"
యోగమునందు నీకుగల యూహము నిక్కమెయౌను సాధనా
యోగమునందు నీకృషికినూనుచునున్నది లోపమెద్దియో
ఆగకసాగుమయ్య పరమాత్మవు నీవుగనెంచుమయ్య భా
షాగరిమంబుగంటె పరిచర్యలు గొప్పవి యాలకింపుమా!

శ్రీ దంతు భీమశంకర్

నటరాజ వర్ణన
నటదుత్థాన పదాబ్జయుక్త గిరిజానాథుండవై యుండుటన్
నటదుత్తుంగ తరంగ జృంభిత ఝరీ నాట్యాభిలాషామతిన్
నటరాజత్వము గొంటివో భరతవంద్యా! నీకు జోహారులా
ర్భటిమైయిచ్చుచునుంటినయ్య! గొనుమా వందే పశూనాంపతిం

శ్రీ సుంకర వేంకటరామయ్య - అర్థవరం (అవధాని)

" స్వేచ్ఛావృత్తంలో ఆంధ్రభాషా వైభవం "
మును నన్నయ్య వచించినాడు కవితామోదంబు సంధించి తి
క్కనయున్ బల్కగనెఱ్ఱనార్యుడును వీకన్ బల్కె శ్రీనాథ పో
తనలున్ బల్కిరి రాయలున్ బలికె పెద్దన్నాదులున్ బల్కిరీ
తెనుగున్ మించిన బాస వేరొకటి పృథ్వీ భాగమందున్నదే!

శ్రీ కన్నా జీ గాంధీతాతయ్య

పరాయి ఇంటిదగ్గఱ బందీయై కొంతకాలం ఉండి భర్త దగ్గఱకు
వచ్చిన సీత మానసికస్థితి
తులువల్ నిల్చిన చోట నిల్చుటయె నాదోషంబు తద్దోషమున్
మలపంగా జలయోని సంస్కృతియ ప్రామాణ్యంబుగా నిల్పె ని
శ్చల సంతోషము నాకు గల్గినది, విశ్వాసంబు సంధించి లో
కులు నాథున్ వరివస్య చేయుదురు వాకోవాదముల్ మానుచున్

శ్రీ దాసరి నారాయణరావు

"సంపూర్ణ మద్యపాన నిషేధంపై వ్యంగ్యరీతిలో"

మద్యము లేదని క్రుంగకు
పద్యమ్ములు ద్రాగుమయ్య భద్రాత్మకుడా!
సద్యోవాగ్యోగంబే
హృద్యమ్మని చిత్తమందునెంచుమ సతమున్

శ్రీ మల్లంపల్లి అమరేశ్వరప్రసాద్ - కాకినాడ

"పున్నమరాజు ఉమామహేశ్వరరావుగారు మొ॥ కార్యకర్తలు"

శతవధాన క్రియా సారధ్య సంఘమ్ము
పడరాని పాట్లెన్ని పడిరొ యేమొ
ఎవ్వారు వత్తురో యెవరు రాకుందురో
ఏమి యాసలునెప్పుడెవరికగునొ
ఎవ్వారికేకాంక్ష యేరీతినుండునో
వారలన్ సంతృప్తి పరుపగలమొ
అతిథ్య మర్యాదకవరోధములు లేక
పండునో మా పంట బాగుపడునొ

అనుచునేరీతినెంత యల్లాడినారొ
ఎన్నిరాత్రులు నిద్ర త్యజించినారొ
ఎల్ల హృదయాల వెల్లులనీనినారొ
రాణకెక్కిరి పున్నమి రాజులగుచు!

శ్రీ వారణాసి రాజేశ్వరశాస్త్రి - పిఠాపురం

"భారతి మీ వలన భారవతియా, భాగ్యవతియా?"

అమ్మా! భారతి! నీవు భారవతివే యౌచుంటివో చెప్పు, మా
యమ్మా! భారతి! కాక భాగ్యవతివే యౌచుంటివో పల్కు పా
దమ్ముల్ పట్టెదనమ్మ సంతత కవిత్వస్ఫూర్తితో మ్రొక్కెదన్
జిమ్మన్ జీకటి మాసిపోవలయు నాశీర్భోతులందీగదే!

శ్రీ అయ్యగారి వేంకటరామయ్య

"దారితప్పిన భర్తను దారిలో పెట్టిన భార్య"

నీట బాసినపుడు నీరజమ్ముల పోల్కి
దారితప్పి నీవు తగుల బడెదు
మంచిదారి చూచి మసలుకో గదటయ్య
అనుచు పలికినట్టి అతివ యార్య!

శ్రీ వి.వి.ఎస్.ఎస్. చౌదరి శాసన సభ్యులు

పూర్వం కళలను రాజులు పోషించేవారు ఇప్పటి కళలను ప్రజలెలా పోషిస్తున్నారు.

ప్రజలే రాజులు వారలే కళలు సంభావించు సంధాతలై
ఋజుమార్గంబున సాగుజీవనము చిత్రింపన్ కళాదీప్తి నీ
రజకోటిన్ వికసింప జేయుదురు హేలన్ హేళులై భారతీ
ధ్వజమెవ్వేళల వెల్గుచుండుత ప్రజాస్వామ్యంబునందెల్లెడన్



# పాలకొల్లు సంస్కృతాంధ్ర ద్విశతావధానం

సమర్పణ



**శ్రీ పి. లక్ష్మీనారాయణ**
ఆడిటర్, పాలకొల్లు

ఆలోచనలో సాహిత్య మర్మం
ఆచరణలో తప్పని ధర్మం
మనసంతా సౌజన్య ధారణ
కవిగాయక జన పోషణ
కలబోస్తే పెద్దిభొట్ల
లక్ష్మీనారాయణ



**శ్రీ సి.వి.వి. సత్యనారాయణ**
ప్రిన్సిపాల్
ఛాంబర్స్ జూ॥ కాలేజి,
పాలకొల్లు

పలుకు పలుకులో పసందు
స్నేహ కేదారానికి కామందు
అభినయ కౌశల చణ
రాగ విపంచికా ఝుణంఝుణ
సి.వి.వి. సత్యనారాయణ

**1996 మే 29,30,31 జూన్ 1,2,3**

నిర్వహణ :

**రసధుని**

అధ్యక్షులు :

**శ్రీ పి. లక్ష్మీనారాయణ**

సంచాలకులు :

**ఆచార్య బేతవోలు రామబ్రహ్మం**

కార్యదర్శి :

**శ్రీ సి.వి.వి. సత్యనారాయణమూర్తి**

# దత్తపదులు

శ్రీ ఆర్.ఎస్. వేంకటేశ్వర్లు - పాలకొల్లు

"మల్లె, మొల్ల. మందార, జాజి (యుద్ధరంగాన్ని వర్ణిస్తూ)"

అతులమైన వ్యూహ'మల్లె'ను ద్రోణుండు
వై'రమొల్లన'ట్టి వాడెయయ్యు
'జాజి' వంటి బిడ్డ సమర'మందార'దే
గురుడు బాలు నిట్లు కూల్చెనేల

శ్రీ జోస్యుల కృష్ణబాబు - పాలకొల్లు

"ఊరపంది, కోడిపెట్ట, జల్లచేప, కప్ప (బ్రాహ్మణుల ఇంటిలో పెళ్ళి భోజనం)"

'ఊరపంది'రి వేసినాడుత్సవముగ
'కప్ప'నద్దాని చాందినీ కనులపంట
వారికి పకోడిపెట్ట పన్నీరు 'జల్ల
చేప'గా గామధేనువై చెలగె ద్విజుడు

శ్రీ కోసూరి గాంధీ - తణుకు

"వేదం, నాదం,ఖేదం, మోదం (నేటి రాజకీయ పరిస్థితులు)"

వాదందంబగునంచునొక్కడట జేవంజాపి దూషించు నా
మోదంబొందుదురెల్ల సభ్యులు విధీ! మూఢాత్ములై పెద్దలే
ఖేదంబొందెను భారతాంబ మదిలో గ్రీడించు సద్ధర్మతా
వేదంబెల్ల నశించిపోయెననుచున్ వేమారు శోకార్తయై

శ్రీ కుంచే - తణుకు

"శరణము, వరణము, భరణము, మరణము (రామభక్తి)"

శరణమటంచు రామునవిశమ్మును వేడుటకాదె జిహ్వకా
భరణము సార్వకాలిక శుభంకరణమ్మనఘాలికప్పుడే
మరణము పూర్వపాపములు మాయమగున్ గదటయ్య తత్కృపా
వరణము కల్గ దాశరథి పాదముపైనొక పూవునయ్యెదన్

శ్రీ మాడభూషి కృష్ణస్వామి - పాలకొల్లు

"తరంగ, అంతరంగ, చదరంగ, కథారంగ (రాజకీయం)"

రంగము సిద్ధమయ్యె జనరాజుల పోరునకున్ బురాకథా
రంగ'ములంతరంగ'ముల రాజిలకుండుటచేసి భారత
ప్రాంగణమందు నేడు 'చదరంగ'ము రాజ్యము నేతలెల్ల వీ
రంగములాడ మూర్ఖత 'తరంగ'ముగా వినువీధినంటెడిన్

శ్రీమతి రమణకుమారి

"కీర,వీర,హీర, ఘోర... శివధనుర్భంగం"
వీర వ్రాతము చిన్న పోయినది పృధ్వీ భాగమందెల్లనా
హీర ప్రౌఢిమ శైవచాపమున దానేమాయెనో రాముడా
ఘోరంబైన శరాసనంబునకు వీకుం డించెనాజానకీ
కీరంబిప్పుడు రామరామయను సంగీతంబునే పాడగన్

శ్రీమతి అక్కిపెద్ది భానుమతి - కొవ్వ్యూలగూడెం

"అమ్మ, తల్లి, జనని, మాత - మీ శ్రీమతిని వర్ణిస్తూ"
'అమ'్మధురత్వమెల్లనెదయందువ నిల్పిన జాణయామె ని
త్యమ్ముగ 'మాత'లంపులకునవ్వల యివ్వల గాకయుండు శాం
తమ్ముగ సీతకే 'జనని' దార్శని కత్వము చూప మైత్రితో
నిమ్ముల గూర్చ సేవలనునేనొరింతు గళా మ'తల్లి'కిన్

శ్రీ కె. కె. వెంకటేశ్వర్లు (సంస్కృతం)

"రాగం, రోగం, యోగం, భోగం"
(పాలకొల్లులోని అష్టభుజ లక్ష్మిని శిఖరిణీ వృత్తంలో)
సదాయోగం లక్ష్మీపతి భుజసమాశ్లేష విషయే
మనోరాగం హత్వా హృదయ కుహరే తిష్ఠతి తథా
కళాభోగం దత్వా సుకవి జనతాం రక్షతి భువి
స నీరోగం కృత్వా మధుమయ జగత్ శిక్షతిహరి:

శ్రీ మంకు శ్రీను, కొవ్వూరు

మరులు, సిరులు, విరులు, కురులు (వేసవితాపం)
మరులుగొనన్ వసంతము సమంచిత కాలము గ్రీష్మమందునా
సిరులును గల్గునే సెగల చేవకు దానును దాళలేక అ
వ్విరులను వీడి సంద్రమున వేగమె దూకడె యర్యముండునా
కురులను విప్పు జీకటియె కూర్మిని బేర్మిని బెంచునీతటిన్

శ్రీ ఎస్. వి.వి. ఆర్ శాస్త్రి - నరసాపురం

అమ్మ, బొమ్మ, రెమ్మ, కొమ్మ (రామాయణార్థంలో)
అమ్మహితుండు దాశరథి యాతని యింతిని జెట్టబట్టి యా
కొమ్మ పతివ్రతా గరిమకున్ దహియించుక పోదువయ్యా పూ
రెమ్మ శిఖిన్ దరిన్గొని భరించునె యంచును జెప్పుచుండగా
బొమ్మని పల్కె రావణుడు మూర్ఖులకున్ హితముల్ రుచించునే!

శ్రీ ఎ.ఎస్.ఎన్. మూర్తి

హరిప్రియ, గిరిప్రియ, జనప్రియ, రణప్రియ (అహల్యాశాప విమోచనం)
లేమనుగాంచనేగుచు హరిప్రియ రాముడు మార్గమధ్యమం
దేమియొ చిత్రముల్ జరిపినేగద! సర్వజన ప్రియమ్ముగా
స్వామిగిరిప్రియుండగుట బండను దాకిన నాతియయ్యె శ్రీ
రాముని పాదధూళియ తిరంబుగ బ్రోచెనకారణప్రియన్

శ్రీ పి.వెంకటాచార్యులు ( శృంగారస్ఫూర్తి, మోవి)

"రమణీయం, కమనీయం, మననీయం, స్మరణీయం"

'రమణీ!యంబుజపాణి రాగదవె హేలన్ గ్రీడ గావింపగా
'కమనీయం'బగు మోవినీగదవె చొక్కన్ మాటికిన్ నెచ్చెలీ!
అమితానందము పొందువేళ 'స్మరణీయ'ంబైనదావస్తువే
అమృతాస్వాదన జేయువేళ 'మననీయ'ంబైనదారూపమే

శ్రీ తమ్మిశెట్టి గుణరామ్ - పాలకొల్లు

భ్రష్టము, క్లిష్టము, స్పష్టము కష్టము (నేటి సాహిత్యం దాని పరిస్థితి)

భ్రష్టముకాగ సత్కవన పద్ధతి వాదములుప్పతిల్లి, సం
క్లిష్టములైన శబ్దములఖేలనమే గుణమైన వేళ వి
స్పష్టమునయ్యె భావగుణ బంధురతన్ గవితల్ వచించుటల్
కష్టములంచునేటికిక కమ్మని కైతలు పుట్టునందువా!

శ్రీమతి సత్యవతీదేవి

వనిత, జనత, మమత, నవత (సంక్రాంతి వర్ణన)

వనితాలోకమునందు గొబ్బిళులతో పర్వమ్మఖర్వమ్ము భా
జనతా పర్వము కొత్తయల్లునకు నైశ్వర్యమ్ము రైతన్నకున్
మనమందున్ మమతల్ రహింప రస సామ్రాజ్యమ్ము సాధింప భూ
మిని సంక్రాంతియ యిచ్చుచుండు నవతన్ మేల్కొల్పునెల్లప్పుడున్

శ్రీమతి కె. సత్యశ్రీ - ధవళేశ్వరం

సుధ, వసుధ, జయసుధ, చిత్రసుధ
(సినిమాపాటల్లో అనౌచిత్యం)

'సుధ'వంటి కవిత చిత్ర 'వ
సుధ'నెట్టులు కల్గునమ్మ సొమ్ములు వలదా
యది అప'జయసుధ' యగుచో
కుదురునొకో 'చిత్ర సుధకు' గూరిమి పాటల్

శ్రీ సోమంచి సత్యనారాయణ - పాలకొల్లు (సంస్కృతం)

స్వేచ్ఛావృత్తంలో రామలింగేశ్వర ప్రశంస (సంస్కృతం)
క్షీర, నీర, వార, వీర

క్షీరారామపురే సదా శివకరో నీరాభిషేక ప్రియః
స్థాణుశ్చాపి సమాశ్రితావన దయా వారాశిరేవ ప్రభుః
వీరశ్చత్రిపుర ప్రహార విషయే విద్యాప్రదః సర్వదా
భద్రో హైమవతీ శరీర సహితో దేయాత్ సదామంగళం

కె. రుక్మిణి -రావులపాలెం

రంగ, మంగ, భంగ, తుంగ

(రామబ్రహ్మంగారి క్రొత్త గోదావరిపై పద్యం)

రంగమ్మందున గజ్జెకట్టినది యుల్లాసమ్ము సంధించి యు
త్తుంగాభంగ సభంగ బంధుర రసస్తోమాంగియై యొప్పెనో
మంగన్ లోకమునెల్ల బుట్టినది రామబ్రహ్మ సృష్టమ్ముగా
శృంగారమ్ము పవిత్రతా గరిమయున్ జెన్నొంది మిన్నందగన్

శ్రీ పంపన సూర్యనారాయణ - పెద్దాపురం

అప్పు-చేసి-పప్పు-కూడు (సంస్కృతాంధ్ర ద్విశతావధానాన్ని గూర్చి)

'అప్పు'లకల్ వచించుగద! యాంధ్రమునందున సంస్కృతంబునన్
జెప్పిల సత్కవిత్వమిట 'జేసి'న యీ ద్విశతావధానమే
గొప్పది సాహితీ సుధకు గ్రొవ్వల'పప్పు'డె పుట్టుచుండె సొ
రొప్పగ సాగుచున్నయది యుర్వికి గైతకు మైత్రి 'కూడు'టన్

శ్రీమతి కోట ద్యుమణి - మంచిలి

పోతన-పోతన, పెద్దన-పెద్దన ఆధునిక కవిత్వంపై

పూత గుణమ్ము పోయినది'పో! తన' భావమునందు నేటి కా
'పోతన' బోవుచుంద్రు కవిముఖ్యుల యగ్రపదాన జేర్చి మా
వ్రాతలు 'పెద్దనా'దులకు వ్రాయగశక్యమె యంద్రుగాని యీ
భూతల మందు 'పెద్ద న'గమున్ గని గుట్టయటంచు పిల్తురే!

శ్రీ కె. భాస్కరరావు

ఉపమ, పకోడి, రసన, వడ (వేసవితాపం)

ఉష్ణగరిమ చెప్ప 'ఉపమా'నముండునా
ఆ'పకోడి' ఫ్యానులట్టులుండె
'వడ'కు దాళలేక పుడమియె మూర్ఛిల్లె
'రసన'లారుచుండె బ్రజలకెల్ల

# వర్ణనలు

శ్రీ ఎస్. బాలచందర్

"గుడ్డివారైన ప్రేక్షకులు - చెవిటివారైన పృచ్ఛకులు చేతులులేని పత్రికా విలేఖరులు - అవధాని మూగ"

కన్నుల్లేనిది శ్రోతృజాతి యిక నిష్కర్ణాళి యాపృచ్ఛకుల్
కన్నుల్ ద్రిప్పుచు యావధానియును వ్యాఖ్యానించు జేసైగలన్
అన్నా చేతులు లేనివారలటగా యాపాత్రికేయాళి ఇం
కెన్నంగానదియెట్టులుండుననుచోనెయ్యెయ్యె యెయ్యెయ్యె యే

శ్రీ ఊరంకి సూర్యనారాయణ

"సంక్రాంతి శోభను వర్ణిస్తూ"

హరివిల్లులు రసవల్లులు
మురిపెమ్ములు కూర్చునట్టి ముచ్చట చుక్కల్
తరుణులు గీచిన ముగ్గులు
విరిదండలు కాగ భువికి వెలుగొందు గదా!

అరిపాల సూర్యనారాయణగారు

(పంచ సహస్రావధానం జరిపిస్తే)

పంచ సహస్ర పద్యములపార రసాంచితముల్ వచించి, సా
ధించెద గీర్తి చంద్రికలు తెన్గున సంస్కృత భాషయందు గీ
ర్తించెద భారతీ సతిని దీయని పల్కుల పూలదండలన్
బ్రాంచితమైన యావిరులనందగ జేసినదామెయే గదా!

శ్రీ తంగిరాల సూర్యనారాయణ - తణుకు

(చెరువువారి శతావధానానికి మీకు కల్గిన అనుభూతి)

చెరువా కాదది ముందుగా వరదయై చిత్రమ్ముగానుప్పెనై
పరువుల్ వెట్టుచు ముంచివైచినది యాప్రాంతమ్ము సర్వమ్ము బం
ధురతాయుక్తము సార్వలౌకికము సంతుష్టాంతరంగమ్మునై
పురి కోపూరి చరిత్ర పెంచినదిలే పూర్ణావధానమ్ముగన్

వి. రాధాకుమారి - హైదరాబాద్

పార్వతీ పరమేశ్వరుల కల్యాణాన్ని వర్ణిస్తూ

నెలవంక పుష్పమైనది
చిలువలు విరిదండలయ్యె శివునకునగజా
విలసనములు సహజమ్ములె
అలవియె! యవ్వారిపెండ్లినభివర్ణింపన్

కె. కాత్యాయని -హైదరాబాద్

గీష్మంలో వికసించే తెల్లని మల్లెను వర్ణిస్తూ
ఈ సెగలేమిటి యీ పొగలేమిటి యెట్లు భరించుట వేసవిలో
ఈ సిరిమల్లికి దావులు కల్గుట యింతయొ అంతయొ యూరటయౌ
భాసిలుచుండెను మల్లియ కాంతులు వైభవమొప్ప నికుంజములన్
వాసిని గాంచెను వేసవి గూడుచు వర్ణము చెప్పను దద్యశమున్

శ్రీమతి మహాలక్ష్మి

మణి ద్వీపవాసిని మనోహర రూప సౌందర్యం
మణిపూరామృత చక్రవాసినివి యమ్మా! బిందురూపాత్మికా!
ప్రణవస్వామిని! మృత్యు పర్వత మహావజ్ర స్వరూపా! శివా!
ప్రణుతింపన్ బదమంటు వారలకు సౌభాగ్యమ్ము సాధించు కా
రణమీవై వెలుగొందు శాంకరివి సంప్రార్థింతునెవ్వేళలన్

శ్రీ జి.ఎస్.వి. సుబ్రహ్మణ్యం - పెనుగొండ

(క్రొత్త జంటకు తొలిరేయినుండే రెండు అషాఢాలు వారి స్థితి)
చూపులు గొప్పవియ యెదురు
చూపులు మరియింత తీపి సొగసుల జలధిన్
రేపులు మాపులు ద్రచ్చుచు
సైపంగా జంటగాంచు శ్రావణ సుధలన్

శ్రీ వీరవల్లి త్రిమూర్తులు

(భారతావనిలో శబ్దకాలుష్య నివారణోపాయం) సంస్కృతం
కాలుష్యం శబ్ద సంజాతం
శబ్దశ్శబ్దేన భిద్యతే
కవితారూప శబ్దేన
కాలుష్యం వినివారయేత్

శ్రీ యనమండ శ్రీనివాసశాస్త్రి

నేటి భరతమాత రూపం చిత్రిస్తే.....
భారతమాత సంకెలలు వర్ణగతమ్ములు నేడు విత్తసం
హారము కంఠహారము విహార పథమ్మిక కంటకావృత్తం
బారయ చిత్రసంగతినినామె స్వరూపమె యిట్టులుండ ని
ష్కారణ హీన తత్త్వమది కన్నుల నీరు జనింపకుండునే!

శ్రీ గంధ్రోతుల పెదమావుళ్ళు

(పాలకొల్లు ప్రకృతిని కేరళతో పోలుస్తూ)
పాలకొల్లు ప్రాంతమెల్ల బచ్చనైన నేలయై
చేలు చేలమైన వేళ జిత్రమైన శోభతో
గీలుగొల్పుచుండె దృష్టి కేరలేల భాతిగా
పాలనేల తల్లి వింత పారవశ్యమిచ్చుచో

శ్రీ జె.వి. సత్యనారాయణమ్మ

(ఆనాటి కన్యాశుల్కం నుండి ఈనాటి వరకట్నం వరకు)

నాటి నుండి నేటి వరకు నారి బ్రతుకు మారెనా
గూటి నుండి కాటి వరకు కోమలులకు సౌఖ్యమా
చేటు వచ్చి పడెను గాదె స్త్రీని గౌరవింపగా
చేటి! శుల్కమిట్లు నీకు జేటు దెచ్చిపెట్టునా

శ్రీ చేగొండి శ్రీరామ్ - దొడ్డిపట్ల

"శ్రీ రాముడు బాల్యంలో చేసిన ఘనకార్యాలు"

సీ॥ బాల్యమ్మునందునే బాణమ్ము చేపట్టి
లక్ష్యమ్ము సాధింప రాణకెక్కె
బాల్యమ్మునందునే పరమ రాజన్యుల
మంత్రాంగ విద్యలన్ మతికి జేర్చె
బాల్యమ్మునందునే పరమ మౌనీంద్రుల
నియమ సంగతియందు నేర్పుగాంచె
బాల్యమ్మునందునే పదునారు గుణములే
కళలుగా చంద్రుని కరణినొప్పె

అట్టి శ్రీరాముడా దర్శమగును గాత
అట్టి శ్రీరాముడే దైవమగును గాత
అట్టి శ్రీరాముడే జీవమగును గాత
రామ నామమ్మె శ్రీ రామరక్ష నాకు

శ్రీ కె. యన్. వి. గోపాలరామశర్మ

"వస్త్రార్థం అక్షతాన్ సమర్పయామి అన్నట్లుగా అవధాని గార్కి అన్నిటికీ అక్షతాన్ సమర్పయామి అంటే మీ స్థితి....."

అవధానాంతమునందునక్షతలు వేయం జూచినారేని మీ
వ్యవహారమ్ములు చూచునట్టి ప్రజనాపన్ శక్యమే మీకు: మీ
రెవరేమిచ్చిననీకయున్న బ్రజలే యెంతేని నాకిచ్చి గౌ
రవమున్ గూర్తురు గాదె పద్య కవితా రాజ్యమ్ము శ్రీమంతమే!

శ్రీ వి. జనార్దనరావు - మేడపాడు

"మీ శ్రీమతిగారైన మీనాక్షిగారి మీద పద్యం"

నాకున్ బ్రాశ్నికురాలివైతివట మీనాక్షీ! భళా! నన్ను నా
పీకంజూచి ముదంబునందితివటే వేయైన నీయండతో
ఢీ కొందున్‌గద హేలగా నుడుల పాటిష్టమ్ము చూపించి, నీ
రాకల్ రాకలు నాకు జీవితమునన్ రాకేందు బింబాననా1

శ్రీ పి.బి.పి.ఎల్.యమ్. వేణుగోపాల్

"గోదాదేవిని వర్ణిస్తూ పద్యం"

తాను ధరించినట్టి విరిదండ సమర్పణ చేసినట్టి యా
మానిని రంగ నాయకియ మాధవ సేవకు యోగ్యురాలు వి
జ్ఞానమటన్న యయ్యదియ గౌరవమయ్యది నెయ్యమయ్యదే
యానవనీతమూర్తి హృదయమ్మునకేను నమస్కరించెదన్

శ్రీ అక్కిపెద్ది రామసూర్యనారాయణ - అవధాని - కొయ్యలగూడెం

"చదువుకోని తమ్ముడికి చదువుకొమ్మని అన్న చెప్పుట"

చదువుగ వలయును గదరా
చదువందగు వయసునందు జదువక యున్నన్
ముదిమిన జదివిన రాదే
చదువువలన మానవునకు సంస్కృతి పండున్

శ్రీమతి సీతాదేవి

"సరస్వతీ దేవిని కవన చిత్రవర్ణంతో (సంస్కృతం)"

శుక్ల దేహాంచితాం వాణీం
పీత వస్త్ర సమన్వితాం
కీరహస్తాం రసానందాం
విద్యాదేవీం నమామ్యహం

డా॥ ఎ.వి. రమణ ప్రసాద్ - అవధాని - కొవ్వూరు

(మైసూర్ గణపతి సచ్చిదానందమూర్తి వారిపై)

గణపతి నిత్యానందుడు
ప్రణవము తానైనయట్టి బ్రహ్మంబతడే
ఫణులన్ దాల్చని శివుడే
ప్రణుతులు నాదాత్మకునకు బదివేల నతుల్॥

శ్రీ రామడుగు వేంకటేశ్వరశర్మ, గుంటూరు

మీ కిష్టమైన ఋతువర్ణన - భాగవత కల్పన

మల్లెలు కొల్లలై విరిసె మాధవుడా పొదలందు జేరె ఉ
త్ఫుల్ల సరోజనేత్రలగు దొయ్యలులే వెదుకాడుచుండ నా
యల్లరి గొల్ల పిల్లడు తనంతట దోబుచులాడుచుండ దా
నుల్లసిలెన్ వసంతము రసోచిత రీతిని బుల్కరించుచున్

"పల్లెల్లో ఉండే జనపదులలో కష్టనష్టాలు"

పల్లెలందునుండు వారి కష్టంబులు
భ్రాంతికాని వాస్తవంబు గాదు
చల్లనైన గాలి చక్కని నీరంబు
స్వచ్ఛమైన మనసు పల్లె సొత్తు!

శ్రీ వి.కె. సత్యనారాయణ - పాలకొల్లు

"ద్విశతావధాన కార్యక్రమంలోని కార్య నిర్వాహకుల మనోభావం"

ఏమి చెప్పునొ యీవధానియునెవ్విధమ్మున జెప్పునో
ఏమియిత్తురొ యీవధానికినెవ్విధమ్మునయిత్తురో
స్వామి క్షీర పురీశుడిచ్చట వచ్చి పాడిన కైతగా
మామనంబులు పుల్కరించెను మంగళంబులు కల్గుతన్

శ్రీమతి వి. లక్ష్మీ ప్రసన్న - మేడపాడు

జయసుధ, జయచిత్ర, జయప్రదలు లక్ష్మీసరస్వతి పార్వతులు లాగ
నటిస్తే చిత్ర పరిశ్రమ స్థితి

జయచిత్ర సుధాప్రదలే
నయమున ముగురమ్మలట్లు నటియించినచో
వ్యయమో ఆదాయంబో
జయము జయము జయము కాదె జయమంగళమే!

# సమస్యలు

శ్రీ దూడల రంగారావు, తణుకు

"భామకు మీసముల్ మొలిచె బాపురె! పూరుషుడూనె గర్భమున్"

ఆమహనీయశక్తి నుడులందునవెవ్విధి దాచినాడొ! వి
ద్యామహితుండు మా చెరువు, తల్లి సరస్వతి రూపమయ్యెనా
లేమకు పుంస్త్వమబ్బినదిలే ప్రసవించెను బద్యరత్నముల్
భామకు మీసముల్ మొలిచె బాపురె! పూరుషుడూనె గర్భమున్

శ్రీ మంకు శ్రీను, కొవ్వూరు

"శవమే శ్రేష్ఠము మానవాళికిలలో సంతోషమేపారగన్"

రవళింపన్ సుఖసంపదల్ హృదయ సామ్రాజ్యంబు వర్ధిల్లు యో
గివరేణ్య ప్రతిపాదితామర మహా గీరూపమై ధర్మగౌ
రవ సంపాదక మార్గమై వరలు హేలన్ రామరూపాత్త కే
శవమే శ్రేష్ఠము మానవాళికిలలో సంతోషమే పారగన్

డా॥ సూరి శ్రీలక్ష్మి

"తనయుని బెండ్లియాడెనొక తన్వి జగమ్ములు చూచి మెచ్చగన్"

అనిశము వెన్నముద్దలకునాకొను టక్కరి కాడు పల్కులో
మనములు దొంగిలింపబడు మాధురికిన్ నెలవౌచు సాగు బో
ధనమున గీత పుట్ట ముని దార్శనికత్వము చూపు దేవకీ
తనయుని బెండ్లియాడెనొక తన్వి జగంబులు చూచిమెచ్చగన్

కంభంపాటి కనకరత్నం, ఆకివీడు

"దుష్యంతుండు వరించె మేనకను సంతోషాబ్ధిలో దేల్చగన్"

శైష్యమ్మట్టిదొ! గౌరవమ్మటుల బ్రాశస్త్యంబునార్జించెనో!
భాష్యమ్మయ్యది యందచందములకున్ బావిత్ర్య సంపాదనా
దూష్యంబైనది కణ్వునాశ్రమమునందున్ గౌశికాపత్యమున్
దుష్యంతుండు వరించె మేనకను సంతోషాబ్ధిలో దేల్చగన్

డా॥ ధూళిపాళ ప్రభాకర కృష్ణమూర్తి, నిడదవోలు

"మోహము మోక్షకారణము మోదము కూర్చును మానవాళికిన్"

దాహము మానసంబునకు దప్పనిదాత్మకు శైత్యవృత్తి యీ
దేహము నశ్వరంబు పరదేవతమాత్రమె శాశ్వతంబు సం
దేహములేదు నిచ్చలును దేవునియందున భక్తిశ్రద్ధ వ్యా
మోహము మోక్షకారణము మోదము కూర్చును మానవాళికిన్

శ్రీ ఎస్.వి.ఎస్. నారాయణశర్మ, నరసాపురం (సంస్కృతం)

"భక్తో భక్త్యా వినశ్యతి"
కామినీ జనతా భక్తిః
వర్తతే యస్య మానసే
స మోహే పతితో భూత్వా
భక్తో భక్త్యా వినశ్యతి

శ్రీ యేలూరిపాటి వేంకటేశ్వరరావు, భీమవరం

"ప్రాజ్ఞగమందు భానుడు పరాస్తకరుండయి తేజమేదెడిన్"
దృజ్ఞయవీథి మోహనుని తీక్ష్ణతకోడిరి తెల్లవార్లు త
ద్వాజ్ఞహరిత్వమే సుదృఢవర్మమహింసయె యాయుధమ్మునీ
దృజ్ఞియమాంచితుండగుట తేజమునోపకవోసరిల్లి ఆ
ప్రాజ్ఞగమందు భానుడు పరాస్తకరుండయి తేజమేదెడిన్

శ్రీ తాడేపల్లి పతంజలి, ఆర్మోర్

"గుండులనొక్కచో కలిపి కోమలి పీటముడిన్ బిగించెరా!"
అండజయానయున్ మఱియునండజయానయుగూడిరేని గా
కుండునదేమి పెండిలినినొక్కటి యొక్కటి యొక్కటొక్కటిన్
దండగ నల్లపూసలను దాల్మిని బేర్మిని గూర్చిపెట్టనా
గుండులనొక్కచో కలిపి కోమలిపీట ముడిన్ బిగించెరా!

శ్రీ దశిక కృష్ణమోహన్, నరసాపురం

"హనుమత్పుత్రిని బెండ్లియాడ గదవే హర్షంబునన్ రాఘవా!"
జనకుండప్పుడియమ్మటంచు బలికెన్ సంతోషమేపార భూ
మిని జన్మించియు నాదు పెంపకమునన్ మిన్నంటు తేజమ్మునం
దినదాపైనినయోనిజత్వమును వృద్ధిం గూర్చునే కాన ఈ
హను మత్పుత్రిని బెండ్లియాడగదవే హర్షంబునన్ రాఘవా!

శ్రీ కె.కె. ప్రభాకరరావు, పాలకొల్లు

"రాతిని బెండ్లియాడె సతి రాజిత రూప విలాస హాసయై"
నాతికి వెన్నదొంగ యనివన్ మనసైనదటంచు రుక్మి సం
జాత నితాంత రోషుడయి చైద్యునకిచ్చుటకై తలంచె ద
ద్భ్రాతృత కోలుపోయెనిక భామిని తానుగ జేది భూమిపా
రాతిని బెండ్లియాడె సతి రాజిత రూప విలాస హాసయై!

శ్రీ భట్టిప్రోలు సత్యనారాయణ, నరసాపురం

"పిల్లలగని పొంగె దాను బెండిలి కాకే"
అల్లది విచిత్రమగునా!
తల్లియగా బోషణమున ధాత్రిన్ బ్రోచెన్
మల్లియ మదరు థెరిస్సా
పిల్లలగని పొంగె దాను బెండిలి కాకే!

"వెన్నెలలిచ్చుచుండె మఱి వేడిమినెంతయు వాడ వాడలన్"
అన్నులినాననానన సుధాదృత చిత్తుడు గొల్లపల్లెలో
వెన్నలుమ్రింగి కన్నియల ప్రేముడులందుచునొక్కనాడు తా
నున్నటులుండి చక్రధరుడూరక హస్తిపురమ్ము పోవుటన్
వెన్నెలలిచ్చుచుండె మఱి వేడిమినెంతయు వాడవాడలన్

శ్రీ యమ్. రామకృష్ణారావు, తోలేరు

"రంభను బెండ్లియాడె రఘురాముడు దేవగణంబు మెచ్చగన్"
శుంభదశేష సద్గుణ విశోభిత చిత్తుడు సార్వకాలికో
త్తంభిత ధర్మశీలుడు బుధ ప్రకరంబులకొజ్జబంతి యు
జ్జృంభిత శక్తుడై విఱిచి చిత్రముగా హరువిల్లు యౌవనా
రంభను బెండ్లియాడె రఘురాముడు దేవగణంబు మెచ్చగన్॥

శ్రీ భాగవతుల లక్ష్మీనరసింహం, నరసాపురం

"అన్నను జంపు దమ్ములకునభ్యుదయంబును గల్గకుండునే?
అన్నను చంపి సూర్యసుతుడభ్యుదయంబును బొందినాడు తా
నన్నను చంపువానికి సహాయముచేసి విభీషణుండున
భ్యున్నతినొందినాడటులనొప్పకయున్నె యధర్మగామియౌ
అన్నను జంపు తమ్ములకునభ్యుదయంబును గల్గకుండునే!

శ్రీ గొర్తి వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి, ఆగడాలలంక

"సీతాసుతౌ రావణ కుంభకర్ణౌ"
కుశీలవౌ తౌచ యమౌ విశిష్టౌ
సీతా సుతౌ, రావణ కుంభకర్ణౌ
తౌ కైకసీజౌచ విశేష దుష్టౌ
క్షేత్రం విశిష్టంఖలు బీజధర్మాత్

శ్రీ సిహెచ్. రత్నాజీ, నరసాపురం

"కప్పలు గుంటనక్కలును గాకులు డేగలు గూడెనొక్కచో"
ఇప్పటికిట్టి గద్దియకునించుక యించుక నోచుకొంటి ఏ
చెప్పుడు మాటలో కుటిల చిత్తములో ధనరాశులో నమన్
దిప్పలుపెట్టుచుండుటకు దీక్షవహించుట పార్లమెంటులో
గప్పలు గుంటనక్కలును కాకులు డేగలు గూడెనొక్కచో

శ్రీ తంగిరాల సోమయాజులు, తణుకు

"కోదండంబులు దండమన్నవట సంకోచింపకక్కాంతకున్"
ఆదైవంబిట రామచంద్రుడయి తానావిర్భవించెన్ జుమీ
ఈ దుర్మార్గుని రావణాసురుని మీరేరీతి సేవించినన్
ఖేదంబొందెదరంచు ముత్తిరియ పల్కెన్ రాక్షసీ కోటి గై
కో, దండంబులు దండమన్నవట సంకోచింపకక్కాంతకున్
(మూడు+తిరి=ముత్తిరి=త్రిజట)

శ్రీ గొర్తి సత్యనారాయణమూర్తి, నరసాపురం

డా॥కుంచే, తణుకు

"కరణము లేకయే మనకు గావ్యములందునె యెంచి చూడగన్"

సురుచిర వాగ్విశేష రస శోభకు దావలమై వెలార్చు వ్యా
కరణ గుణ ప్రపంచమున గావ్య సుమమ్ము పరీమళించు సు
స్థిరముగనిన్ని కల్గియును దీరున దోచెడు నవ్యభావ సే
కరణము లేకయే మనకు గావ్యములందునె యెంచి చూడగన్

శ్రీ పి.బి. ఆదికేశవస్వామి, పెనుగొండ

"దంతిని బెండ్లియాడెనట దాంతుడు సంతతి పొందెజోద్యమౌ"

కాంతను, జక్రవాకముల కయ్యములాడు గుచద్వయంబుతో
శాంతి సుఖానురాగ రస సంగత నేత్ర సరోజ కాంతితో
సంతమసంబులొకురుల జాడల నొప్పెడు గుంద కుట్మలీ
దంతిని బెండ్లియాడెనట దాంతుడు సంతతి బొందె జోద్యమౌ!

శ్రీ గోటేటి విశ్వేశ్వరరావు, నరసాపురం

"రాముని గూల్చె రావణుడు రక్కసులక్కజమంది చూడగన్

సోమముతోడ దాకుటకు శూరులు పెక్కురు కల్గియుండనే
కామములేక కారడవి కన్నులు మూసి, తపంబు సేయుటే
నీమముగా జరించు గణనీయుని బూజ్యుని జూచుచుండనౌ
రా॥ముని గూల్చె రావణుడు రక్కసులక్కజమంది చూడగన్

శ్రీ కాశీభట్ల సుబ్రహ్మణ్యశర్మ, నరసాపురం

"బంగరు లింగకాయ గల భామిని వైష్ణవ కాంతయే గదా!"

బంగరుమేని చాయ రస వాహినికిన్ నెలవైన కన్నుదో
యింగని శైవుడొక్కడు వరించెను, వానిని బెండ్లియాడి ఆ
సింగపు గౌను చిన్నది రచించెను భర్తృ విభూతులెన్నియో
బంగరు లింగ కాయగల భామిని వైష్ణవ కాంతయేగదా!

శ్రీ చిలకమర్తి సుబ్రహ్మణ్యశాస్త్రి, నరసాపురం

"కారుని సూనుడేగియొక ఘాతుకమాపెను మేలుకోరియున్"

కారణమేమియంచు తమకమ్మున ప్రశ్నలు వేయనేల దు
ర్వారము సర్పయాగము ప్రపంచ వినాశకరమ్ముగాన సం
హారమునాపనాస్తిక మహాముని హస్తములడ్డుచున్ జర
త్కారుని సూనుడేగి యొక ఘాతుకమాపెను మేలుకోరియున్

శ్రీ రాంపల్లి శ్రీరామచంద్రమూర్తి - పోడూరు (సంస్కృతం)

"దవాగ్ని మధ్యే సుఖమేధతే జనః"

అహస్కరోస్త్రాద్రి గతో భయంకరః
హిమాలయశ్శీత గుణప్రవర్థక :

శ్రీ జొన్నవిత్తుల రామకృష్ణ, భీమవరం

"కాటికి వచ్చునెన్నొ సమకాలిక వృత్త సుధా ప్రసంగముల్"
నీటుగ చేయవచ్చునవనీతలమందు గథా ప్రసంగముల్
చేటులు చేయబోక తనచేసగునంతకు మేలు చేయని
స్పాటున బోవుడంచు దన పల్కుగథాళి వచించునట్టి 'వా
కాటికి' వచ్చునెన్నొ సమకాలిక వృత్త సుధాప్రసంగముల్
(వాకాటి పాండురంగారావు - ప్రసిద్ధకథారచయిత)

డా॥ కేశాప్రగడ సత్యనారాయణ, కిర్లంపూడి

"భార్యాత్యాగము నీకు ధర్మమగునా వాక్రుచ్చుమో!రాఘవా!"
ఆర్యా మాధవ! మాధవిన్ గొని విదేహాపత్యరూపాత్త యై
శ్వర్యమ్మీవని యెంచునట్టి సతినిన్ సందేహమన్ వాదు స్వీ
కార్యమ్మై విడనాడితీవు తగునా! కారుణ్య వారాంనిధీ!
భార్యాత్యాగము నీకు ధర్మమగునా వాక్రుచ్చుమో! రాఘవా!

శ్రీ జోస్యుల కృష్ణబాబు

" గజయూధము చీమ జూచి గజగజ వణకెన్"
గజసన్నిభ పాండవులన్
విజయుని విడనాడి వ్యూహ విచ్ఛేదములో
విజముగ సైంధవుడడ్డెను
గజయూధము చీమ జూచి గజగజ వణకెన్

శ్రీమతి వి. లక్ష్మీప్రసన్న, మేడపాడు

"మండనంబేల సౌందర్య మండితులకు"
తీసి, తనమేన భూషణ రాశియెల్ల
జలకమాడంగ యమునకు శౌరి యేగ
వ్రేతలీరీతి మనసులు విప్పుకొనిరి
మండనంబేల సౌందర్య మండితులకు

శ్రీ పోచినపెద్ది రంగనాథం, ఆచంట

"సానింగోరెను యోగిపుంగవుడు విశ్వాసమ్ము పెంపొందగన్"
జ్ఞానంబంచునొ! కర్మనిష్ఠ యనియో! సత్యవ్రతంబంచునో!
మౌనంబంచు దపంబటంచు, జతురామ్నాయంబులంచున్ భువిన్
ధ్యానంబించుక లేక తాను హృదయంబర్పించి శ్రీశైల వా
సా!నిన్ గోరెను యోగిపుంగవుడు విశ్వాసమ్ము పెంపొందగన్

శ్రీ ఎ. ఆదిరెడ్డి, హైదరాబాదు

"యోగము కల్గినన్ బలుప్రయోజనముల్ భువి లభ్యమయ్యెడిన్"
భాగము జీవితమ్మునకు బద్యమొ గద్యమొ, గీతరూపమో
సాగిన చాలు గైత యనిశమ్ము సుఖమ్ము మనమ్మునంటు భా
షాగమవేత్తలెల్లరు విహారము జేసెడు సత్కవిత్వ సం
యోగము కల్గినన్ బలుప్రయోజనముల్ భువిలభ్యమయ్యెడిన్

డా॥ చిఱ్ఱావూరి శ్రీరామశర్మ, శతావధాని, రాజమండ్రి (సంస్కృతం)

అస్మత్ పాద రజస్తు కృష్ణ శిరసి స్యాత్ నారకంచాస్తు నః
శ్రీ కృష్ణస్య మహాత్మనోపిచ భృశం జాతా శిరో వేదనా
ఉక్తంచౌషధమంగనా పదరజః దారాస్తు భీతావహాః
తచ్ఛ్రుత్వాఖిల గోపికాజనమహో!ప్రీత్యోక్తవత్యో మునే!
అస్మత్ పాద రజస్తు కృష్ణశిరసి స్యాత్ నారకంచాస్తునః

శ్రీమతి సత్యవతీదేవి

"ఖరపాదంబులు పట్టి ముక్తి మదినాకాంక్షింపరే సజ్జనుల్"
పరమైశ్వర్య నిదానమై వెలిగి దేవవ్రాత సంపూజన
స్థిరుడై విశ్వపదార్థ సప్తక కళా దేదీప్యమానాంగుడై
హరుడై ద్రవ్య నవత్వ కారకుడునై ఆద్యుండునౌ చంద్రశే
ఖర పాదంబులు పట్టి ముక్తి మదినాకాంక్షింపరే సజ్జనుల్

శ్రీ కోటమర్తి లక్ష్మీనరసింహం, కొవ్వూరు

"మేడన సాని జూడ గడిమిళ్ళకు గల్గెను భావసంపదల్
జాడలుదప్పి యా నిగమ శర్మ సుశర్మముగోలుపోయెన
మ్మేడన సాని జూడ, గడిమిళ్ళకు గల్గెను భావ సంపదల్
పోడిమి రామకృష్ణ కవి పూజ్య కవిత్వ మహత్వ శక్తిచే
పీడలువానికై మరియు వెల్గులు నాకట చిత్రమే కదా!

డా॥ ఎ.వి. రమణప్రసాద్, అవధాని, కొవ్వూరు

"చక్రము జుట్టి వచ్చుటకునిచ్చోటన్ ధనంబున్నదే"!
ఘన సౌందర్య నిదానముల్ గలవు లెక్కన్ మించి దేశమ్మునం
దుననవ్వానిని చూచి వచ్చుటకునెంతో విత్తముండన్‌వలెన్
మనకాపేదరికమ్ము హెచ్చునిలలో మాహాత్మ్యమేయున్నదం
చును భూచక్రము చుట్టివచ్చుటకు నిచ్చోటన్ ధనంబున్నదే!

శ్రీ మల్లంపల్లి అమరేశ్వర ప్రసాద్, కాకినాడ

"విద్యావంతుడు కాని వాడె ధరలో విద్వాంసుడై వెల్గెడిన్"
హృద్యామోఘ కవిత్వ తత్వ రస సంప్రాప్తాంతరంగుండునై
వేద్యంబై విలసిల్ల జీవితము గీర్వైర్యమ్ము చూపింప సం
పాద్యంబయ్యెడిదేమొ కీర్తి నిజమమ్మా! నేటి కాలంబునన్
విద్యావంతుడు కానివాడె ధరలో విద్వాంసుడై వెల్గెడిన్

డా॥ శనగవరపు హృషీకేశశర్మ, నరసాపురం

"యోగీ భోగీవ రాజతే"
బ్రహ్మచారీత్వయం ప్రష్టా
సత్కవిత్వ రస ప్రియః
నిత్యానంద కళారంగే
యోగీ భోగీవ రాజతే!

శ్రీ గొర్తి సత్యనారాయణ - నరసాపురం

"చల్లని వెన్నెలల్ గురిసె జంద్రుడు లేకయె యానిశీధిలోన్"
అల్లని వాఙ్మయాకృతి విహాయస వీథి కవిత్వ చంద్రికల్
మల్లెల మాదిరిన్ విరిసి మానసమున్ దనివోవజేసెను
త్ఫుల్లముజేసె జీవితము పోతన భాగవతమ్ము పద్యముల్
చల్లని వెన్నెలల్ గురిసె జంద్రుడు లేకయె యానిశీథిలోన్

శ్రీ రాణీ విశ్వనాథం

లలనా! రమ్మనిలాగె సత్య పయి చేలంబూని శ్రీకృష్ణునిన్
విలసన్మాన్మతథతత్త్వ పండితుడవై వెల్గొందెదే గాని నీ
విలు జేరంగను దెల్ల వారినది గాదే నిన్ను ధ్యానించు నె
చ్చెలినీరీతిని నిల్పి పోవుటలహా చింతా వియోగాగ్ని కీ
లలనా! రమ్మనిలాగె సత్య పయి చేలంబూని శ్రీకృష్ణునిన్

శ్రీమతి కె. సత్యశ్రీ, ధవళేశ్వరం

"రసధుని ద్విశతావధాన రాజును ముంచెన్"
రసవత్కవితా హేలన్
పస కలిగిన పలుకులన్ని వరలుచునుంటన్
వెసనాశీర్వర్షమ్మున
రసధుని ద్విశతావధాన రాజును ముంచెన్

శ్రీమతి కె. రుక్మిణి, రావులపాలెం

మోహన ఫణి గరికిపాటి ముదితలు గారే
సాహసమేయగు గావుత
యూహింపగ గైతలిచ్చునువిదయ వారై
దేహాకృతి పూరుషులై
మోహన ఫణి గరికపాటి ముదితలు గారే!

శ్రీ పోచినపెద్ది సుబ్రహ్మణ్యం, కాకినాడ

"సినిమాకుం గల శ్రద్ధ మూలము యశశ్శ్రీలుం లభింపన్ గవీ"
ప్రణుతామోఘ సమస్త వాఙ్మయ కళా వ్యాలోల చేతస్కుడై
అనిశంబున్ బఠియింపగావలయునయ్యా! పెక్కు శాస్త్రంబులన్
ఘనకీర్తుల్ లభియింపగావలయు లోకమ్మందు బొత్తాల రా
సిని మాకుంగల శ్రద్ధ మూలము యశశ్శ్రీలుంభింపన్ గవీ!

శ్రీ కోట లక్ష్మీనరసింహం, శతావధాని, జుత్తిగ (సంస్కృతం)

"రావే రావే లలిత కవితా రంభ సౌందర్య దీప్తిః"
పద్యే పద్యే హృదయకుహర స్పందనానూన రక్తిః
పాదే పాదే సకల సుజనానంద సంధాన శక్తిః
క్రీడారామే రసధుని కళా వేదికాయాం కవిత్వే
రావే రావే లలిత కవితారంభ సౌందర్యదీప్తిః

శ్రీమతి కడిమిళ్ల మీనాక్షి, నరసాపురం

"రాముని మేనకవరించి ప్రసవించె సుతన్"

ఏమీ కౌశికుని తపం
బేమీయని భంగపడక యింద్రుడు పంపెన్
భామను దా చేరినదొ
రా!ముని మేనక వరించి ప్రసవించె సుతన్

శ్రీమతి వి.శేషరత్నం - లంకలకోడేరు

"దర సౌమిత్రియుతుండునై జనక జాతన్ గూడియేగెన్ వనిన్"

పరమైక్ష్వాకుడు రాఘవుండు సుఖ సంపల్లోక రాగమ్ము న
శ్వరమంచున్ విడనాడి తజ్జనకునిన్ సత్యాత్మునిం జేయ భూ
ధర నీరంధ్ర తరు ప్రకాండముల పొంతన్ గాలిబాటన్ సహో
దర సౌమిత్రియుతుండునై జనకజాతన్ గూడి యేగెన్ వనిన్

శ్రీ పార్థసారథి తోలేటి - నరసాపురం

కలతలు మానవాళికి సుఖంబులనిచ్చుట నిక్కమే కదా!

అలుకలు మానవాళికి మహాపదనిచ్చుట నిక్కమే కదా
అల రఘురామ సోదరునికాలమునందున మూర్ఛ గల్గ అ
వ్వలగలయౌషధీలతలు వాయుసుతుండిడి బ్రోచె అట్ల కా
క,లతలు మానవాళికి సుఖంబులనిచ్చుట నిక్కమే కదా!

శ్రీ ఎ. సీతారామాంజనేయమూర్తి - నరసాపురం

"పిల్లిని చంక బెట్టుకొని బెండ్లికి నేగుటయుక్తమే గదా!"

అల్ల నభస్వదాత్మజుడు హా తరియించె మహార్ణవంబు తా
మెల్లగ పిల్లియంతగుచు మేదినిపుత్రిక జాడ చూడగా
జల్లగ సాగినాడట ప్రశస్తము కాదొకొయట్టి రూపమౌ
పిల్లిని చంక బెట్టుకొని బెండ్లికి నేగుట యుక్తమే కదా!

శ్రీ పెరుమాళ్ళు రాంపండు - భీమవరం

"రాణిని దాల్చి రాముడనురాగము తోడ వరించె జానకిన్"

జాణ సమస్తవిద్యలను శైశవమందునె రాఘవుండు శ
ర్వాణియ యబ్బురంపడగ వంచెను చాపము చిట్లి పోయె గీ
ర్వాణులు పూలు జల్లిరట రామలు చేరి యలంకరించు పా
రాణిని దాల్చి రాముడనురాగము తోడవరించె జానకిన్

సిహెచ్. రమణకుమారి - రాజమండ్రి

"గరుడుడు గణపతికి తండ్రి కావలెజుమ్మీ"

స్థిరుడున్ రత్నాకరుడున్
వరలక్ష్మికి రెక్కలున్న వాజికి దివిషత్
కరికినినారీతిని సా
గరుడుడు గణపతికి దండ్రి కావలె జుమ్మీ

శ్రీ మల్లంపల్లి ఏకోరామసిద్ధుడు - నరసాపురం (సంస్కృతం)

"వధూః సిషేవే శ్వశురం ముదాన్వితా"
అహోహిడింబాహి నిదాఘపీడితా
తదా మరుత్పుత్ర రతి ప్రవర్తితా
అనంతరం స్వేదవిముక్తి కామ్యయా
వధూఃసిషేవే శ్వశురం ముదాన్వితా

శ్రీమతి కోట ద్యుమణి - తణుకు

"వలకు వికాసమబ్బినది నైళము జాలరి యింటికేగగన్"
పలికిన పల్కులోరసము వాహినియై పరువెత్త, దంతముల్
కళికలు, బింబమాయె తమకంబునొసంగెడి మోవి, యట్టియా
చెలిని రహింప జేయుటకు జేరెను జీకటి వేళ గన్ను క
ల్వలకు వికాసమబ్బినది నైళము జాలరియింటికేగగన్

శ్రీ బి. థియోడర్ - నరసాపురం

కృతులన్ ద్రుంచెరె సజ్జనుల్ కడునుదాసీనమ్ము చూపింతురే!
అతి లోభాన్వితుడౌ సుయోధనుని భీమాఖ్యుండు తాగూల్చె త
ద్గతి పార్థుండును గర్ణునిన్ దునిమె యెక్కాలంబునందేని దు
స్థితి దుర్మార్గమడంపగా వలయు నిష్ఠేదంబునన్ భూమి దు
ష్కృతులన్ ద్రుంచెరె సజ్జనుల్ కడునుదాసీనమ్ము చూపింతురే

శ్రీ ఆర్.వి.ఎస్. భగవానులు

"మాత జంపిన వాడెపో మార్గదర్శి"
ధర్మమునకిక్కయై వేద ధర్మమెఱిగి
చిన్నతనమందె విలువిద్య చేవగలిగి
యాగ రక్షణ వేళలో యాతుధాన
మాత జంపినవాడెపో మార్గదర్శి

శ్రీ టి. గుణరాం (పెనుమదం)

రమ్మను గ్రోలి గాంధి సమరమ్మును జల్పె బ్రిటీషు వారితోన్
సొమ్ములు మావి భోగములు షోకులు మీవియొకో!యటంచుదే
శమ్ములు మావి మాపయిని శాసన మేలకొ మీకటంచు రం
గమ్మున దూకె శస్త్రమును గాగనహింసయు పైని గీత సా
రమ్మను గ్రోలి గాంధి సమరమ్మును జల్పె బ్రిటీషు వారితోన్

శ్రీ సుశర్మ - తణుకు

అన్నములేనివాడు పరమాన్నము పంచెను బల్లెబల్లెకున్
అన్నములేదు కొన్ని మధురాంబువులున్నవి త్రావు మన్న యా
యన్నకు రంతిదేవునకునౌరసుడై వెలుగొందునట్టి వి
ద్వన్నయశాలి యెక్కడతి దాతృత భావితరాల వారికై
అన్నము లేనివాడు పరమాన్నము పంచెను బల్లె పల్లెకున్

శ్రీ జి.వి.కె. సత్యనారాయణమ్మ

"ముగ్గురు పంచపాండవులు మూడు జగంబుల వన్నెకెక్కరే"
అగ్గణనీయ మూర్తులకు హారతి వట్టుము సాంయుగీనులై
నెగ్గుట తక్క వారలవనీ తలమందున వెన్ను జూపుచున్
మ్రగ్గిన జాడలేదటగ రాణికి రాణికి సంతులిద్దరున్
ముగ్గురు, పంచపాండవులు మూడు జగంబుల వన్నెకెక్కరే

శ్రీ యమ్. రామమూర్తి

"తేలును ముద్దులాడి చెలి తియ్యగ నవ్వెను పండు వెన్నెలన్"
ఆలలితాంగి తత్ప్రియునికాదట గూర్చుచు ముద్దులిచ్చుచున్
హేలగనవ్వువేళ ప్రభవించిన కాంతుల ముంచివైచి భో
గాలను దేల్చివైచు నయగారములొల్కుచు దుష్టివార్ధిలో
తేలును, ముద్దులాడి చెలి తియ్యగ నవ్వెను బండు వెన్నెలల్

శ్రీ గజల్ శ్రీనివాస్, కోరుకొండ

గజలే ప్రాణము పూజనీయముగదా కల్యాణసంధాయియై
సజవంబై మధురార్థమై హృదయ సంస్థానంబు సాధించి ఈ
ప్రజకున్ స్పందన గల్గ జేయగల భవ్యంబైన గీతంబు నీ
రుజయై సాగు సినారె కైత భువి వెల్గున్ శ్రీను పాడంగనా
గజలే ప్రాణము పూజనీయముగదా కల్యాణ సంధాయియై

శ్రీ సోమంచి సత్యనారాయణ, పాలకొల్లు (సంస్కృతం)

"రాకాయామసి చంద్రికావరతమః గాఢం సమాలింగతే"
ఏతే భవ్య వధానినోబహువిదః పద్యాని నిర్మాంతి హా
పద్యం దూషణమాచరంతి చ ఖలాః గృహ్ణాంతి రాహు గ్రహాః
చంద్రాః సర్వకవీశ్వరాః విజయతే రాకా సభా శ్రోతృభా
రాకాయామపి చంద్రికా వరతమః గాఢంసమాలింగతే!

శ్రీ సుంకర వేంకటేశ్వరరావు

"ద్వంద్వ భ్రాంతి త్యజించి యెంచునతడే దైవంబు లోకంబునన్"
బింద్వాకారమునందు బ్రహ్మము మహా విశ్వాత్మమై యొప్పు రా
కేంద్వాకారతనజ్ఞతన్ దరుమగా హృద్వాసియైయుండుని
ర్ద్వంద్వ వ్యాపృతి ప్రోది చేసి సమతా భావాభిషిక్తుండుగా
ద్వంద్వ భ్రాంతి త్యజించి యెంచునతడే దైవంబు లోకంబునన్

డా॥ ధూళిపాల ప్రభాకర కృష్ణమూర్తి - నిడదవోలు

"కవిత వ్రాయలేని కవిరాజు కడిమిళ్ళ"
పలుకులందు సొగసు బట్టులు తోచని
పలుకుబడులు లేని ఫణితి విరస
కవిత వ్రాయలేని కవిరాజు కడిమిళ్ళ
అనుచు బలుకు జనులకంజలింతు

శ్రీ యమ్. రామకృష్ణ - తోలేరు

"సిద్ధాంతంబులు వేయునేలనిక వాసింగాంచు దౌర్జన్యముల్"
రాద్ధాంతంబులు చేయుటే కళయగా రాజిల్లు లోకంబులో
సద్ధర్మంబులు నిల్చునే హితము విశ్వాసమ్ము నార్జించునే
వృద్ధుల్ చెప్పిన బుద్ధులన్ వినని యీ విశ్వమ్ము నందింక ఈ
సిద్ధాంతంబులు వేయునేలనిక వాసింగాంచు దౌర్జన్యముల్

శ్రీ శృంగారకవి రాధాకృష్ణ - నరసాపురం

"పాడ సంగీతమున్ బాము పారిపోయె
ఒక్కగాయకుడడవియందొక్కనాడు
పూని మూలికల్ తెచ్చుకో బోయినాడు
సర్పమగుపట్టె వెంటనే షడ్జమందు
బాడ సంగీతమున్ బాము పారిపోయె

శ్రీ రేకపల్లి సోమయజులు

"స్నేహము చేయరాదు మహనీయులతోడ వసుంధరా స్థలిన్"
సాహసమయ్యమైత్రి పరిచర్యలు చేయుచు వారినుండి మే
లౌహిత వాక్యముల్ వినినయాయువు బుద్ధియు వృద్ధి పొందు నీ
యూహలు మానుమయ్య రుచిరోక్తులు సుమ్మివి సేవ చేయుమా
స్నేహము చేయరాదు మహనీయులతోడ వసుంధరా స్థలిన్

శ్రీ వీరుభొట్ల సత్యనారాయణ - పాలకొల్లు (సంస్కృతం)

దృష్ట్వా రూపమిదం ప్రియాంగ గహనం వృద్ధో పి కామాయతే
భూలోకే దివిచాపి నేదృశమహోరూపం సుదత్యా వరం
భ్రాతస్సత్యమిదం విదేహ తనయా సౌందర్య రత్నాకరః
రామేణాశ్రిత కాననేన మునివన్మానం కదర్థీకృతం
దృష్ట్వారూపమిదం ప్రియాంగ గహనం వృద్ధో పి కామాయతే!

శ్రీ ఆర్.ఎస్. వెంకటేశ్వర్లు - పాలకొల్లు

"యమ నీకైపడి చావరొక్కొ జనులాహ్లాద ప్రియం భావుకుల్
రమణీ! సర్వవిలాస హాసయుతవై రాజిల్లు చింతామణీ!
కమనీయంబగు వేషమున్ విడిచి యీ కాషాయమాసింతువే
సుమగాత్రీ! తనువెల్ల నీమములచే క్షోభించునే నీకు న్యా
యమ! నీకై పడి చావరొక్కొ జనులాహ్లాద ప్రియం భావుకుల్

శ్రీ కె.వి.ఎస్.ఎల్. నరసింహారావు

"పచ్చని పత్రికా రచన భవ్యము నేడెటులెంచి చూచినన్"
మచ్చిక కల్గెనంచు పలుమారులు మెచ్చులు వ్రాయరాదు సం
పచ్చయమున్నవారలని బాసటగా నిలువంగరాదు పల్
ముచ్చటలౌ విశేషముల బొద్దుట ముచ్చట క్రుమ్మరించుమేల్
పచ్చని పత్రికారచన భవ్యము నేడెటులెంచి చూచినన్

శ్రీ సోమంచి శ్రీనివాసశాస్త్రి - పోడూరు

"జారుల జూచి వందనము సల్పిరి భక్తులు ముక్తి కాంక్షతోన్"

సార విహీనమై మెలగు జాడ్పున సాగుచునున్నదయ్య సం
సారమటన్న భావనల సాగుచు ధార్మికులైనవారు సం
చారము చేయుచుందురనిశంబును దేవళమందునున్నపూ
జారుల జూచి వందనము సల్పిరి భక్తులు ముక్తి కాంక్షతోన్

శ్రీ మాడభూషి కృష్ణప్రసాద్ - పాలకొల్లు

"ఖల సంబంధంబె క్షేమ కారణమాయెన్"

పలు సజ్జనులకు గుడియై
తొలిగించెను గుబ్జరూపు దొసగును, గంధ
ర్వులు చెట్టె నిలువనులూ
ఖల సంబంధంబు క్షేమ కారణ మాయెన్

"మునికిన్ గోపమె భూషణంబగు బ్రజామోదమ్ము సంధిల్లగన్

అనిలాంశమ్మున బుట్టినాడతని దేహమ్మింక వజ్రమ్ము చి
వ్వను జంకన్ బనిలేదు ద్రౌపదికి వల్వల్ దీయునవ్వాని రొ
మ్మును జీల్చంగను, రక్తమున్ గొనగనొప్పున్ సంగరంబందుభీ
మునికిన్ గోపమె భూషణమ్మగు బ్రజామోదమ్ము సంధిల్లగన్

శ్రీ అక్కిపెద్ది రామ సూర్యనారాయణ, అవధాని - కొయ్యలగూడెం

"గంగ వివాహమాడెనట కన్యల ముప్వుర గౌతుకంబునన్

సంగరమందు వేల్పులకు సాయము చేయగలట్టి దిట్టయై
నింగిని దాకు గీర్తి గని నిచ్చలు ధర్మపథానువర్తియై
బంగరు మానసంబుగల పంక్తిరథుండట సంతుకోర్కె పొం
గంగ, వివాహమాడెనట కన్యల ముప్వుర గౌతుకంబునన్



## శివరాత్రి సమర్చనం

# హేలాపురి- శతావధానం

**సమర్పణ**

**శ్రీ సి. మురళీకృష్ణ ధవేజి**

అసాధారణ మేధాశక్తి
ఉపకారమంటే ఎనలేని అనురక్తి
పలుకు పరిమళాల జవ్వాజి
మురళీ కృష్ణ ధవేజి



**2000 మార్చి 4,5 తేదీలు**

నిర్వహణ :

**గరికపాటి ఆర్ట్స్ థియేటర్**

సంచాలకులు :

**డా॥ ధూళిపాళ మహాదేవమణి**

డైరక్టర్ :

**శ్రీ గరికపాటి కాళిదాసు**

సూత్రదారి:

**అవధాన భోజ శ్రీ వడ్డి శ్యామ సుందరరావు**

# సమస్యలు

శ్రీ గొర్తి సత్యనారాయణమూర్తి - నరసాపురం

"దాతలు నొచ్చుకొందురట దానముసేయగనెంతయున్మదిన్"

శ్రీతనివోవునట్లు విరచించెడి దానమె దానమౌట వి
ద్యాతరుణీ ప్రసన్న హృదయంబునెఱింగిన వారికిచ్చునా
చేతులె చేతులౌ, దరికి జేరి యపాత్రులు చేయి జాచుచో
దాతలు నొచ్చుకొందురట దానముసేయగనెంతయున్మదిన్

శ్రీ మల్లంపల్లి ఏకోరామసిద్ధుడు - నరసాపురం

"మనమే ధర్మజ వైరసేనులకిడెన్ వాసమ్ము ఘోరాటవిన్"

అనుమానంబొకయింతలేదు వ్యసన వ్యాలోలతా బద్ధ జీ
వనులై ఘోర వనమ్ము పాల్పడిరి దీవ్యచ్ఛక్తి నిర్వీర్యమై
గొనముల్ కల్గియు దుర్గతుల్ వడయరే ఘోరమ్ము శాపమ్ము దే
వనమే ధర్మజ వైరసేనులకిడెన్ వాసమ్ము ఘోరాటవిన్

దేవనము = జూదము

వైరసేని = నలుడు

డా॥ ధూళిపాళ ప్రభాకర కృష్ణమూర్తి - నిడదవోలు

"నకులుని జంపె రామ నరనాథుడు జానకి సంతసింపగన్"

సుకరము గాదు జీవనము సూరుల నారుల బీడబెట్టుచో
నకలుష చిత్తవృత్తికెడమై దశకంఠుడు బట్టకట్టెనే
ఒకనరుడొక్కవానరుడునుక్కడగింపరె నాడు యాతుధా
న, కులుని చంపె రామ నరనాథుడు జానకి సంతసింపగన్

శ్రీ కలపర్తి వేంకటేశ్వరరావు - ఏలూరు

"దివ్వె వెలుంగుచుండిన గదిన్ నలువంకల నిండె జీకటుల్"

సవ్వడిలేదు గుండియను సన్నని రోదన రేఖ తక్క పెం
జివ్వ పతిన్ హరించెనను జేదగు గుట్టునెఱుంగనశ్రువుల్
నివ్వటిలెన్ సులోచనకు నిండుగనంతిపురమ్ము లోపలన్
దివ్వె వెలుంగుచుండిన గదిన్ నలువంకల నిండె జీకటుల్

శ్రీ నందిభొట్ల సత్యనారాయణ - ఏలూరు

"రాత్రి దివాకరుండుదయ రాగము చిందె దిశా ముఖమ్మునన్"

పాత్రులు కాగ సన్మునులు భద్రతకున్, వరివస్య నిత్యమై
ఛత్రము పట్టగానుదయ సంధ్యను వార్చుటకుత్సహింపగా
మిత్రుడు కర్మ సాక్షియయి మేల్కొనినాడు గతించి పోవగా
రాత్రి; దివాకరుండుదయ రాగము చిందె దిశా ముఖమ్మునన్

శ్రీ వరిగొండ శ్రీరామారావు - ఏలూరు

"దున్నను బుద్ధిమంతులు యథోచిత రీతిని సత్కరింపరే"
ఎన్నిక చేసి శబ్దములనేరుచు విత్తులుసేసి చేసి వి
ద్వన్నయ లోక చిత్తము ముదంబున క్షేత్రముసేసి, నాటి, సం
పన్నుడు కావలెన్ రసము వర్షముగా కలమే హలమ్ముగా
దున్నను; బుద్ధిమంతులు యథోచిత రీతివి సత్కరింపరే

శ్రీ కూచిబొట్ల వ్యాసలింగశాస్త్రి - ఏలూరు

"ఆకాశమ్మ్ననుండి జారిపడె ముక్తౌఘమ్ము చోద్యమ్ముగా"
ఆకైలాసమునందు శంకరుడు వామార్ధమ్ము గౌరీయుతం
బై కన్పట్టగ, దాండవోత్సవ కళా వ్యాలోలుడై యుండగా
రాకాచంద్ర నిభాస్యమందు నగవుల్ రంజిల్లె వెన్వెంటనే
ఆకాశమ్మ్ననుండి జారిపడె ముక్తౌఘమ్ము చోద్యమ్ముగా

శ్రీ మొక్కపాటి వృషాద్రిపతి

"హేలాపూరవధానమున్ గనిరహో రంభా చిరంజీవులున్"
ఈ పాండిత్యము నీకు దక్కగలదే యెందేని గన్గొంటిమే
రాపాడించితివయ్య బాస'కడిమిళ్ళా' యంచునయ్యప్సరో
దీపంబుల్ వికసించె వాయు సుతుడున్ దీవించె నీరీతి హే
లాపూరందవధానమున్ గనిరహో రంభా చిరంజీవులున్

శ్రీ కె.వి. రంగనాథమూర్తి

నిందలు మోయువాడె స్మరణీయుడు పూజ్యుడు మానవాళికిన్
అందె శ్యమంతకమ్ము హృదయమ్మున భాస్కరునిన్ స్మరించి దా
నిం దన తమ్ముడున్ బిదప నేరుగ సింగము,జాంబవంతుడున్
బొందిరి, సత్య తండ్రియును మోపెను నిందలు చక్రిపైని నా
నిందలు మోయువాడె స్మరణీయుడు పూజ్యుడు మానవాళికిన్

శ్రీ గుడిసేవ విష్ణుప్రసాద్ (సర్వలఘుకందము)

"నిను గని మునిజన మనములు నెనరున దనిసెన్"
మనమున నిలిచిన గిరిశుని
అనవరతము స్మరణ సలిపి యతనిని గనుటన్
వినిచిరి తొలిపలుకులనిటు
నినుగని మునిజ నమములు నెనరున దనిసెన్

శ్రీ ఎస్. రామకృష్ణ - ఏలూరు

"జనపనార మిల్లులోన జపముమాల త్రిప్పుడీ"
మనసుపెట్టి చేయునట్టి మంచిచేత దైవమై
మనకు మేలు సేయు గాన మాటికిన్ శ్రమించుడీ
జనపనార మిల్లులోన జపముమాల త్రిప్పుడీ
శునిస్మరించి యిహపరాలు చూరగొంట సాధ్యమే

శ్రీ జి.వి.బి. శర్మ - జంగారెడ్డి గూడెం

"నెత్తురు పీల్తు రమ్మనుచు నెచ్చెలి బిల్చె ప్రియుండు ప్రేమతో"

పుత్తడి బొమ్మవీవు, రసపూర్ణమనస్విని వై చెలంగి ముం
చెత్తుమ రాగవాహినినినీదుచునీదుచు సొమ్మసిల్లి, పో
టెత్తి పరాక్రమించి రహోయింతు వియోగపిశాచికిప్పుడే
నెత్తురు పీల్తు, రమ్మనుచు నెచ్చెలిఁబిల్చె ప్రియుండు ప్రేమతో

శ్రీ వంగపండు నరసింహారావు - రాజమండ్రి

"లక్ష్మణుడన్న రామునకు రాఘవుడెంతటి భాగ్యశాలియో"

పక్ష్మములేని యార్పడట వాకిట గావలి గాయువేళదా
లక్ష్మికి రామచంద్రునకు ఆాతిరియున్ బవలున్ శ్రమించుచున్
సూక్ష్మమతిన్ రచించునట చోద్యముగా వరివస్య పిన్నయౌ
లక్ష్మణుడన్న రామునకు రాఘవుడెంతటి భాగ్య శాలియో

శ్రీ డి. ఆనందమోహనబోస్

"కలహము కారణంబతివ గాదె గనంగ జగమ్ము నందునన్"

అలతిగ రామభద్రుడు సురారి యురమ్మును జీల్చినాడు విం
తల సడిలేని ఘాతముల నాశమొనర్చెను గీచకున్ మహా
బలుడగు భీమసేనుడు వివాదములయ్యెవి స్త్రీ నిదానముల్
కలహము కారణంబతివగాదె గనంగ జగమ్మునందునన్

శ్రీ బండారు ప్రసాదరావు - గుడివాడ

"కలువలు వికసించె బగలు కంటే వింతై"

పొలుపున రాహూదయమై
యలవోకగ మ్రింగ బడియె యా రవిబింబం
బిలపై వెను వెంటనె చెం
గలువలు వికసించె బగలు కంటే వింతై

శ్రీమతి మాలతి - ఏలూరు

"చిక్కెను జేతిలో శివుడు చేతన కోరెను శక్తి తానెయై"

అక్కునచేర్చుకొన్న క్షణమందున బాహి యటన్నమాట ఏ
ప్రక్కననుండి వచ్చినదొ!భర్త వియోగము సంభవించుటన్
స్రుక్కిన గౌరి తీవ్రమగు రోషముతో దపమాచరింపగా
జిక్కెను చేతిలో శివుడు చేతన కోరెను శక్తి తానెయై

శ్రీ తిమ్మరాజు

"కలడు కలడను వాడు దా గలుగునొక్కొ!"

విత్తమందునె లోకమ్ము విశదపడియె
మంచి తనమన్న మాటయే మలగిపోయె
మంచినెంచెడి వాడు మన్నించువాడు
కలడు కలడను వాడు దా గలుగునొక్కొ!

శ్రీ బి. కొండలరావు

"భార్యకు మీసముల్ మొలిచె బాపురె! భర్తకు గర్భమయ్యెడున్"
ఆర్యులు పల్కినట్టినుడులందున జిత్తమునుంచి, ధర్మసాం
దర్య పిపాస గైకొన ముదమ్ము, ఋతుక్రమమాగిపోవగా
భార్యకు మీసముల్ మొలిచె బాపురె భర్తకు గర్భమయ్యెడున్
చర్యకు సంభవించు బ్రతిచర్య సుతుండు జనించు వారికిన్

శ్రీ చావలి విశ్వేశ్వరరావు

"ముండవు బోడి గుండె కడుముచ్చట నీకు ముసుంగదేటికో!
నిండగు గుండ తా దొంక నేరదు నిక్కము లోకమందు నీ
వుండెదవంట నిచ్చలును యోగుల మానస వీథులందునన్
ముండిత శీర్షులయ్యు నిను మోహము పాలొనరింత్రు వెఱ్ఱి రా
ముండవు బోడి గుండె కడుముచ్చట నీకు ముసుంగదేటికో!

శ్రీ మందారం వేంకటేశ్వరరావు - గుడివాడ

"బ్రహ్మకునుద్భవించెను పురందరుడున్ పురుషోత్తముండహో!"
జిహ్మతలేని జీవనమె శ్రేష్ఠము యోగ్యమునెల్లవేళ ద
ద్బ్రహ్మమునందు వర్తిలుచు బ్రాణి చయంబు సృజించువేళలో
బ్రహ్మకునుద్భవించెను; బురందరుడున్ బురుషోత్తముండహో
బ్రహ్మకళా విలాసమని పల్కనహల్య మనోహరాంగియై

శ్రీ హెచ్. ఆర్. చంద్రం

"పద్యము చచ్చిపోయినది పండితులెల్లరు సంతసింపగన్"
మద్యము రెచ్చిపోయినది మాన్యజనావళి కుందువందగన్
మద్యము మత్తులో పనికిమాలిన మాటలు ప్రేలు నోటిలో
పద్యము చచ్చిపోయినది; పండితులెల్లరు సంతసింపగన్
బద్యము చెప్పెదన్ రసవిభాసితమై కలకాలముండగన్

శ్రీ సుంకర అప్పాజీరావు

"శత్రుఘ్నుడు వచ్చి ప్రేయసికి దోడ్పడి తోడ్కొనిపోయెనేర్పుగన్
విఘ్నములెక్కసేయక వివేకముతో గమియించి మించి, పా
పఘ్నుడు వాసుదేవుడు శుభంకరుడార్త జనావన క్రియా
నిఘ్నుడు రుక్మిణీ హృదయ నిర్మిత మందిర సుస్థిరుండు శ
త్రుఘ్నుడు వచ్చి ప్రేయసికి దోడ్పడి తోడ్కొని పోయె నేర్పుగన్

శ్రీ ఎ.వి. రమణ ప్రసాద్ - కొవ్వూరు (అవధాని)

"ఊరుచెలంగె రేయిబవలున్ గుసుమాయుధ తాడితాంగమై"
సారులు గల్గు గీతముల జాణతనంబున రాగమార్గ శృం
గారము రంగరించి, నయగారములన్ బచరించి రంగు బం
గారు మనోజ్ఞ భావముల గమ్మని పాటలనంద జేసి 'సా
లూరు' చెలంగె రేయిబవలున్ గుసుమాయుధ తాడితాంగమై

# దత్తపదులు

"హోలీ, కే, పీచే, క్యాహై - శ్రీ కృష్ణలీలలు శార్దూలం"

శూరుండై పరిమార్చు శత్రువుల, వా'హోలీ'ల లాలించున
య్యారే 'కే'ల్గవ గత్తియున్ మురళినొయ్యారంబునందాల్చు వే
వేరాసిక్యము చూపనెంచినను గోపీచే'తముల్ దోచు జ్ఞా
నారూఢిన్ నడయాడుచుండునట నా'క్యాహై'ందవమ్మోముచున్

"అలక, పలక, మెరక, తునక - భారతం"

'అలక'రుణాంతరంగుడు మహామహితాత్ముడజాత శత్రుడే
అలిగిననాడు సాగరములొను దునా'తునక'ల్ నిజమ్ము క
ర్ణులు పదివేవురున్ 'మెరక' గ్రుడ్లు వహింతురు నమ్ముమయ్య కా
'పలక'లు రేగకుండగ మురారిని నేను వహింతు నిచ్చలున్

కాపు + అలకలు

శ్రీ బందా - ఏలూరు

"కమ్మ, దిమ్మ, రెమ్మ చెమ్మ (భారతం)"

కమ్మని పల్కులే పలికి కాంతలకున్ వరివస్యసేయు, బొం
దిమ్మనినట్టి కీచకున కేర్పరచెన్ నరకమ్ము వింత పూ
రెమ్మను దాకినన్ గమలు లేత కరమ్ములు సేవసేయుచో
జెమ్మటలూడ్చె గృష్ణ సరిజెప్ప బతివ్రతలుందురే మహిన్

"సోముని, భామిని, కామిని, జామిని, శారదాస్తవం"

సోముని కాంతి సిగ్గిలగ శుక్ల సరస్వతి కాంతులీని స్వ
ర్ణామి నితాంతమున్ మురియు జక్కని గీతములాలపించు శ్రీ
భామిని విస్తుపో సిరుల పంటలొసంగుచునంబుజాతరు
డ్కామిని సత్కవీశ జన కల్పకమై విలసిల్లు నిచ్చలున్

శ్రీ నేతి సత్యనారాయణ శాస్త్రి - ఏలూరు

నగ, మగ, పగ, సెగ (అర్ధనారీశ్వరం)

నగజయు సగమయి మిగిలెను
మగడును సగమాయె హృదయమధురిమ వర్షా
పగయయి వర్ధిలు నిచ్చలు
సెగకంటికినింత వలపు చిత్రము గాదే!

(జామి = కులకాంత)

శ్రీ మందారం వేంకటేశ్వరరావు -గుడివాడ

"రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్న - భారతార్థం"

విఘ్నములెన్నియో! తనవివేకము భద్రగుణాభిరామ ధీ
నిఘ్నము సేయుచున్ దపము నిష్ఠమెయిన్ గుణ లక్ష్మణుండు పా
పఘ్ను దలంచుచున్ భరతవంద్యునొనర్చెను సవ్యసాచి శ
త్రుఘ్నత గోరి, శంకరుడు తుష్టిని బాశుపతమ్మొసంగగన్

శ్రీ హెచ్. ఆర్. రామచంద్ర

"అరసము, విరసము, సరసము, కురసము" పద్యకవితా ప్రాశస్త్యం - చంపకమాల

అరసము పద్యమున్ గనిన యార్యులు మెచ్చరు తీవ్ర దృష్టితో
విరసము చేసినన్ హృదయ వేదనకయ్యది దారి చూపు నీ
కు, రసమునందు కోరిక అకుంఠితమై విలసిల్లుచున్నచో
సరసములైన పద్యముల జాలు జనించును గైత సేద్యమా

శ్రీ సుంకర అప్పాజీ - మోటూరు

"సంహననము, సంహరణము, ఓంహరి, సింహము హనుమ స్తవం"

సంహననమ్ము సేసెనట శత్రువులన్ దృటిలోన జానకీ
సంహరణమ్ము రాక్షస గజమ్మొనరించిన గర్జసేయుచున్
సింహము తానయై కడగి జృంభణమున్ బొనరించి, కావుమా
ఓంహరి మర్కటా యనిన యూరక వారకనోమెనార్తులన్

శ్రీ బోస్

అలన, కలను, చలన, వలన - ఉత్తర గోగ్రహణం

అల నయదూర కౌరవుల యాగడముల్ సహియింపలేక మూ
కలను విదిల్చి వైచుటకు గవ్వడి పూనగనాలమందకున్
చలనములాగిపోయినవి, సాధన చేసిరి గుప్తదీక్షనా
వల నయతత్త్వమే గెలుపు పట్టుల గుట్టులెరుంగ జెప్పగా

శ్రీమతి జి. కల్యాణి

"దక్ష, రక్ష, శిక్ష, భిక్ష" - భీమేశ్వర స్తుతి

దక్షారాముడు భీముడు
రక్షణ గావించుచుండు బ్రకటిత కృపతో
శిక్షించును దుర్జనులను
భిక్షాటన సేసి మోక్షవిత్తమొసంగున్

శ్రీ బ్రహ్మేశ్వరి

"రాజు, రోజు, మోజు, గాజు (నేటి రాజకీయం)"

రాజుకొనంగనేలొకొ కులంబుల గోలలు రాజలీలలై
రోజును రోజు దస్సహము లోకము పీడల పాటియాటచే
మోజులు తీరునాయకుల భోగ విలాసములున్ ఫలించుచున్
గాజులు చేతికిన్ దగులగావలె వారికి బూజుడుల్లగా

"నిత్యము, సత్యము, ముత్యము, స్తుత్యము (దేవిప్రపత్తి)

నిత్యము శాంకరీ చరణనీరజమందువ భృంగమౌచు సం
స్తుత్యము తచ్చరిత్రముల జొరగొనన్ మకరంద భావనన్
సత్యము సార్వకాలికము శస్త్రమునైన పథమ్మునదక్కుటన్
ముత్యము వోలె జీవనము ముచ్చటలన్ బచరించు నిచ్చలున్

శ్రీ రుద్రరాజు

తెలుపు, నలుపు, కలుపు, మలుపు (దోమలబాధ)
తెలుపుడు పద్యము జెట్టని
కలుపుడు గుడ్నైటు రసము కావలసినచో
మలుపులు తిరుగును బ్రతుకులు
నలుపుడు తన్మశక జీవనమ్ములు వేగన్
జెట్టు + అని

శ్రీ బొంతు పాండురంగారావు

సారా, తేరా, రారా, పోరా (భారతార్థం)
సారాంశమ్ము నెఱుంగుమ
తేరా కపిపాలితమ్ము, దీక్షామతి యై
రారాజు పనిని బట్టును
పోరాపిన శుభము నీదు పుత్రులకబ్బున్

శ్రీ మూరి సుబ్రహ్మణ్య సత్యనారాయణ

వాణి, వేణి, బాణి, బోణి (అర్ధనారీశ్వరం)
వాణికినందని తత్త్వము
వేణీ త్రితయమ్ములో బవిత్రతకిరవై
బాణిని మొదలిడినది పూ
బోణి మగని తనువు సగము పొందుటతోడన్

శ్రీమతి సుబ్బలక్ష్మి

చెట్టు, గట్టు, మెట్టు, పెట్టు (స్వర్ణాంధ్రప్రదేశ్)
చెట్టునకొక్కరై నడచి చేదును మ్రింగగనేల మీకు వా
గట్టుల సాగిపోవలయునాంధ్రికి మోదముకల్గ మంచి చూ
పెట్టుట నేర్పుడయ్య పదవీ వరివస్యలు గావు జాగృతిన్
మెట్టుట జాతి మొత్తముగ మేలిమి బంగరు బాట వేయుటల్

శ్రీ ఎ.డి.వి. ప్రసాద్

పట్టి, పట్టె, పుట్ట, పుట్టు (శివరాత్రి ఉత్సవాలు)
పట్టిసీమవంటి తీర్థవాసమందు బూనికన్
పట్టెడంత యన్నమెవడు భక్తి తోడ బెట్టునో
పుట్టబోడు వానికింక మోక్షమే లభించెడిన్
పుట్టుకలకు భరతవాక్యములగు హరుని రాత్రులే

శ్రీమతి యమ్. శేషకుమారి

"నందన, చందన, వందన, బంధన" - గణపతి స్తవం
వందనమయ్యా ! గౌరీ
నందన! కవితాభినేత్రి నాట్యంబునకున్
చందన చర్చగ జేయుమ
బంధన వారణము మత్తవారణ ముఖుడా!

ఏలూరిపాటి అపర్ణ - ఏలూరు

తొల్లి, చల్ల, మల్లె, తల్లి ( వేంకటేశ్వరుడు ఉత్పలమాల)

తొల్లిటినాటి పున్నెముల తూరుపు ప్రొద్దుదయించెనేమొ యా
చల్లటి చూపులే యెడద జాడలలో కురిపించుచుండెడిన్
మల్లెలుగా బరీమళపు మాధురి గాంచగ జేయుచుండు మా
తల్లియ వేంకటేశ్వరుడు తన్మది మాతృత నిండియుండటన్

శ్రీమతి మాణిక్యేశ్వరి

కట్టు, జుట్టు, గుట్టు రట్టు (భార్యాభర్తల అన్యోన్యత)

కట్టున నిల్చియుండి, నుడికారములందున నిగ్రహించి, లో
జుట్టుచునున్న కోరికల జూపక కొంతకు సంగ్రహించి, లో
గుట్టునెరుంగనీక పొరుగున్, సుఖియించుట మేలుగాన, మీ
రట్టుల నిల్చుడమ్మ హృదయంగమ దంపతి భాష్య పంక్తియై

శ్రీ ఎస్. వి.కె. వి.సాధి

మూల, లీల, గోల, హేల (శ్రీ కృష్ణుని అమాయకత్వం)

మూలను డాగలేడు గుణమోహనుడాతడు విశ్వరూపియై
లీలలు చూపకుండ మనలేడు పవిత్రత దాట జాలడా
గోలను వీడలేడు తన కూరిమి చూపుట మాన జాలడా
హేల యమాయకత్వమని యెంచును లోకము మాయ క్రమ్మటన్

శ్రీ కాజ చంటిపాప

"అరుణ,కరుణ,వరుణ,శరణు (ఆంజనేయుని పరంగా)"

అరుణ గభస్తి బింబము రయంబున మ్రింగగ జూచినాడహో!
కరుణను రాక్షసీ తతిని గాచెను జెట్టలు సేసినన్, గృపా
వరుణత జానకీ హృదయ వహ్ని గ్రహించి దహించె లంక నీ
శరణు రఘూత్తమా!యనిన జాలు గపీశుడె గాచు నిచ్చలున్

శ్రీమతి సూరి వెంకటలక్ష్మి

రమ్య, రోజా, రాశి, రక్ష ( దేవీ ప్రాశస్త్యం)

'రాశీ'భూత సమస్త సద్గుణయు, బా'రమ్య'మ్ము సచ్ఛీలతా
రాసిక్యమ్మునకున్, భవార్తి హతులన్ 'రక్షా'మతిన్ గాచెడిన్
రోసమ్మున్ ప్రకటించు రాక్షసులు కా'రో', జా'ర చోరాధముల్
గాసింబొందునభాగ్యులా జననియే కల్యాణ సంధాత్రియౌ"

శ్రీమతి లక్ష్మీకుమారి

రాగము,రోగము,భోగము,యోగము (వార్ధక్యంలో భోగజీవి స్థితి)

రాగము సన్నగిల్లునట రాతిరియున్ బవలున్ సమానమై
రోగము కాని రోగమున రొప్పుచు రోయుచునుండు వేళ సం
యోగమయోగ్యమై హృదయమూరక వారక తాపమంది స్వ
ర్భోగము మాటకేమి? భువి భోగములే విరహాగ్ని వ్రేలెడిన్

# నరసాపురం - సంస్కృతాంధ్ర శతావధానం




సమర్పణ

**అవధాన భారతి**

నిరంతర సాహితీ సేవారతి
అనూన సౌజన్య మనోగతి
పలుకు వెన్నెలల హారతి
నరసాపురం అవధాన భారతి

## ఆగస్టు - 11,12, 2001

నిర్వహణ :

**అవధాన భారతి**

వేదిక:

**అరబిందో ఆడిటోరియం**

**శ్రీ వై.యన్. కళాశాల, నరసాపురం**

సంచాలకులు :

**డా॥ ధూళిపాళ మహాదేవమణి**

విశిష్ట అతిథులు :

**ఆచార్య బేతవోలు రామబ్రహ్మం**

**శ్రీ జటావల్లభుల జగన్నాథం**

**శ్రీ విశ్వనాథ గోపాలకృష్ణ**

పావనశీల! శాస్త్ర గుణ వైభవ సంభవ పద్య చాతురీ
సేవనలోల! కావ్య రససేచిత ధాత్ర సతీ కపోల! రా
మావృత ధూళిపాల! హృదయాంబుజ సంస్థిత బాల! శ్రీ మహా
దేవమణీ1 భవద్గరిమ దేశము పట్టక నిండె గుండెలో

పాలిత శాస్త్రవైభవుడపార దయా పరిపూత చిత్తుడున్
లాలిత శిష్యపుంగవుడలౌకిక శాంకర తత్త్వ వేదియున్
కాల గళాంఘ్రి సేవన వికాసిత లోచన విశ్వనాథ గో
పాల గురూత్తమున్ దలచు భాగ్యము కల్గెను నాకు జాలదే!

రచ్చ గెలిచితి పలుమార్లు రాజసమున
ఇంట గెలుచుటకవకాశమిపుడు కలిగె
అవల లభియించు పంచ భక్ష్యములకంటె
ఇంట దొరికినది రసాన్నమెంత రుచియొ!!

మాన్య జనులార! ఓయసామాన్యులార!
శిష్టమతులార! హితులార! ద్రష్టలార!
విజ్ఞమతులార! మాయూరి పెద్దలార!
పిన్నవాడను నన్ను దీవింపుడయ్య!

## సమస్యలు

డా॥ కేశాప్రగడ సత్యనారాయణ - అష్టావధాని - కిర్లంపూడి

"చక్షుశ్శ్రోత్రమునెన్ని మూషికములాశ్చర్యమ్ముగనం బట్టిగా"

అక్షీణంబగు వైభవమ్ముగల దేవా! యేకదంతా! భవత్
సాక్షాత్కారము, సాన్నిహిత్యమును గాంచన్ సర్వ సామర్థ్యమ
ధ్యక్షించున్గద! వాహనంబగుటచేనయ్యాయి సంతానముల్
చక్షుశ్శ్రోత్రమునెన్ని మూషికములాశ్చర్యమ్ముగనం బట్టిగా

శ్రీ భారతం శ్రీమన్నారాయణ - తాడేపల్లిగూడెం

"తాంబూలము తరుణీ కుచ
సంబంధము, మట్టిచెట్టు చాయయు మటి కూ
పాంబువులునొసగు జల్లద
నంబును వేసవిని" జలిని నాటును గాకల్

శ్రీ చామర్తి విశ్వనాథం - మలకపల్లి

"దాశరథి గాడు రాముడు దనుజ సుతుడు"

సత్య వాక్పాలన వ్రతోత్సాహ గరిమ
రాజ్యమును వీడి, పోయెనరణ్యములకు
అందుచేతనె దైవతమ్మయ్యెనయ్య
దాశరథి, గాడు రాముడు దనుజ సుతుడు

శ్రీ ఎమ్. రామకృష్ణ - తోలేరు

"పదవిం బొందిన సంఘ సేవయగు లభ్యంబౌను సచ్ఛీలమున్"

ఎదయందున్ సుజనత్వముండవలెగానీ, గద్దె ముఖ్యమ్మటే
బ్రదుకెల్లన్ బడరాని పాట్లుపడు దౌర్భాగ్యమ్ము పోనాడ, నె
మ్మదిమై పేదలనాదుకోవలయు సన్మానంబుతో తన్మనః
పదవింబొందిన సంఘ సేవయగు లభ్యంబౌను సచ్ఛీలమున్

డా॥ ఏలూరిపాటి ఆంజనేయశర్మ - ఏలూరు (సంస్కృతం)

"వస్తావ దేవ! తంతారు"

అన్వర్థం నామ తే నూనం
తారకోభయ తారక!
వస్తావదేవ తం తారు
ణ్యం సేవధ్వం రఘూద్వహం!
(వః తావదేవ తం తారుణ్యం)

శ్రీ కూచిభొట్ల విశ్వేశ్వరరావు - కొడమంచిలి

"సన్యాసమునందె గలవు సంభోగమ్ముల్"

విన్యస్తపదాబ్జునకున్
దైన్యత యేఱ్పడును విషయ తాత్పర్యమునన్
మాన్యత సర్వము విడిచిన
సన్యాసమునందె గలవు సంభోగమ్ముల్

శ్రీ కోట వేంకట లక్ష్మీ నరసింహశతావధాని - జుత్తిగ

" గీతము విన్నపాము పులకింపదు సత్యముగాదె మిత్రమా!"

ఈ తగులాటమేల? వినిపించుట గీతములిట్టి పాటివా
ప్రీతిని గల్గజేయునవి భీతినొసంగునవుండె రాగముల్
జాతిని బట్టి రాగ గుణ సంగతులుండును గాన, షడ్జసం
గీతము విన్నపాము పులకింపదు సత్యముగాదె మిత్రమా!

శ్రీ దుడ్డు రాజయ్య - యానాం

"కాలమ్మున దినిన గూల్బు గాలునినైనన్"

ఆలమెగద! జీవితమిది
కాలమ్మున దినినవాడు కలకల నవ్వున్
మేలగునమృతమె యయ్యున
కాలమ్మున దినిన గూల్బు గాలునినైనన్

శ్రీ జంధ్యాల రామశాస్త్రి (కల్యాణశ్రీ) పాలకొల్లు

"మూషిక వాహనున్ బిలిచె ముద్దుగ గృష్ణుడు ప్రేమమీరగన్

వేషములెన్ని వేసినను వింతగ వాదును బొందినాడు, దు
ర్భాషలనాడె సూర్యవర వర్థిత వైభవుడైన రాజు, తా
రోషమువీడి, సత్యము నిరూపణసేయ వ్రతంబు సేయుచున్
మూషిక వాహనున్ బిలిచె ముద్దుగ గృష్ణుడు ప్రేమ మీరగన్

శ్రీ కె. కె. ప్రభాకరరావు - పాలకొల్లు (సంస్కృతం)

"ఖరపాదార్చన తత్పరా భువి సదా ధన్యాః ప్రియంభావుకాః"

కవితా తత్త్వ విశేషదః పురహరో నిత్యాత్మలింగో హరః
రస సామ్రాజ్య వివర్థకశ్శివకరో గంగాధరస్సర్వదః
గిరిజాక్రాంత నిజార్ధ వామరుచిరః తస్మాత్తదర్థేందు శే
ఖర పాదార్చన తత్పరా భువి సదా ధన్యాః ప్రియంభావుకాః

శ్రీ పండిత చిరంజీవి వేంకట సూర్యనారాయణరాజు - భీమవరం

" రసములు నీరసంబడెను రాజు కనంబడనేమి చోద్యమో!"

అసదృశమౌ మరందములనందగజేసి, రవిన్ వరించి, యా
కసమును జూచి విచ్చుకొని కాంతల కన్నులతోడ దూగి సం
తసమును బొందుచుండగనె నాథుని యస్తమయమ్ము గాంచి సా
రసములు నీరసంబడెను రాజు కనంబడనేమి చోద్యమో !

శ్రీ కోటమర్తి నరసింహమూర్తి - కొవ్వూరు

"అవధానిం గనినంతనే గలుగునయ్యబ్జాక్షికాద్యంతమున్"

కవితా శారద నృత్యముల్ సలుపగా గర్వోన్నతింబొంది గౌ
రవ సంపత్తి గడించి, మించి, హృదయోల్లాసంబు సంధించుని
య్యవధానంబును గాంచి, భారతికహో! ఆశ్చర్యమానందమే
యవధానిం గనినంతనే గలుగునయ్యబ్జాక్షికాద్యంతమున్

డా॥ వి.వై.వి. సోమయాజులు - తణుకు

"ఖడ్గంబొక్కటి చాలదే సరస సత్కావ్యౌఘముల్ గూర్పగన్"

హెడ్గేవార్ హృదయాంబుజాతమున నేడేతేనె దానూరునో!
ద్విడ్గర్వమ్మునడంపగా దగిన యవ్విజ్ఞానమార్జింపుచున్
షాడ్గుణ్యాద్యనుపాసనన్ జలుపుచో సంతోషణ శ్రీవచః
ఖడ్గంబొక్కటి చాలదే సరస సత్కావ్యౌఘముల్ గూర్పగన్

డా॥ ధూళిపాల ప్రభాకర కృష్ణమూర్తి - నిడదవోలు

"ణిసిధాత్వర్థము నాకునిమ్ము మదిలో నీకేల సందేహముల్"
రసరాజ్యమ్మున రాణిజేసెదను జిత్రమ్మైన యానంద సా
రస పంక్తిన్ సమకూర్చి, నాయెడదనే వ్రాయించి నీకిత్తు సం
తసమున్ గూర్పవె, నిర్జన స్థలిగదే! నారీశిరోరత్నమా!
ణిసిధాత్వర్థము నాకు నిమ్ము మదిలో నీకేల సందేహముల్

శ్రీ సోమంచి సత్యనారాయణ శాస్త్రి - పాలకొల్లు (సంస్కృతం)

"భంగేనైవ స రాఘవోవిజయతే లబ్ధ్వా శ్రియం జానకీమ్"
రామోనామ మహాప్రభుర్నరవరో రాకేందు బింబాననః
సారోదార గభీరవాక్య నిపుణః సత్యవ్రతోద్ధారకః
లీలామానుష విగ్రహో నృపవరస్త్వత్యం పురారేర్ధను
ర్భంగేనైవ స రాఘవో విజయతే లబ్ధ్వా శ్రియం జానకీమ్॥

శ్రీ జాన దుర్గా మల్లికార్జునరావు శతావధాని - ముక్కామల

" వడదెబ్బల్ తగిలి లేత వలపులు పుట్టెన్"
అడకువ నెఱుగ నియింటిది
గడబిడగా వడల వంటకమ్ములు సేసెన్
గడిదేరిన మగనికి, ఆ
వడదెబ్బల్ తగిలి లేత వలపులు పుట్టెన్

శ్రీ పోచనపెద్ది సుబ్రహ్మణ్యం, అష్టావధాని - తాళ్ళరేవు

"సరసులగాంచలేము నరసాపురమందున సత్కవీశ్వరా!"
అరదమునెక్కి భారతి విహారము సేయుచునుండుచోటు భా
సురతర శాస్త్రవేత్తలు, విశుద్ధకవీశులు వీరలందఱున్
పరసులుగారె! దుష్టగుణ సంగతినించెడి క్షుద్ర సాహితీ
సరసుల గాంచలేము నరసాపురమందున సత్కవీశ్వరా!

శ్రీ చల్లా సూర్యకామేశ్వరరావు - నరసాపురం

"పలమున్ గూరిననాటి దుష్ఫలమె యప్పా! నీకునుద్రేకముల్
కలకంఠిన్-జెఱపట్టినావు కపియొక్కండింత గావించె సం
చలనంబున్ గొనె రాజ్యలక్ష్మి వ్యసనోత్సాహ క్రియాదార్ఢ్యచా
పలమున్ గూరిననాటి దుష్ఫలమె యప్పా! నేటి యీ దుర్గతుల్

శ్రీ కాశీభొట్ల సుబ్రహ్మణ్య శర్మ - నర్సాపురం

"స్రవించున్ శిలనుండి యయ్యమృతమత్యంతంబు చోద్యంబుగన్
సృస్రునానొప్పెడి రెండు ధాతువులు వేర్వేరర్థముల్ పొందునం
దుస్రవంబున్ సరణంబునాబఱగునెందున్ జెందునీవాదు పూ
లస్రజంబందుమరంద బిందువుల లీలన్ జూడుమా'ర్యాలి'యం
ద స్రవించున్ శిలనుండి యయ్యమృతమత్యంతంబు చోద్యంబుగన్

శ్రీమాన్ పి.టి.జి.వి రంగాచార్యులు - శ్రీ కాకుళం (సంస్కృతం)

"చోరం ప్రార్థితుమిచ్ఛతీహ సుజనఃసర్వాత్మనా కింవిభో!"
గోపీ మానస కోశజాల విషయే పాటచ్చరో యఃపుమాన్
ధర్మస్థాపన తత్పరో మురహరో గోవర్ధనోద్ధారకః
మేఘ శ్యామల కాయకాంతి కలితస్తంయోగి బృందోరు హృద్
చోరం ప్రార్థితుమిచ్ఛతీహ సుజనః సర్వాత్మనా కింవిభో!

శ్రీ చిలకమర్తి సుబ్రహ్మణ్యశాస్త్రి - నరసాపురం

"జయగర్వంబున విఱ్ఱవీగదగునా?సైరింపు నారాయణా!
నయదూరంబగు లోకమున్ గనిన విన్నాణమ్ముగోల్పోవు ని
ర్భయతన్ గోమలి వేచుచున్నదిసుమీ! ప్రజ్ఞానులే గుండగన్
రయమున్ జూపుమ!చర్యతీసికొనుమా! రాష్ట్రేందిరావల్లభా
జయ గర్వంబున విఱ్ఱవీగతగునా! సైరింపు నారాయణా!

శ్రీ భాగవతుల లక్ష్మీనరసింహం - నరసాపురం

"కుండను గొండ సొచ్చెనిదిగో!యని పల్కెను విస్మయంబుగన్"
అండజయానా! నీవలపునంటిన కాంతులుమింటినంటెను
ద్దండతరమ్ముగా జదలనంటెడి శీతనగాత్మజాండు దా
నుండెను వార్థి వజ్రిభయమొందుచు నేటికి గూడసైకి రా
కుండను గొండ సొచ్చెనిదిగో!యనిపల్కెను విస్మయంబుగన్

శ్రీ ఎం. పి. జానుకవి - విజయవాడ

"వాడినవాడె వీరరస వాహినులం గెలువంగ జాలెడిన్"
పోడిమి జూపి శాత్రవుల మూకలపైనెదురొడ్డి నిల్చి పో
రాడెడు వాడె వీరుడనునట్టిది నేటిది గాని మాట చి
వ్వాడగ యుద్ధనీతి యణువంతయు లేదణుబాంబులెల్లెడన్
వాడినవాడె వీరరస వాహినులం గెలువంగ జాలెడిన్

శ్రీ బి. థియోడర్ - నరసాపురం

"గంధమ్మున్ విరజిమ్ము ముక్కుపుటముల్ బాధించు ముప్రొద్దులన్
అంధీభూతము పాలనాపటిమ యయ్యాసీమలందుండె,గ
ర్వాంధుల్ రాజ్యము సేయుచుండునెడ(బూజ్యమ్మయ్యె శ్రేయమ్ము ని
ర్బంధమ్మయ్యెను మానవత్వమికనౌరా! యప్రజాస్వామ్య దు
ర్గంధంబున్ విరజిమ్ము ముక్కుపుటముల్ బాధించు ముప్రొద్దులన్

శ్రీ ధూళిపాల అర్కసోమయాజి - లంకల కోడేరు (సంస్కృతం)

"నిశాభాత్యర్కస్య ద్యుతిభిరహహ క్షాంత తమసా!"
వివేకానందోయం మునిమృగపతిర్హిందవ వనే
చికాగో దేశేపి స్వమత విషయే గర్జన రతః
సమాయాతే తస్మిన్ పునరపి ముదా స్త్రైణవదనే
నిశాభాత్యర్కస్య ద్యుతిభిరహహ క్షాంత తమసా॥
(నిశా = హరిద్రా)

శ్రీ పులఖండం సూర్యారావు - చినమామిడిపల్లి

"ప్రవరుని జూచి భీతిమెయిఁబాతె వరూథిని వీత మోహయై"
అవిరత దైవతార్చనమునందె రమించునుగాని సర్వశా
త్రవగణ భీకరుండయిన దక్షుడు పార్థుడు గోగణమ్ము కౌ
రవ గణమంటువేళ సమరమ్మున నిల్చిన నాటి క్షత్రియ
ప్రవరుని జూచి భీతిమెయిఁబాతెవరూథిని వీత మోహయై
(వరూధిని = సేన)

శ్రీ కూరెళ్ళ అనంతరామయ్య - మొగల్తూరు

"ఒకరా!యిద్దర!ముగ్గురా!నలుగురా! యూహింపనింకెందరో"
ఒకడా!వ్యాకరణాంబుజాత రవియై యొప్పారునిచ్చోట: వే
రొకడా!తర్కపయోధి జాత విధుడై యొప్పారునిప్పాటనిం
కొకడా! సత్కవి కల్పకద్రుమముగానొప్పారు మా ప్రాంతమం
దొకరా! యిద్దర! ముగ్గురా! నలుగురా! యూహింపనింకెందరో

## దత్తపదులు

శ్రీ కోట్ల లక్ష్మీనరసింహం - పంగిడిగూడెం

"1 లాకట్టు 2. జాకట్టు 3. బ్రాకట్టు 4 తాకట్టు "
(బిల్వమంగళుని పరంగా)
రసవారాశిని మున్గిపోవుటకునే'లా! కట్టు'బాటంచు సా
రసనేత్రా! నను నీవు నిక్కముగ కో'బ్రాకట్ట'డిన్ జేసితే!
పసిలేనట్టిది నీదు చేష్ట హరపూ'జా! కట్టు'మా మన్మథున్
మసలంగావలె గామవైభవముతో మత్తిల్లి 'తాకట్ట'గున్

శ్రీమతి కోట ద్యుమణి - తణుకు

"1. కత్తి 2. ఎత్తి 3. నెత్తి 4 మొత్తి"
(సీతారాముల దాంపత్యం)
చీకా'కత్తి'న గానీ
యేకరణిని'నెత్తి'నారలీ భారమ్మున్
సాకల్యముగా 'నెత్తి'ని
బ్రాకటభర'మొత్తి'నపుడె పండునా! వలపుల్!

శ్రీ గొర్తి కామశాస్త్రి - తణుకు

"(సమర్థుడైన అవధాని) 1.కడి 2.గడి 3.వడి 4.ముడి"

కడిమిగలవాడు గావున
గడితేరినవాడు గాన గైతలు వలుకన్
వడివడిగా నడయాడును
ముడివడ ప్రేక్షకుల డెందములు కొల్లలుగా

శ్రీ జి.వి.ఎస్. సుబ్రహ్మణ్యం - పెనుగొండ

"రాగము, రోగము, భోగము, భాగము (భాగవత పరంగా)"

రాగము గోపికలకునిడె
రోగములకునౌషధముగ రూఢిగ గీతా
భాగమ్మిడెనది గ్రోలిన
భోగములే దక్క దుఃఖ భోజనమున్నే!

శ్రీ ఎ. సోమయాజులు - అనకాపల్లి (సంస్కృతం)

"1.పయః 2.చోరః 3.మృషా 4. సుధా (భారతం (కృష్ణః))"

శ్రీ కృష్ణేన మహాత్మనా రణతలే దత్తంహి గీతాపయః
సోయంచోర ఇతి ప్రసిద్ధ విషయో భక్త్యాంస్థితా చోరతా
జారోజార ఇతి ప్రసిద్ధ విషయస్సత్యం మృషా జీవికా
కాంతాచేత్ పురుషో మురారిరితి తం సంప్రార్ధయే వాక్సుధాం

శ్రీ ఎ. సీతారామాంజనేయ మూర్తి - నరసాపురం

"1. మైమ్ 2.క్రైమ్ 3. లైమ్ 4. టైమ్ (రామాయణం)"

మైమురిపించునట్టిదసమానము నీ తను కాంతి సీత! చ
క్రైమమునెత్తివచ్చిననునాలమునందున నిల్వలేడు వే
టై మహి గూలు దథ్యమిది యంచు వచించెడి యాతుధాను పా
లైమరణింతునో! కడకునార్యునిజేరి, సుఖింతునో! విధీ!

డా॥ రంకిరెడ్డి రామమోహనరావు - పెనుగొండ

"కడియం, అత్తిలి, ఏడిద, ఏలూరు (భారతంపై)"

'కడియమ్మె'యరిసేన చుట్టెనిట వీకన్ జూపుమాయంచు క
వ్వడికిన్ హెచ్చరికల్ ఘటిల్లెనట యెవ్వా'డేడి ద'ంభమ్ముచూ
పెడివాడుండునె 'యత్తి లి'ంగమెదలో వీరాళి 'యేలూరు'నే
మడియంజేసెదనంచు సాగెననికిన్ మార్తాండతేజస్వియై

శ్రీ సూరంపూడి వేంకటరమణ - తాడేపల్లిగూడెం

"రాశి, సౌందర్య, సంఘువి, అంజలి (కల్లోల కాశ్మీరం గురించి)"

'రాశీ'భూత సమస్త ముష్కరుల బోరం గూల్చి కాశ్మీరమున్
మాసొంతమ్మని చాటుకోవలయునమ్మా నీదు 'సౌందర్య'మున్
గాసింబొందునె 'యంజలిం'చెద జూమీ గాఢమ్ముగా 'సంఘు వి'
శ్వాసమ్మున్ బొనరింప మాత్రతము శుంభల్లీల దీపించెడిన్

శ్రీ కాకరపర్తి దుర్గా ప్రసాద్ - ఈతకోట

"రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమ (దేవలోకంలో ఎన్నికలు ఇంద్రుని స్థితి)"

ప్రారంభంబగుచుండెనెన్నికలు స్వర్గమ్మందు ప్రారబ్ధమై
సారోదార! తిలోత్తమా! తగునటే స్వారాజ్యమే నీది రం
భోరూమేనక! యూర్వశీ! విడువుడీ మోమోటలన్ వీడిమీ
కై రాసిక్యమునందునెన్నికలు లేవా యున్నచో గెల్వరా!

డా॥ పి.బి. ఆదికేశవ స్వామి - పెనుగొండ (సంస్కృతం)

"సంభారః,గంభీరా, రంభోరూ, దంభోళిః (అవధాన వైశిష్ట్యమ్)"

శాస్త్రార్థ జ్ఞాన సంభారః
దంభోళిః కవి పాండితీ
గంభీరావర్తనాభిశ్చేత్
రంభోరూ భాతి భారతీ !

చిట్టావూరి ఆంజనేయశర్మ - సత్యవాడ

"వింత, చెంత, పొంత, గంత (కలౌ వేంకటనాయకః)"
వేంకటేశ్వరుడే వీడు వింతగాదు
చెంత నిలిచెనా శుభములనంతములట
ధర్మముల పొంత నిల్పెడి దైవతమ్ము
మాదు కనులకు గంతయై మసలు మాయ

చిట్టావూరి సూర్యనారాయణమూర్తి - ఆకివీడు

"చౌర్యము, శౌర్యము, వీర్యము, కార్యము"
(శూర్పణఖ ముక్కు చెవులు కోయుట)

శౌర్యమునకిక్క యయ్యును చానయనక
ముక్కుచెవి గోయు గార్యమ్ము బూనెనేల
వీర్యమునకిది ధర్మమా! పిటికితనమ
యనుచు రావణుడాడి చౌర్యమునకుటికె

శ్రీ పామర్తి రామారావు - మడికి

"మధునాపంతుల, చెరువు, రావూరి, విశ్వనాథ (ఆశీస్సులిడుట)"

మధునాపంతులవారి జాను తెనుగే మాడెందమందుండు స్వ
ర్గధునీధోరణి విశ్వనాథ కవితా కంజాతమందుండు స
న్నిధి రావూరికి భారతీసతి పదానీకమ్ము నర్తించునం
బుధియే యచ్చెరువయ్యెనేమొ ననునామోదించి దీవింపరే

శ్రీ కొప్పిశెట్టి నాగభూషణ కవి - తాళ్ళరేవు

"నగరు, పొగరు, తగరు, పగరు (భాగవతార్థం)"

నగరుబో గోపబాలుడే నాథుడన్న
పగరు తోడుత వియ్యమ్ము భావ్యమగునె
తగరు మాతోడనని రుక్మివగచుచుండ
పొగరునన్ వచ్చి యెత్తుకపోయె విభుడు

శ్రీ మల్లంపల్లి ఏకోరామసిద్ధుడు - నరసాపురం (సంస్కృతం)

"గంగా, కృష్ణా, కావేరీ, గౌతమీ (భగవత్కృపావైభవం)"

పరమేశకృపా గంగా
కృష్ణాంఘ్రి వర సంభవా
కావేరీ గౌతమీ చైతా:
లోక రక్షణ తత్పరా:

శ్రీ సుంకర వెంకట్రామయ్య - కామయ్యపాలెం

"హరి, గిరి, వరి, సరి (హరిశ్చంద్ర వర్ణన)"

సరి లేరెవ్వరు వానికెయ్యెడలనే సత్యంబు వాక్రుచ్చుచో
హరి యేవచ్చిన యడ్డువెట్టినను రాజ్య భ్రష్టుడై పోయినన్
గిరిరాజమ్ములు దిద్దిరం దిరిగినన్ క్రీడార్థమైయేని వె
వ్వరితోనేని యసత్యమాడెనటవే! భద్రంకరుండాతడే!

శ్రీ వి. లక్ష్మీప్రసన్న - మేడపాడు

"తెలుగు, వెలుగు, జిలుగు, పలుగు (విశ్వనాథపరంగా)"

తెలుగుబాసకు సరిక్రొత్త జిలుగు దెచ్చె
వేయి వెలుగులతో దాను వెలిగినాడు
పలు గురూత్తములన్ గొల్చి పండెనేమొ
విశ్వనాథుడో భారతీ విశ్వమయుడు!

శ్రీ పోచనపెద్ది రంగనాథం - ఆచంట

"మార్చి, జనవరి, జూలై, మే (రామాయణపరంగా)"

'జనవరిష్ఠ'డు శ్రీరామచంద్రమూర్తి
'మే'లు గూర్చుట వ్రతముగా మెలగినాడు
మహిని రాక్షసులం బరి'మార్చి'నాడు
సూర్యవంశపు 'జూలయి' శోభలీనె

శ్రీమతి టి. కృష్ణవేణి - నరసాపురం

"జడి, దడి, మడి, సడి (అవధానం చూస్తున్న బడిపిల్లల మనస్థితి)"

జడివానవోలె కైతలు
మడిజల్లిన విత్తులవలె మధురిమనెసగెన్
సడి మాత్రము చేయగరా
దడిగినదే తడవు పద్యమందుట చేతన్

శ్రీమతి కె. వరలక్ష్మి - నరసాపురం (సంస్కృతం)

"లలితా, వనితా, కవితా, సవితా (సీతమనస్సు)"

లలితా రామ చంద్రస్య
వనితా శోకపీడితా
కవితానాయికా భూత్వా
సవితైవ ప్రకాశతే!

శ్రీ దేవరకొండ కృష్ణమూర్తి (నీతి ప్రాశస్త్యం)

"తాత, వ్రాత, నీతి, ప్రీతి"

తాతలు నేతులు త్రాగిరి
వ్రాతలు మున్నీటిపైని వ్రాయంబడియెన్
నీతిగ మసలిననాడే
ప్రీతి జనించును ధనమ్ము విలువనొసగునా?

శ్రీమతి యం. వరలక్ష్మి - నరసాపురం

"హలో, సారు, ఛలో, జోరు (ప్రహ్లాదుని పరంగా)"

ఊహలోనైన బాలునకుండ దగునె
తండ్రివే'సారు' గాక పంతమ్ము విడడు
అ'ఛ్చలో'కమ్ము చేరుటే యతని దృష్టి
విష్ణుపూ'జోరు' శీలుడై వెలిగినాడు

శ్రీ మంకు శ్రీను - కొప్పర్రు

"చెంగు, పొంగు, హంగు, రంగు"

(అవకాశవాద రాజకీయనాయకుల పరంగా)

'చెంగు' చెంగున దుమికెడు శ్రేష్ఠులార
'పొంగు'మీకేల ప్రజయింక బుద్ధిసెప్పు
అర్హతలు లేక యేదొ యూహంగురించి
బ్రతుకుచున్నారు బ్రతుకు హొరంగుకాదు

శ్రీ చెన్నాప్రగడ నరసింహమూర్తి - నరసాపురం

"హరి, హర, కర, నర (శ్రీ కృష్ణుడు)"

లీలామానుషవిగ్రహుండు 'హరి' దోర్లీలన్ ప్రపంచించి,ర
క్షోలాస్యమ్ములడంచినాడు 'నర'కున్ క్షోభిల్లగాజేసెనే
వోలీలల్ పచరించి వస్త్ర 'హర'ణోద్యోగమ్ముగావించె యిం
కేలా కిం'కర'తన్ ఘటించెదను స్వామీ! నన్ను రక్షింపవే!

శ్రీ చామర్తి రత్నాజీ - నరసాపురం

"ప్రమాద, ప్రమోద, సుస్మిత, విస్మితః (సంస్కృతం)"

ప్రమాదో ధర్మరాజస్య
ప్రమోదః కురుభూపతేః
సుస్మితో నయ దూరశ్చేత్
విస్మితో నయ మార్గగః

శ్రీ దువ్వూరి రామమూర్తి - నరసాపురం

"వారణ, తారణ, కారణ, దారుణ (ఎయిడ్స్ వ్యాధి)"

వ్యాధి నివారణ శక్తిని
సాధింపగ తారణమ్ము సంయమనంబే
బాధల కారణమెయ్యది
ఈ ధరణిని దారుణమ్ములింద్రియ సుఖముల్

శ్రీ గొర్తి సత్యనారాయణ - నరసాపురం

"సంస్కృతం, ఆంధ్ర, ఆంగ్ల (భాషాసమైక్యం)"

సంస్కృతాంధ్రములందు విస్తారమైన
గరిమ చూపించువేళ యాంగ్లమ్ముకూడ
వచ్చి పడెనేని దప్పును బట్టబోకు
భారతీమయమ్ములె గదా! బాసలెల్ల

# వర్ణనలు

శ్రీ కొప్పర్తి రాంబాబు - నరసాపురం

"వర్ణనం : అవధానం చూస్తున్న ప్రేక్షకుల మానసిక స్థితి"

అవధాని పద్యరాశిని
వ్యవధానము లేక పలు వైఖరి చూడన్
సవనమ్మా! శ్రీ వాణీ
భవనమ్మాయనుచు రిత్తవడుదురు జనులున్

శ్రీమతి మాధవీలత - ఏలూరు

"వర్ణనం : ఎన్నికల్లో గెలిచినవారు పడేబాధ"

పుట్టినప్పుడే యేడుపు మొదలుపెట్టి
ఇప్పుడేడ్చినచో లాభమేమి చెపుమ
ఓడిపోయిన వారల గోడుసుంత
గెలిచి ఏడ్చుటే లోకాన గలుగువింత

కంభంపాటి కనకరత్నం - ఆకివీడు

"వర్ణనం: కరుణానిధి అంతర్మథనం"

అధికారాంతమునందు వేచెదవటే ఆర్యామణీ నన్ను ని
ర్మథనంబున్ బొనరింతు నిన్ననుచు గోలంబెట్టి గీపెట్టి, యం
బుధులే పొంగినయంత యేడ్చునె కదా పూర్ణాయువైయుండి సా
రథి దైవమ్మని యెంచు వారలకునేలా నొచ్చుటల్ మెచ్చుటల్

శ్రీమతి కె. సత్య - కాకినాడ

"వర్ణనం: శిష్యవైభవం - గురుచిత్తం"

అందముగా పదబంధములన్ హృదయంగమ రీతిని బల్కినచో
సుందర భావములన్ నడిపించిన జొక్కవె గుండెలునొజ్జలకున్
చిందులు వేసెడు గుట్టులు నేడిట జెప్పుచునుండగ బద్యములన్
సుందర మందిరమైనది నా యెద సూనృతమియ్యది నమ్మగదే!

శ్రీశిష్టి లక్ష్మీ నారాయణ శర్మ - నరసాపురం (సంస్కృతం)

"వర్ణనం: వైతరణి గంగలో కలిస్తే గంగభావం"

నిత్య పూతా నదీ గంగా
కిమర్థం భీతిమేష్యతి
సార్వకాలిక పావిత్ర్యం
కథం వైతరణీ హరేత్!

శ్రీమతి కె. సత్యవాణి - రాజమండ్రి

"వర్ణనం: కాశ్మీరు సమస్య"

మాకాశ్మీరము దోచువాడెవడురా మధ్యందినార్కాంశువుల్
సాకల్యంబుగ బట్టువాడెవడురా!శాంతిన్ ప్రబోధించు మ
మ్మే కవ్వించెడి దుండగీడెవడురా!మిన్నేటి పద్మమ్మునే
గైకోజూచెడి గున్నయేనుగునకున్ గావోపగల్ ధ్వాంతముల్

శ్రీమతి వి. శేషారత్నం - లంకలకోడేరు

"వర్ణనం: తెలుగు గంగ మానసిక స్థితి"
ఆరంభశూరులివ్విధి
సారించిరి నన్ను బిదప శమితను జేయన్
సారతర వాహిని యనుచు
సారెకు సారెకుననీ యసత్యములేలా!

శ్రీ చల్లా నాగేశ్వర శాస్త్రి

"వర్ణనం: కార్గిల్ యుద్ధవీరుల శౌర్యం"
కారాల్ నూరుచు నూరుచున్ మిరియముల్ గాండ్రించి తీండ్రించుచున్
సారోదారత విక్రమించునెడలన్ శౌర్యాగ్నిలో గాలవే
ఔరా! యీ శలభమ్ములంచు రణవిద్యా ప్రౌఢి చూపించి భూ
మీరాకేందులు మేనులప్పనముగా మేల్కొల్పరే జాతినిన్

శ్రీ ఎస్. జి. సోమయాజులు

"వర్ణనం: కృష్ణాష్టమీ సంరంభం"
పట్టునమట్టి సంబరము బల్లెను బల్లెను సాగుచుండ గ
న్పట్టెడి యంద చందముల పట్టులెఱుంగని వాడు మర్త్యుడే
అట్టిటు పిల్లయాటలననునాడుటలో పరమార్థమెంతయో
గుట్టుగ చెప్పినాడుగద గోవరివస్యయు వ్యాజమే గదా!

శ్రీ మల్లంపల్లి అమరేశ్వరప్రసాద్ - కాకినాడ (సంస్కృతం)

"వర్ణనం: గోపాలకృష్ణమాచార్యులవారి నామములగురించి"
గోపాలకృష్ణమార్యస్య
త్రిదళం తిలకం హృది
శోభతే కవితాం దాతుం
గురూణాం తిలకాయతే!

శ్రీ సోమంచి శ్రీనివాసశాస్త్రి - పోడూరు

"వర్ణనం: ఈశ్వర - శనీశ్వర భేదం"
శని పీడించినచోనీ
శునినభిషేకింపలయు శూలియ పూనన్
శనులెంతమంది వచ్చిన
మనకున్ గష్టమ్ము లేశమాత్రమొసగునే!

శ్రీ చదువుల సుబ్రహ్మణ్యం - పెనుగొండ

"వర్ణనం: విశ్వరూప సందర్శనం"
శ్రీ కృష్ణ విశ్వరూపము
సాకల్యముకాగ సృష్టి సందర్శనమే
యా కమ్మని రూపమ్మును
గైకొమ్మని పలుకువాడె ఘనగురుడు గదా!

శ్రీ వి.కె. సత్యనారాయణ - పాలకొల్లు

"వర్ణనం: మహాకాళి, మహాలక్ష్మి మహా సరస్వతి"

కాళియు లక్ష్మి సరస్వతి
హేలగ పద్యములయందునిమిడిరొయేమో
ఫాలము మోడ్చి నమస్కృతి
జాలమ్మునొసంగి ధన్య జన్మడనగుదున్

శ్రీ సి.వి.వి. సత్యనారాయణ - దొడ్డిపట్ల

"వర్ణనం: వై.యన్. కళాశాల - ఆడిటోరియం"

వరమే మానరసాపురంబునకు శ్రీ వైయన్ కళాశాల మం
దిరమే యీ యరబిందు వేదిపయినిన్ దీక్షా వియద్దీపమై
చరణంబూనినవాడు విశ్వమునకే సంతోషణ శ్రీరమా
చరణంబున్ కలిగించు మేటియగుచున్ సౌభాగ్యముల్ పొందడే

శ్రీ రాయప్రోలు సీతారామశర్మ - భీమవరం (సంస్కృతం)

"వర్ణనం: శిశుసంక్షేమశాఖ పాత్ర"

సంక్షేమ క్షామతా జాతా
శిశూనాం విక్రయాంగణే
యాదృశీ జాయతే బుద్ధిః
జాయతే తాదృశీగతిః

శ్రీమతి అయ్యగారి శ్రీదేవి - నరసాపురం

"వర్ణనం: శ్రావణమాస సంరంభం"

పట్టు చీరలు వీధి వీధిని బండుగే కనుదోయికిన్
గట్టుబాటులు తెల్గు వాకిట గమ్మనై యెద లోతులన్
జట్టు గట్టుచు జానలెల్లరు సాగుచుండిన దారిలో
ముట్టుచుండును మేఘనాథుడు ముద్దులన్ జిలికించుచున్

శ్రీ కనుమూరి

"వర్ణనం: అక్షరాస్యత"

అక్షరాస్యత అక్షరాస్యత అక్షరాస్యత యందుమా
శిక్షయేగద శిక్షయేగద శిక్షయేగద యందుమా
కక్షనూని ప్రభుత్వమియ్యది కల్గజేసినదందుమా
శిక్షకాదది కక్షకాదది చెప్ప సత్యము రక్షయే

శ్రీమతి కె. మీనాక్షి - నర్సాపురం

"వర్ణనం: కార్యకర్తల శ్రమ"

తిండి తినుటకు వీలైన బండుగాయె
అలితోడుత ముచ్చటలాగిపోయె
పాలకోసమ్మెగద రాల బరువు గొనుట
కార్యకర్తల కష్టమ్ము కవితకొఱకు

శ్రీమతి చక్రవర్తుల సీతారామలక్ష్మి - నర్సాపురం

"వర్ణనం: " అవధాన సముద్రంలో లభించు ముత్యాల రత్నాల వలన కలుగు ఆనందం"

అవధాన జలధియందున
సువిమల రత్నములు దొరకు సుమ్మా! కొమ్మా
ఇవి వెలలేనివి గావున
నవమతి సేయంగబోకుమార్యామణిరో!

డా॥ కేశాప్రగడ సత్యనారాయణ - అవధాని - కిర్లంపూడి

"వర్ణనం: సంస్కృతభాషా ప్రాశస్త్యం"

భాషాణాం జననీ సదా శివకరీ గీర్వాణ వాగీశ్వరీ
వల్మీకోద్భవ బాదరాయణ గణోద్భూతా రసప్లావితా
ధర్మజ్ఞాన సుధామనోజ్ఞ లహరీ శ్రీకాళిదాసాదృతా
శ్రీవాణింప్రణమామి నిత్యమతులామానంద సంపూర్తయే

శ్రీమతి కె. వసుంధర - నరసాపురం

"వర్ణనం: కుమారునకు ఉరిశిక్ష విధించిన న్యాయమూర్తి"

న్యాయ దేవత గాంధారినాగ నిలిచె
గుండె బండయై యా న్యాయ పండితుండు
కొడుకునకు గూడ యురిశిక్ష గూర్చినాడు
ధర్మమునకిల పక్షపాతమ్ము గలదె

శ్రీ గోటేటి విశ్వేశ్వరరావు - నరసాపురం

"వర్ణనం: అద్దింటి వారి అగచాట్లు"

అద్దెయింటనునత్తయింటమునందునా సుఖసౌఖ్యముల్
సుద్దులాడిన దప్పువట్టును సుద్దులాడమి దప్పగున్
ముద్దుసేయును ప్రేమగల్గిన మొట్టివేయు క్షణమ్ములో
నద్ది యుద్దనరాదు జీవితమట్టిదే గద మిత్రమా!

శ్రీ కె. ఆర్. కె. మురళి, నరసాపురం

"వర్ణనం: స్వర్ణాంధ్ర ప్రదేశ్"

స్వర సంధాన వధాన మాధురులలో స్వర్గంబులే స్వర్ణముల్
పరుగెత్తన్‌వలె దేశమిప్పిదినదే స్వర్ణాంధ్రమై వెల్గు సం
బరమై పేదలు పెద్దవారయినచో భద్రంకరంబైన సం
స్కరణంబున్ దలయూచి మెచ్చుకొనుచో సౌభాగ్యముల్ కల్గెడిన్

శ్రీమతి బిహెచ్. రమాదేవి - పట్టిసీమ

"వర్ణనం: అవధానానంతరం సత్కారం చేయకపోతే"

అవధానాంతమునందు సత్కృతులు నాకాకాశ పుష్పంబులై
సవనాంతంబున నీటి లేమి యగుచో స్వాంతమ్ము కుందిల్లునే
కవితాలక్ష్మి వరించి వచ్చినది లౌక్యంబైన సంపత్తికై
యవలోకింతునె యాశచెందుదునె తానై వచ్చుచో గొంటయే

శ్రీ కంభంపాటి కామేశ్వరశర్మ - పాలకొల్లు (సంస్కృతం)

"వర్ణనం: వృషనామవత్సరం - వర్షాభావం"

వత్సరేస్మిన్ వృషాభిఖ్యే వర్షాభావః ప్రవర్తతే
కవితా వేదికాయాంతు హర్షాభావో నవర్తతే

శ్రీ డి.వి. వేంకటరమణ

"వర్ణనం: చికాగోలో వివేకానందుడు"

ఔరా! భారత ధర్మ పీఠమునకే యాపత్తి కల్గించు వా
రేరీ? రండిటు రండు రండనుచు గర్జించెన్ చికాగోసభన్
పారావార గభీరుడై స్వమత సంభారావన ద్రష్టయై
యారూఢిన్ గొనినాడు నిక్కము వివేకానందుడానందియే

శ్రీ పెద్దింటి దత్తాత్రేయ దీక్షితులు - నరసాపురం

"వర్ణనం: ఆషాఢామావాస్యనాటి పెండ్లి కొడుకు భావన"

ఆనందంబునకడ్డు వెట్టితిగదే యాషాఢమా! పొమ్మికన్
ధ్యానంబైనది మాసమెల్లనిక సంధానింతు మత్ప్రేమమున్
నేనున్ దానుగనుంటిమింతదనుకన్ నేదాను దానేనుగా
ప్రాణిన్ గానుకనిత్తు దేశమునకున్ వర్ధిల్లుమా! ఆంధ్రమా!

శ్రీ కన్నా రామారావు - లక్ష్మణేశ్వరం

వర్ణనం: అవధానంలో ఆనందానుభూతి (ఆశువు)

తిరుపతి వేంకటేశ కవిధీరులు మెట్టినచోట మెట్టి సుం
దరతర సత్కవిత్వముల దారులలో పయనించి మించి సం
బరపడిపోవుచుంటి రసవైభవముండిన వారిదేకదా
అరకొరలొండు రెండు కలవా యవి నాయవియే గ్రహింపుడీ!

(ఆశువు) టేలర్ హైస్కూలుపై
ఎందరోపండితులను బోధించుచుండె
ఎందరో పండితులను బుట్టించుచుండె
దనరుగావుతమాచంద్రతారకముగ
టేలరున్నత పాఠశాలాలలామ

డా॥ కొప్పర్తి వేణుగోపాలరావు, యం.డి. మున్సిపల్ చైర్మన్, నర్సాపురం (ఆశువు)

వర్ణనం: జానకి, తాటకి, మేనక వారి జాతికి మనోధర్మానికి వైరుధ్యం

జానకి క్షత్రియాంగనయు సత్యమయోనిజగా జనించెనౌ
రా!నయదూరతాటికియు బ్రాహ్మణియయ్యును రాక్షసీత్వమున్
బూనెను మేనకా విషయమోయది సంద్రమునుండిలేచె డెం
దానవయమ్మ నిల్వవలె ధర్మము జాతినినాశ్రయించునే!

# జంటకవుల శతావధానం

## తాడేపల్లిగూడెం

సమర్పణ
యిస్ తుమ్మలపల్లి వేంకటేశ్వరరావు



వృత్తి వాణిజ్యం
ప్రవృత్తి రాజకీయం
చిత్తం సాహిత్యం
మంచి ఆలోచనల ప్రోవు
తుమ్మలపల్లి వేంకటేశ్వరరావు

**నవంబరు 9, 10, - 2002**

**అవధానులు: కడిమిళ్ళకోట కవులు**

**సంచాలకులు: డా॥ ధూళిపాళ మహాదేవమణి**

**నిర్వహణ: తెలుగు సాహితీ సమాఖ్య**

మరియు

**అవధానభోజ శ్రీ వడ్డి శ్యామసుందరరావు**

సమాఖ్య అధ్యక్షులు

**నెమ్మలూరి సత్యనారాయణమూర్తి**

కార్యదర్శి

**కొత్తపల్లి ఉదయబాబు**

మరియు ప్రధానసూత్రధారులు

**భారతం శ్రీమన్నారాయణ, ఆకాశం అప్పల నరసింహమూర్తి**

# అవతరణిక

1. తిరుపతి వేంకటేశ కవిధీరుల జంట శతావధాన మం
దిరముననవర్చకత్వమును దీరుగ చేయగ వచ్చినాము సం
బరమున, దత్కృపాజనిత వర్షమునందఘమర్షణ క్రియా
సరణిని నేర్చుకొందుము యశః పరిపూత కవిత్వ సిద్ధికిన్

2. ఘనతన్ గాంచిన సత్కవీశులకు సత్కారంబు గావించుటే
తన లక్ష్యమ్ముగ నిచ్చలున్ వెలయ జేతఃప్రీతి నిండార బం
డిన 'సాహిత్య సమాఖ్య' ముచ్చటను తాడేపల్లి గూడెమ్మునం
దున మా జంట శతావధానమను విందున్ ముందు వడ్డించెగా

3. ఒకచరణంబు మాగురుని యొంకృతితో మొదలౌను వెంటనిం
కొక చరణంబు కోట సమయోచిత రీతిని బల్కి కుల్కనీ
సకల శతావధానమిట జంటగ జేయగ వచ్చినాము మీ
రకలుషవృత్తి మాపయినినాశిషముల్ గురిపించుడీ దయన్

4. అవధానమ్మను జేయగా గలుగు వారాంధ్రమ్మునందెందరో
అవధానమ్మను మాధవీ లతకు నీరందించు వారేరి బాం
ధవుడై సత్కవినిచ్చమెచ్చుకొని కైతం దూచి పోషించు వా
రెవరయ్యా! యొక శ్యామ సుందరుడె మాకీనాటికేనాటికిన్

5. సతితో గూడి కవిత్వ సంగతులనాస్వాదింపగా హెచ్చు సం
స్కృతి జూపించిన నాయకోత్తముని సంకీర్తింతుమెవ్వేళ భా
రతికిన్ ముద్దల బిడ్డడై వెలయు 'ఎల్లా' వంశ ముక్తామణిన్
నతిపుష్పమ్ముల పూజ సేసెదమిటన్ నారాయణ స్వామినిన్

6. శ్రీవిభవమ్ముతో గవన సేవధివై యటు పాణినీయ సం
భావనలోన శేముషిని బట్టుగ నిల్పిన జాణవౌచు వి
ద్యావరివస్యయే హృదయ తత్త్వముగా బయనించు 'శ్రీమహా
దేవమణీ!' నమస్కృతులివే! జయశక్తినను గ్రహింపవే!

7. నెమ్మలూరి వంశ నీరధి యందున
చందమామవైన సత్యకీర్తి
పలుకులందు వెన్నెలలను వర్షింపుమా!
పక్షపాత రహిత వైభవమున

8. ఆకాశవు వంశమ్మున
కే కాంతులు నింపినాడవే జాబిలివై
మా, కైమోడ్పులు నరసిం
హా కైకో గదవటయ్య! యాదర మతివై

9. అవధానములయందు వ్యవహారములయందు
అనుభవాస్పదులైన మునులు గలరు
ప్రాపంచికాలోక పర్య వేక్షణలందు
వైభవాస్పదులైవ ప్రభులు గలరు
సాహిత్య సౌహిత్య సామ్రాజ్య నేతలై
మసలుచున్నట్టి తాపసులు గలరు
విద్యతోబాటుగా వినయ సంపదల సం
గతి బెంచుకొను బలహస్తులు గలరు
ఇందరున్నట్టి సభయందునేమునిలిచి
జంట శతవధానమ్మును సలుప బూని
వచ్చినారము దీవింప వలయునయ్య!
విజ్ఞమతులార! హితులార! పెద్దలార!

10. శ్రీరమ్య కీర్తి సాంద్రా!
భారత వంశాబ్ధి చంద్ర! భవ్య బుధేంద్రా!
చేరితిమి దరికి, శ్రీమ
న్నారాయణ! మాకు దీవెనమ్ములనిమ్మా!

11. సాహితీ సమాఖ్య సౌరు గాంచెడి రీతి
కార్యదర్శి యగుచు ఘనత జూపు
ఉదయబాబుగారి హృదయ సంపదముందు
సాగరమ్ము గూడ సన్నవోవు

12. జంటగ మా వధానము ప్రశస్త పథమ్మున సాగునట్లు మా
వెంటను నిల్చి శారద స్రవింపదె కైతల తేనె వాకలన్
బంటను నాది పల్కినది పద్యము గావలె గైత గావలెన్
మంటికి మింటికిన్ గవన మాధురి నిల్పుతనేక ధారయై॥

# సమస్యలు

సర్వశ్రీ పోచినపెద్ది సుబ్రహ్మణ్యం, అష్టావధాని-కాకినాడ

"పాలను వీడగా వలయు బండితులందఱు వృద్ధిపొందగన్"

హేలగ సత్కవిత్వము వచించెడి వేళల గోపమేల భా
షాలలితాంగికర్చనలు సల్పెడివేళల దాపమేల శ
బ్దాలను బూలుచేసి రసవత్కృతి చెప్పెడి వేళ గోప తా
పాలను, వీడగా వలయు బండితులందఱు వృద్ధి పొందగన్

మల్లంపల్లి అమరేశ్వరప్రసాద్, కాకినాడ

"చరణముతోడ భర్త పరిచర్యలొనర్చె లతాంగి వేడుకన్"

నిరతము గుండెయందున వినిర్మల భావము నింపుకున్న యా
సరసిజనేత్ర నాథునకు సంతసమున్ గలిగించుటొక్కటే
వరమనియెంచి ధార్మిక శుభంకర దృష్టిని నిత్య సత్క్రియా
చరణముతోడ భర్త పరిచర్యలొనర్చె లతాంగి వేడుకన్

మల్లంపల్లి ఏకోరామసిద్ధుడు, ఆచంట

"పురమును గాంచినన్ గలుగు బుణ్యము ముక్తియు మానవాళికిన్"

తరుగని భక్తి తోడనవధానతతో సిరికొండ జేరి శం
కరునకు వందనమ్ములిడి క్రమ మనస్కృత మంత్రరాజ సం
స్మరణము చేయుచున్ సతత సర్వ శుభంకరమైన శైవ 'గో
పురము'ను గాంచినన్ గలుగు బుణ్యము ముక్తియు మానవాళికిన్

గొల్లకోటి శ్రీనివాస్, మోడేకుర్రు

"రాముని రాక్షసాధములు రాముని జంపక యూరకుందురే"

ఏమని బల్కుచుంటివిట హేలగ నేటి సభాంతరాన స్వ
ర్భూమి వరించెనెవ్వని;నమోఘునకాతనికెవ్వరో యరుల్;
స్వామిగనిల్చెనెవ్వనిని బావని; ధర్మవిరోధులైన; సు
త్రాముని; రాక్ష సాధములు; రాముని; జంపక యూరకుందురే!
(క్రమాలంకారం)

కొండేపూడి రామకృష్ణ, గొల్లలమామిడాడ

"లంకకునేగె సీత రఘురాముని దోడ్కొని జింక కోసమై"

వంకలు బెట్టనేల గుణవైభవుడా రఘురామమూర్తి యే
ణాంకుని బోలు మోముగల యమ్మగదా మన భూమిజాత ని
శ్శంకగ బంక్తి కంధరుడు సాంపు ధర్మము గూల్చ మృత్యువై
లంకకునేగె సీత రఘురాముని దోడ్కొని జింకకోసమై

గొర్తి సత్యనారాయణమూర్తి, నరసాపురం

"రాముడు రంభగాంచి యనురాగమునొందె రసాంతరంగుడై"

కామితమెల్ల దీర్చగల గణ్యుడుగా సురరాజటన్న గా
రామును జూపుచున్ మరులు రాజిల జేసిరి నాట్యవిద్య నా
రామమునందునచ్చరలు రామలయందభిరామయౌట 'సు
త్రాముడు' రంభగాంచి యనురాగము నొందె రసాంతరంగుడై

డా॥ వి.వై.వి. సోమయాజులు, తణుకు

"వెన్నుని దన్నినాడు బలి వేడ్కను దేవతలెల్ల మెచ్చగన్"

అన్నువు దక్క యుద్ధములకక్కరలేక బలి ప్రభావమున్
మున్ను హరింపగోరుచును బొట్టి తనమ్మును బొందె జక్రి సం
పన్నుని చేయి క్రిందగుట మాన్యత రక్కసికే లభించెగా
వెన్నుని దన్నినాడు బలి వేడ్కను దేవతలెల్ల మెచ్చగన్

బి. ఆనంద్, కాకినాడ

"ఆరుమగోరి మూటికొఱకై పదకొండునకంగలార్చెడిన్"

చేరితిమయ్య విజ్ఞులను శ్రీగురుమూర్తులు చెంతనుండ; జ్యో
తీరమ యర్థమయ్యె దమతీరును విప్పెదమయ్య కన్యకన్
గోరి వివాహమాడెనట గూటికి వెంపరలాడ జొచ్చెగా
ఆరుమగోరి మూటికొఱకై పదకొండునకంగలార్చెడిన్
(మూడవరాశి మిథునం, ఆరవరాశి కన్య, పదకొండవ రాశి కుంభం)

అక్కిపెద్ది రామసూర్యనారాయణ, ఇరగవరం

"దారమునందు సంతత సుధా రస ధారలు జాలువారెడిన్"

సారతరమ్ముగా నిలుచు శాంకరికిన్ వరివస్య సేసి వి
స్తార కవిత్వ తత్వముల ఛాయలలో బయనించుచున్ రసా
సారము కాళిదాసకవి జాతికొసంగెను వాని కావ్య 'మం
దారము'నందు సంతత సుధా రస ధారలు జాలువారెడిన్

గొర్తి కామశాస్త్రి, తణుకు

"ముండను గొల్చుచుందురిల మోహము తీరిన వృద్ధులందరున్"

అండజయానయై వరలి యాశ్రిత రక్షణ దీక్షగాగ బ్ర
హ్మాండమునందు జీవులకునందరికిన్ సుఖ-శాంతులిచ్చుచున్
భండనమందు రక్కసుల ప్రాణములన్ హరియించునట్టి 'చా
ముండను గొల్చుచుందురిల మోహము తీరిన వృద్ధులందరున్

రామడుగు వేంకటేశ్వరశర్మ, గుంటూరు

"బ్రాలం గైకొను వేగమందు భువిలో బైచేయి మాదేకదా!"

లీలా మానుష విగ్రహోత్తముని పెండ్లిన్ జూచునవ్వేళ; ము
త్యాలన్ బళ్ళెరమందు బెట్టిరట కాంతారత్నముల్, వేడ్క సం
ద్రాలన్ దాటగ ముచ్చటించుకొనిరౌరా! పెండ్లియందున్ దలం
బ్రాలం గైకొను వేగమందు భువిలో బైచేయి మాదే కదా!

యం.వి. జగన్నాధరావు, తణుకు

"మశకము మశకమును గుట్టి మత్తిలి చచ్చెన్"

అసదృశమిది మీ భావము
విసుమానము గల్గజేసె విజ్ఞులకైనన్
విసమెయ్యది గైకొనెనో
మశకము మశకమును గుట్టి మత్తిలి చచ్చెన్

డా॥ కేసాప్రగడ సత్యనారాయణ, రాజమండ్రి

"స్వర్ణాంధ్రమ్మది మాకు వద్దనిరి విశ్వైక ప్రజా నాయకుల్"

కర్ణా కర్ణిక విన్నవారమిది నిక్కంబౌనె వాక్రుచ్చి; వ్యా
కీర్ణత్వమ్మును బాపుమయ్య ఋణమే ఖేదంబు; రాష్ట్రంబునే
యర్ణోరాశిని ముంచెదీవు ఋణమున్ యాచించి సాధించునా
స్వర్ణాంధ్రమ్మది మాకు వద్దనిరి విశ్వైక ప్రజానాయకుల్

వి. అన్నపూర్ణ, తణుకు

"బిన్లాడెన్ ప్రభవించినాడు భువిపై వేదోఘముల్ కావగన్"

అన్లోపమ్మును జేయలేమిచటనమ్మా! యన్నపూర్ణేశ్వరీ!
విన్లావణ్యవచో విలాసముల రాణింగాగ భావించుచో
ముల్లోకమ్మున లేని సత్యములనమ్మో! పల్కెదే! యెచ్చటన్
బిన్లాడెన్ ప్రభవించినాడు? భువిపై వేదోఘముల్ కావగన్

కూచిబొట్ల సీతారామశాస్త్రి, తణుకు

"దారము లేని హారమునుదారతనెవ్వరొసంగిరే సఖీ!"

ఆ రమణీయ వైభవమునచ్చట ముచ్చట పొందగోరి నిం
డారగ బూలదండనొకటల్లి సమర్పణ జేసెగాని; యీ
హారమునందు ముఖ్యమగునట్టిది పుష్పము లేక పోయె మం
దారము లేని హారమునుదారతనెవ్వరొసంగిరే! సఖీ!

శ్రీధర పార్వతీదేవి, టి.పి.గూడెం

"రాతికి మ్రొక్కుమోయి తగు రక్షణనిచ్చును నీకు నిత్యమున్"

భూతిని దాల్చు నిచ్చలు విభూతిని భక్తులకిచ్చి మెచ్చు సం
ప్రీతిని జూపు బత్తిరికి భీతిని బాపును మానవాళికిన్
జేతముతోడ బిల్చిన వసించును గుండెలయందు దత్పురా
రాతికి మ్రొక్కుమోయి తగు రక్షణనిచ్చును నీకు నిత్యమున్

భారతం శ్రీమన్నారాయణ, తాడేపల్లిగూడెం

"సంధ్యను చొసీతి బంధ సంగతి మేలొ"

వింధ్యను దాటిన వారలు
నాంధ్యమ్ముమను బాపునట్టి యర్కులు మీకా
వంధ్యాలోచన! యెవ్విది
సంధ్యను జొసీతి బంధ సంగతి మేలొ?

శ్రీధర సత్యవేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి, టి.పి.గూడెం

"మానిని బెండ్లియాడనవమానము దప్పదు పూరుషాళికిన్"

ఆనయాగారమో! నడకలందుననంచల రాచ ఠీవియో!
మానసమందు సంస్కృతియొ మానినియందున జూడగావలెన్
గానుక ముఖ్యమౌనటవొ! కట్నము మాత్రమె చూచి, మెచ్చుచున్
మానిని బెండ్లియాడనవమానము దప్పదు పూరుషాళికిన్

కళా సూర్యనారాయణ

"చీకటి తప్పు చేయుటకు జేరగ రమ్మనె బుత్రుడమ్మనే!"

వాకొన జెల్లునయ్య గుణవార్నిధి శ్రీనిధి మాతృమూర్తి న
ట్టాకట బెట్టినాడు గద న్యాయము వీడుచు పంక్తి కంఠుడా
పోకకు మృత్యుదేవతకు మూల్యము గట్టడె యెంతవింతయో
చీకటి తప్పు చేయుటకు జేరగరమ్మనె బుత్రుడమ్మనే!

చల్లా శ్రీరామచంద్రమూర్తి, విజయవాడ

"భక్తుల జూచి పరమాత్మ భగ్గున మండెన్"

వ్యక్తా వ్యక్తము తత్వము
త్యక్త సుఖులు గాని దానినందగలేరే
రక్తిని వీడని కుహనా
'భక్తుల జూచి పరమాత్మ భగ్గున మండెన్'

చామర్తి విశ్వనాథరావు, మలకపల్లి

"రాజుకు రాజుకున్ గలిగె రమ్యగుణుండొక పుత్రుడుద్ధతిన్"

రాజు పులిందరాజచట రాజు మహాత్ముడు విష్ణుమూర్తి; వి
భ్రాజిత మోహినీ విభవ భారము శంకరు మోహపుచ్చెనీ
రాజనమెత్తె బ్రేమకు ఫలమ్ముగ దివ్యముహూర్తమందునన్
రాజుకు రాజుకున్ గలిగె రమ్య గుణుండొక పుత్రుడుద్ధతిన్

పసల సూర్యచంద్రరావు, మలకపల్లి

"దైత్యుని రావణాసురుని ధర్మసతిన్ దరిజేరె రాముడున్"

సత్యముగాని వస్తువుల సత్యత గాంచెడి మోహశక్తి సాం
గత్యము చేసి, జానకిని గైకొని పోవుట మృత్యుదేవతా
నృత్యము లంకలో జరిగెనే! విలుదాలిచి, నాడు కూల్చి,యా
దైత్యుని రావణాసురుని: ధర్మసతిన్ జేరె రాముడున్

అవధానిభోజ వడ్డి శ్యామసుందరరావు, ఏలూరు

"సొరాగొనె శివుడు లోక సంరక్షణకై"

పారావారమున నందున
నారని పెనుజిచ్చువోలె హాలాహలమే
పారగ నద్దానిని 'మన
సొరా' గొనె శివుడు లోక సంరక్షణకై

తమ్మా సత్యనారాయణ, కాశిపాడు

"గద, గాండీవము, చక్రమున్, బరశువున్, గాంధీకి -శస్త్రాస్త్రముల్"

అదిరా! విశ్వము కన్నదా! వినినదా! యాయుద్ధమీపాటిదా!
కదనంబందున దేవతాళియును వీకన్ దాల్చునెవ్వేళలన్
గద, గాండీవము, చక్రమున్, బరశువున్; గాంధీకి శస్త్రాస్త్రముల్
కుదిరెన్ సత్యమహింసయున్ విజయముద్ఘోషించె నీ భారతిన్

నెమ్మలూరి సత్యనారాయణమూర్తి, టి.పి.గూడెం

"దుష్యంతుండు వరించె మేనకను సంతోషాబ్ధిలో దేల్చగన్"

భాష్యంబైనది కాళిదసకృతి జీవద్వాఙ్మయంబందు; వా
గ్భూష్యంబై యలరారుచున్నయది సమ్మోదమ్ము చేకూర్చుచున్
బొష్యశ్రీ యననొప్పుచుంట గని వహ్వా! కౌశికాపత్యమున్
దుష్యంతుండు వరించె; మేనకను సంతోషాబ్ధిలో దేల్చగన్

# దత్తపదులు

సర్వశ్రీ గొర్తి సత్యనారాయణమూర్తి, నరసాపురం

"శాంతి, భ్రాంతి, కాంతి, క్రాంతి సంక్రాంతిపై -కందం"

శాంతిపథమ్మున సాగుచు
భ్రాంతిని విడనాడవలయు భద్రాత్మకులై
కాంతిని జిందించును: సం
క్రాంతినిగల రంగవల్లికలు నానాటన్

ఉప్పలపాటి సూర్యచంద్రరావు, అష్టావధాని

"రేట్, వాట్, మనీ, మెనీ - భయంకరవర్షరాత్రి"

రేటెంతిచ్చినవిట్టి సౌఖ్యమిది నారీరత్నమా!లభ్యమా!
వాటీజంచు వచింతువేలనిదిగో వర్షానసీరాత్రి: యి
ప్పాటన్ రాగదె రా'మ నీ"కు బిడియంబా కౌగిలిన్ గూర్పవే
బోటీ వర్షమె నీకు నాకిచట సమ్మోదంబు సంధించెడిన్

మంకుశ్రీను, కొవ్వూరు - కల్లోల కాశ్మీరం

"హనన, ఖనన, జనన, మనన"

హననము నిత్యకృత్యమట యంటెను రక్తము భూమిపైని; సం
జనన నవీన కాంతులవి సాగెను నిచ్చలు శోణధారకున్
ఖననము సేసి ధర్మమును గాంతురె సౌఖ్యము కాశ్మిరాన? ఏ
మన, నగుబాటు కాదొకొ! సుఖాంతముగా గథ కంచి చేరునే!

తోలేటి పార్థసారథి, నరసాపురం

"చీమ, దోమ, నల్లి, పేను" శ్రీకృష్ణరాయబారం ఉత్పలమాల

'చీ! మ'తి చెడ్డదేల తమ సేమమునారయ జాలరేల; ఏ
'దో!మ'మకారమిట్లు మిము దోషపు మార్గమునందు నిల్పెనే
ప్రేమను జూపి వారు మును'పే ను'తికెక్కిరి పాండు పుత్రులా
భీమబలాఢ్యులాలమున వేయరె మిమ్ముల'నల్లి' బిల్లిగన్

అజ్జరపు సీతారామాంజనేయమూర్తి, నరసాపురం

"చేటి, పాటి, మేటి, తేటి" వేంకటేశ్వర వైభవం ఉత్పలమాల

చేటియ కాదు పూరుషుడు చిన్మయ రూపుని గొల్వబోవనా
పాటి యనన్వయంబగుట సర్వగుణంబులకిక్కయౌటచే
మేటి పవిత్ర దైవతము మిక్కిలి భక్తిని గొల్చు జిత్తమే
తేటియగున్ బదాబ్జముల తేనెలు గ్రోలగ వేంకటేశ్వరా!

ఐ.ఎస్.ఎల్.కె. రాజు

"భీమ, భీష్మ, కర్ణ, కృష్ణ" సీతారామకల్యాణం శార్దూలం

మానాంధుడట యాతుధాన కుల 'భీమ'త్వంబు మైదాల్చి శో
భా నైపుణ్యము జూపె 'భీష్మ'మతి సంభావించిశ్రీరాముడై
ఆనారీమణి కోసమై ధనువు 'కర్ణా'ంతమ్ముగా లాగి, సీ
తానాథుండయినాడు 'కృష్ణ'ఘనమున్ దార్కొన్నదా శంపయే

డా॥ వి.వై.వి సోమయాజులు, తణుకు

"నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, పోతన పచ్చదనం - పరిశుభ్రతపై తేటగీతి

ఇచట నన్నయ రచియించె హేల తోట
నీరుపోసెను తిక్కన సొరుమీర
ఎఱ్ఱనకు దక్కె గలుపుల యేరివేత
పోతనకు జిక్కె మధురస పూతఫలము

తెన్నేటి లక్ష్మీనరసింహమూర్తి, అర్థవరం

రామ, సోమ, భీమ, కామ - గౌతమబుద్ధునిపై ఉత్పలమాల

రామను వీడినాడట పరాత్పరునే మదియందు నిల్పి; యా
భీమ పరాక్రమమ్మును గవిత్వమునందు వచింపనేర్తుమే
సోమగుణంబు పల్కులను జూపెను మాటికి బోధచేసి; ని
ష్కామపథమ్ము బుద్ధునిది కాంత యశోధర యెంత ధన్యయో!

ఏలూరుపాటి ఆంజనేయశర్మ, ఏలూరు

ఐ,లవ్,యు కోక - పద్మవ్యూహంపై ఉత్పలమాల (కో.క=కోట, కడిమిళ్ళ)

ఆలము మించిపోయినది 'ఐ'దవ కాంతులు సన్నగిల్లె; మా
పొ'లవు'నా జయమ్మనుచు వారును వీరును జర్పసేయనా
బాలుడు తమ్మి మొగ్గరము పాల్పడి యా'యు'వు గోలు పోయె,గా
కోలము ధర్మ పాలనమొకో! కరవాయెను భ్రాతృ బంధముల్

తమ్మా సత్యనారాయణ, కాశిపాడు

"చిత్రము, శిల్పము, సంగీతము, సాహిత్యము నర్తకివర్ణన - శార్దూలం"

ఔరా! యద్ది సజీవ 'చిత్రమ'గునాయన్నట్లుగా దోచదే
తీరై 'శిల్పము' ప్రాణమున్ గొనుచు సందీపించె మాముందటన్
గీరంబుల్ పలుకాడినట్లుగను 'సంగీతమ్ము' విన్పించెన
య్యారే! నృత్యమునందు గన్పడియె భవ్యంబైన 'సాహిత్యము'ల్

కూచిభొట్ల సుబ్రహ్మణ్యా శర్మ

"భర్తృహరి, భట్టుమూర్తి, షేక్స్పియర్, మైథిలీచరణ్ వారి వైశిష్ట్యము చంపకమాల"

శరణము మాకు భర్తృహరి సంస్కృత భాషను నేర్పువేళనా
భరణము భట్టుమూర్తి పదవల్లరి కావ్యకళా తపస్వికిన్
విరచిత షేక్స్పియర్ కవిత వెల్లువ యాంగ్లమునందు మైథిలీ
శరణుడు రాష్ట్రభాష సువిశాలము చేసెను ధన్యులందరున్

తుమ్మిడి నాగభూషణం, భీమవరం

"తెలుగు, వెలుగు, జిలుగు, పలుగు స్వర్ణాంధ్ర ప్రదేశ్ చంపకమాల"

తెలుగుదనమ్ములో గలుగు దీయదనమ్ములు సందడింపనా
వెలుగుల వెన్నెలందున ప్రవేశము చేసిన స్వర్ణమబ్బు పై
జిలుగులనాంధ్రమాత యొకచిక్కని చక్కని రూపుదాల్చగా
పలుగును బట్టరా! శ్రమకు బట్టము గట్టుమ! జన్మభూమికిన్

జి. ప్రభాకర శాస్త్రి

"వాజపేయి, జార్జిబుష్షు, బెనజీర్, సోనియా రాజకీయంపై ఉత్పలమాల"

ఆతడు 'వాజపేయి' విజయమ్మునకాకృతి దాల్చినాడు వి
ఖ్యాతుడు 'జార్జిబుష్షు' మనసారగ వానిని మెచ్చినాడె; యా
నాతికి 'సోనియా' సతికి నమ్మిక యూగిసలాడె పగ్గముల్
చేతికి వచ్చునా! యనుచు జేడియ యా 'బెనజీరు' కుందగన్

ఎ. వేంకటరామలింగ కృష్ణశాస్త్రి

"పువ్వు, నువ్వు, లవ్వు, నవ్వు భారతార్థం ఉత్పలమాల"

నువ్వుల నీటినే విడుచునో! యిక కౌరవ కోటికెల్ల తా
బువ్వుల బాట చేసికొని పొందునొ! రాజ్యము నిశ్చయించి; లే
నవ్వులు గావు యుద్ధములనన్ జయమొక్కరి సొత్తుగాదు మే
లవ్వలివారి సొత్తగు యథార్థమటంచు వచించె గృష్ణుడున్

పీసపాటి

"అప్పు, తప్పు, మెప్పు, ముప్పు" నక్సలిజంపై ఉత్పలమాల

అప్పురపాళి వీడి యిటనాటవికత్వము పూనినారు మే
మెప్పుడు జూడలేదు గద! యిట్టి విచిత్రము త్యాగమిట్టిదా!
తప్పులు సేయువారలను దండన చేయగ దప్పుసేయుటే
ముప్పుగదోయి అన్న! వినుమో! కనుమో! జనమో! అరణ్యమో!

కోట్ల వేంకట లక్ష్మీనరసింహం, పంగిడిగూడెం

"సెప్టెంబరు, అక్టోబరు, నవంబరు, డిశంబరు" శరదృతువుపై ఆటవెలది

ఆశరత్తునందు 'నక్టోబరు'నయందు
మా'నవంబర'మున మధుర రుచులు
చినికి చెదరి పోయె 'సెప్టెంబ'రీవేళ
ఆ'డి శంబరా'రి యలరులేయు

గంటా సుబ్బలక్ష్మి

"కాలు, కీలు, కౌలు, కూలు" శ్రీ కృష్ణవర్ణన ఉత్పలమాల

కాలును బాపరాశి నిమగాంచిన తోడనె చిన్నకృష్ణ! నీ
కేలుటయే విలాసముగదే భువనావళినెల్లబ్రోచి గి
ర్కీలును గొట్ట రక్కసులు రేపును మాపునవర్జునాగముల్
కూలుట చిత్రమా! భవము కూలుట చిత్రమ! ముక్తి చిత్రమా!

కళా శ్రీరామచంద్రమూర్తి

"సార, నీర, గౌర, పార" - సప్తర్షి దౌత్యం ఉత్పలమాల

సారము మేనియందు రససారము పల్కులయందు నిల్పి నిం
డార వచించినాడట హిమాలయుడాదృతిమీర నాడు స
న్నీరము జిల్లుచున్ దనదు నెయ్యపు బట్టిని ముందు నిల్పుచున్
గౌరవమిచ్చుచున్ భవుని కాంతను బ్రోవుడటంచు బల్కెనే

రమణమూర్తి క్రొవ్విడి

"కవి, రవి, చెవి, భువి" భారతార్థం - కందం

కవిలోకము పూజింపగ
రవియై గీతార్థ సార రాజన్మణియై
చెవికింపును గలిగింపగ
భువిలో భారతము వ్యాసముని నిర్మించెన్

రామడుగు వేంకటేశ్వరశర్మ, గుంటూరు

"లారీ, మోటారు, కారు, బస్సు" సామాన్యుని స్థితి - మత్తేభంలో

ముదితల్ నేడు పు'కారు'లం బడుటయో! బుద్ధ్యున్నతుల్ కుందుటో
యిది 'మోటారె'డు కాలమైనది కదా! యివ్వేళ సామాన్యునిన్
బ్రిదులన్ జెసెడి లోకమయ్యె బొగ'లారీ' యారకున్నట్టి యా
బ్రదుకుల్ నిచ్చలునుస్సు'బస్సు'మనుచున్ బ్రాణావశిష్టంబులౌ!

వేమూరి నరసింహమూర్తి

"ఆజ్యము, రాజ్యము, భోజ్యము, త్యాజ్యము" - ఉత్పలమాల

రాజ్యము నీతి బాహ్యులకు రంగముగానలరారుచుండెన
గ్న్యాజ్య ముహుస్సమాగమ విహారమవార్యము కాగసాగె సం
త్యాజ్యములయ్యె ధర్మములు న్యాయము దప్పెడి దుష్టకోటికే
భోజ్యము రాజ్యమయ్యె ధనమో!బలమో! అధికారమూలమై!

గొర్తి సుబ్రహ్మణ్య శాస్త్రి, ఆగడాలలంక

"రూప, రస, గంధ, శబ్ద, లలితాదేవి వర్ణన - శార్దూలం

ఆ'రూప'మ్ము మనోజ్ఞమై హృదయమందావాసమున్‌జేయు; సం
ధ్యారూపమ్ముగ వాణియై 'రస'న్పై దాత్పర్యమొప్పార మం
దారంబై వెలయించి 'గంధ'ములు 'శబ్దబ్రహ్మమై నిల్చి; భా
షారాసిక్యమునిచ్చుమెచ్చు లలితన్ స్వాంతంబులన్ నిల్పమే!

మందారం వేంకటేశ్వరరావు, గుడివాడ

"వాజ్‌పేయి, ముషారఫ్, పుతిన్, బుష్" శంకర వర్ణన - ఆటవెలది

అచట 'వాజపేయ'మర్పింప శంకరు
నాపు తిను'టలెల్లనగును నిష్ఠ
యం'బు ష'ండములకె యానందమున్ బొందు
నా'ముషారపు'లను నణగ ద్రొక్కు
(ముషారపులు=దొంగలకు ఆశ్రయం ఇచ్చేవారిని పాలించేవారు)

ఎస్.ఆర్. భల్లం, తాడేపల్లిగూడెం

"జయమాలిని, జ్యోతిలక్ష్మి, సిమ్రాన్, స్మిత"
సాహితీ సమాఖ్యపై - ఆటవెలది

సరస కవిత మెచ్చి 'జయమాలిని'ని గూర్చు
'జ్యోతి లక్ష్మి'యగుచు శోభలీను
మురిసి మ్రాను' లైన ముచ్చటన్ దలయూచు
స్థితికి 'స్మిత'ము సాహితీ సమాఖ్య

కె. రామకృష్ణారావు

"గాంధారి, ద్రౌపది, రుక్మిణి సుభద్ర రామాయణపరంగా - కందం"

ఆరా'గాంధారి'ని నే
నారాముని మనసు భద్ర'మగునటు గొలుతున్
ఆ'రుక్మిణి'కా'ద్రౌపది'
కారాముని పత్నిసీత యాదర్శంబౌ!

డా॥ అబ్బిరెడ్డి పేరయ్యనాయుడు, శతావధాని-రాజమండ్రి

"విరి, మురి, సిరి, కరి" శాంకరిపై - కందం

విరిపొట్లము విప్పినటుల్
మురిపించుచునుండె దల్లి ముద్దులనిడుచున్
సిరియదియేగద! యా శాం
కరియే కరుణించెనేని గైతులు పండున్

# వర్ణనలు

డి. సీతామహాలక్ష్మి

"వేంకటేశ్వరునకు అభిషేకం చేస్తున్న స్త్రీభావన - మత్తేభంలో"

వకుళాదేవిని రామమాతననుచున్ భావింతునో! కృష్ణ మా
తకు రూపాంతరమంచునెంచెదనొ! సత్యమ్మైన తాదాత్మ్యమున్
నికటశ్రేణికి వచ్చి చేరినది తండ్రీ! యంచు బ్రార్థింపగన్
బ్రకటింపంబడె నీదు పుత్రతయు దేవా!వేంకటేశప్రభూ!

ఏలూరిపాటి అపర్ణ, ఏలూరు

"శివవర్ణ"న చంపకమాలలో

గరళము మ్రింగినాడట వికారము మోమున దోచకుండనై
శ్వరమది లోక రక్షణమె శాశ్వతమంచు దలంచినాడొ! యా
హరునకు బూజసేసెదము హారతి నిత్తుము కార్తికాన; సం
బరమున జేరరమ్మిటకు భాగ్యము మీకును మాకు నిచ్చులున్

కె. సత్య, కాకినాడ

"వివాహం నిశ్చయమై ముహూర్తమునకు మూడు నెలల వ్యవధి ఉన్నప్పుడు వరుని భావన "మానినీ వృత్తంలో"

మానిని చెంతకు జేరుట యెన్నడొ మానసమున్ మురిపించునటుల్
తేనెలు చిందెడి మాటలు పల్కుచు దీప్తిని జూపుట యెన్నడొకో!
నేనును దానును మేముగ మారుట నీరజ భాస్కర బంధముగా
నౌనట మూడునెలల్ గడువన్వలె న్యాయమె! కాలమె యాగినదా!

తుమ్మిడి నాగభూషణం, భీమవరం

"నేటి కాలపు పచ్చదనం" - ఉత్పలమాల

కాలములోన బల్లవము కానగ రాదిదియేమి వృక్షముల్
లాలిత మంద మారుత విలాసము జూపక నిల్చెనేమి; పో
గాలము వచ్చె శోభలకు గల్మష వాయువులంటియుంట; అం
దాలకు బట్టు కొమ్మయగు దత్త్వము భూమికి దూరమాయెనే!

జటావల్లభుల విద్యారణ్యస్వామి, కైకరం

"శతావధానం చూచే యువకులు స్పందన -మత్తకోకిల"

కైతలోపల డాగియున్నవి కమ్మనైనవి మాధురుల్
చేతమయ్యది పల్లవించెను జిత్రమైనది కాలమే
ఆతతమ్ముగ బుస్తకమ్ములనారయన్వలె బిల్లలున్
ఈతరమ్మునకంద జేయగనీకవీశులు పుట్టిరో!

బూర్గుల మురళీకృష్ణ, తాడేపల్లిగూడెం

"నెమ్మలూరివారు, వడ్డివారు, భారతంవారు ఆకాశంవారు ప్రస్తావింపబడుతూ శతావధానంపై పద్యం - ఆటవెలది"

నెమ్మలూరివారి నెమ్మది చూడంగ
భారతమ్ము గుర్తువచ్చె మాకు
అసలు వడ్డి గూడి యాకాశమంతయై
జంటకవులకిడెను సంతసంబు

ఎం.కె. నారాయణమూర్తి

"తిరుపతి వేంకటకవులు మీ శతావధానానికి వస్తే! - సీసపద్యం"

తిరుపతి వేంకటేశ్వరులు వచ్చిరియేని
నానందమంబరంబంటుగాదె!
వారి దివ్యాశీస్సు వర్షించుననగానె
మోదమేఘంబులు ముసురుకొనవె!
మీసాలు పెంచిన మేటిధీరులు వార
లరుదెంచుటన్న భాగ్యంబు గాదె!
"బ్రహ్మయే గురువుగా బరమార్ధమును జూప
రచనలే గంగలై రాణగొనవె"
పిన్న వారము మమ్ము దీవించు కొఱకు
స్వర్గమును వీడి భువిపైని బదములూని
పదములిత్తురు కవన శోభాకరములు
కరములను మోడ్చెదము జంట కవులమేము!

కొత్తపల్లి ఉదయబాబు

"కార్యదర్శి, సాహితీ సమాఖ్య, తాడేపల్లిగూడెం. చంద్రబాబు దశరథుడై మిమ్మల్ని అడవులకు పంపితే" - ఉత్పలమాల

వేనట రామచంద్రునట నిష్ఠగ జంద్రుడు తండ్రియంట తా
గానల పంపగోరెనట కాంతయు దానిట జేరునేమొ! మా
మౌనిత యెట్లు సాగునట మాయురె! మీసల వీరులుందురో!
కానలయందునన్నలును గాపురముందురొ! యెట్లు నిల్తుమో!

శ్రీ వడ్డి శ్యామసుందరరావు, ఏలూరు

"శతావధాన వేదికను ఎక్కేముందు అవధానుల భావన" - చంపకమాల

ఒకరుసమస్యనిత్తురట యొక్కరు దత్తపదమ్ములిచ్చి వే
రొకరట వర్ణనాంశములనూహకునందని రీతినిచ్చి; యీ
సకల శతావధానమున జాణతనమ్మును జూపుచుండగా
వికలముగాని ధోరణియు విజ్ఞతగూర్చవె! తల్లిభారతీ!

వేములపల్లి సృజన

"నాటి రచ్చబండలే నేటి న్యాయస్థానాలైతే" -ఆటవెలది

రచ్చబండలపుడు రక్షించె జనపాళి
రచ్చకెక్కినారు ప్రజలు నేడు
న్యాయగతులు దప్పెనన్యాయమేపారె
మర్మమెఱుగరాని ధర్మమాయె!

టి.మేరీ

"నేటి యువత ఆటపాటలు" - మత్తేభం

అమితోత్సాహముతో క్రికెట్టునకు దావ్యాలోలుడై నిల్చు సం
గమమున్ జేయునుఫాన్సుతోడనటులే కంప్యూటరే తోడుగా
శ్రమకుం దాను దిలోదకమ్ములిడుచున్ రాణింపగా గోరు జం
దము కన్పట్టెను నేటి యీ యువత చిత్తమ్మిట్లు పాడాయెనా!

జంధ్యాల సుమన్‌బాబు

"సత్యసాయి బాబాపై" - ఆటవెలది

కంటిచూపు జూపి కాలమ్మునే మాపి
సేవ చేయునట్టి చేతినెంచి
ఆత్రిమూర్తులొక్కటైనట్టి రీతిగా
సత్యసాయి వెలసె శాంతి విరిసె!

జంగా గోపాల్

"ఆత్మసౌందర్యం' - తేటగీతి

ఆత్మసౌందర్యమే హృదయంగమంబు
పలుకు బలుకంగ జాలమాపట్టునందు
దేహసౌందర్యమందున దీప్తిజారు
దరిగిపోనిది యాత్మ సౌందర్యమొకటె

పెరుమాళ్ళు సీతారాం

"సరస్వతీదేవి వర్ణన" - కందం

వరవీణా మృదుపాణికి
కరకంకణ రవము మిగుల గమ్రతగూర్పన్
స్వరసంధాన విధానము
సురచిర సంగతులనానె శోభలనీనెన్

ఎం.వి.గోపాల్‌రాజు, తాడేపల్లిగూడెం

"గ్రంథాలయాలు సరస్వతీ నిలయాలు" -కందం

పలుకుల వార్నిధులన్నన్
బొలుపుగ గ్రంథాలయాలె ముచ్చటపడుచున్
పలుకులలోగల మర్మము
నలవోకగ జదువవలయునయ్యా! వినుమా!

గాదిరాజు రంగరాజు, చెరుకువాడ

"టెలివిజన్‌పై" -కందం

విధియో! యిది దుర్విధియో!
సుధయో! విషయో! యెఱుంగ సుజనులకైనన్
కుదురునొకో! చిత్రముగా
అధికారము టెలివిజన్పె ఆర్జించెగదా!

కె.ఎస్.ఎస్. రామానుజశాస్త్రి

"గోదావరిపై" - ఉత్పలమాల

ఆవరి పండ జేసినది యావిరి జేసెను గాటకమ్ము వి
ద్యావరివస్య జేయగల దక్షులకయ్యది పుట్టినిల్లు శో
భావిభవమ్ముతో గదలి పాఱును రాజమహేంద్రినాని గో
దావరి రావురిన్ గనెను దానికి మ్రొక్కి నుతింపకుందుమే!

పి. కృష్ణశాస్త్రి

"శివవర్ణన" - కందం

శివలింగము పత్రమయం
బవునే గద కార్తికముననాభవు మ్రోలన్
నివసించెడి యీ జనులకు
భువియేగద మోక్షసీమ పుణ్యాత్మకుడా!

సుంకర వెంకట్రామయ్య, జీలుగుమిల్లి

"తెలుగుతల్లిపై అచ్చతెలుగులో" కందం

అలిబిలి పలుకుల తోడన్
బిల బిల నడయాడునట్టి వెలుగుల తల్లిన్
పలుకుల పూలన్ జల్లుచు
సలిపెదమా వరవుడమును సందడితోడన్

కోటద్యుమణి, తణుకు

"అమ్మవారు అలంకరణతో సిద్ధం శివుడు రాలేదు" అమ్మవారి ఆలోచన - ఉత్పలమాల

కట్టిన చీరయా నలిగె గంటను గాటుక జారవచ్చెనిం
కెట్టుల సైచుదానను మహేశ్వరుడా తడవైన సంగతిన్
బట్టకయుండె భక్తుడటు బాధల గుందుచునుండ శూలమున్
బట్టడదేమి యంచు హిమవత్సుత యూగినసలాడ జొచ్చెనే!

శ్రీరఘునాథ్

"రమణ మహర్షిపై" -కందం

అరుణాచల పతి చూడగ
దిరుగాడెను గాదె రమణ దీక్షామతియై
స్థిరమను కొనునది నిజము
స్థిరమని తావిశ్వసించి సేవించె శివున్

కనకవల్లి

"క్రొత్తగా అత్తవారింటికి చేరుచున్న వధువు మానసిక స్థితి-మత్తకోకిల

మెట్టినింటికి జేరబోవుట మీదుమిక్కిలి ముచ్చటే
పుట్టినింటిని వీడలేనిక మోదమెట్టులు కల్గునో
అట్టులిట్టులనిట్టులట్టులనంతరంగమె యూగెనే
చెట్టపట్టిన వాడి కన్నులు చేయుచుండెను సైగలన్

గుళ్లపల్లి వెంకటరాయయ్య

"యువతకు సందేశం" - చంపకమాల

అరయగ సంస్కృతి ప్రతిభ యందము గూర్చెను భారతాన; సుం
దరతర రామలక్షణ సుధా పరిపూతయు భారతాంబ; యు
ర్వరనొక కీర్తి గొన్నది ప్రభల్ విరజిమ్ముచు మేటి సంస్కృతుల్
వరమని నమ్మిగా వలయు వైభవమే నిలబెట్టగావలెన్

టి. బలరామ్

"సీతను అడవిలో విడిచినప్పుడు లక్ష్మణుని మనోవేదన" - ఉత్పలమాల

గుండియ బండబారినది కూడని ధర్మమునాచరించి తా
మండుచునుండె మానసము మానిని వీడుట ధర్మమౌనె నీ
రెండదు సీత కన్నుల హరీ! విధి చోద్యము గాకయేమి నీ
రెండకు గందిపోవు సతి యిచ్చట కానల గ్రుగ్గిపోవుటా!

...మశ్రీ తాడేపల్లి వెంకన్న, టి.పి.గూడెం

"మందుపాతర్లవలన, ఎన్‌కౌంటర్ల వలన చనిపోయిన వ్యక్తుల కుటుంబములపై" - చంపకమాల

అడవిని జేరు భర్తకట యాయువు మూడెను వృత్తిలోన గా
రడవిని బండువెన్నెలయి యాత్మనివేదనమే ఫలమ్ముగా
విడివడినారు భార్యలు స్రవించెడి కన్నులతోడ బిల్లలున్
ముడివడినారలా బ్రదుకు ముచ్చటలచ్చటలారిపోయెనే?

రాజు, టి.పి.గూడెం

"సాహితీ సమాఖ్యపై" - తేటగీతి

శారదాదేవి పులకించె సభలయందు
శ్రీలునిండారె గవులకు జేబులందు
ఈ సమాఖ్యకు వందనాలేము జేసి
జంటకవులైనయట్టి మా సరణి గనుడు

## జంట పక్షులు

కేసాప్రగడ సత్యనారాయణ, రాజమండ్రి

ఉ॥ జంటశతావధానము రసజ్ఞులుమెచ్చగ పూర్వమెప్పుడో
కంటనుహర్షబాష్పములు క్రమ్మగ (పృచ్ఛకలోడి మెచ్చని (తిర్పతి, చెళ్లపిళ్ళ)
ష్కంటకవృత్తిచేసిరని కావ్య విమర్శకు లెల్లచెప్పగా
వింపిమికాని, చూచితనివింగను భాగ్యములేకపోయెగా!

శా॥ తాదృగ్రూపువధానప్రక్రియను శ్రద్ధన్ మేమువీక్షింప,వా
ణీ దేవీ కరుణా విలాస కలితా స్వీక్షాకటాక్షంబునన్
ప్రాదుర్భూతము చేసిమీరనొక సావర్ణవకాశంబుగా
తాదాత్మ్యంబొనరించినారు మముహ్లాదంబందుముంచెత్తుచున్॥

ఉ॥ పండిత వర్యులారా! సముపార్జిత రమ్య వికాసభాసురో
ద్దండువికాసులార! కవితా లహరీయుగాళావదాన దీ
మండనమూర్తిలార! ఆసమాన సుపద్యవనీవిహారకా
రండవులార! శారద నిరంతర సౌఖ్యములిచ్చుణవుతన్

శా॥ వ్రావ్యగ్గీరదపుంజ సంజనితధారాసారవేగ క్రియన్
తీవన్సాగ గమీవధాన మిటుతాడేపల్లిగూడెంబునన్
తాలీక్షింపగవచ్చి శారదయొ హృత్పద్మంబులన్నిల్పి, యీ
భావామోదిత హృద్యపద్యములనే వర్షించెనానిచ్చటన్॥

ఉ॥ రాయలునేడుకల్గిన నిరంతర భక్తిని యందలంబులన్
శ్రీయుత కీర్తితో నధివసింపగచే యుచుకొమ్ము కాయుచున్
మోయుచుమిమ్ము నిర్భరనమోఘముగా స్తుతిచేయకుండున్!
ఆయతమేర్తిశాలురని హారతి నిత్యముపట్టకుండున్!

కం॥ కడిమిళ్ళ కోట కవులొక
గుడికట్టి, యచటి వధాన గోపురమందున్
నడయాడుచునొక గూటిని
వడి విహరించెదరు జంట పక్షులవోలెన్॥

# అవధాన చంద్రిక



పద్యమ్మునెవఁడురా ; పాతిపెట్టెదనంచు
నున్మాదియై ప్రేలుచున్నవాఁడు ?
పద్యమ్మునెవఁడురా ; ప్రాతవడ్డదియంచు,
వెఱ్ఱివాఁడై ; విఱ్ఱవీగువాఁడు ?
పద్యమ్ము ఫలమురా ! పాతిపెట్టిన ఁబెద్ద
వృక్షమై పండ్ల వేవేలనొసఁగు ;
పద్యమ్మునెప్పుడో పాతిపెట్టితిమేము
లోకుల హృదయాల లోతులందు ;

ఇప్పుడద్దానిఁ బెకలింపనెవరి తరము ?
వెలికి తీసి, పాతుట యెంత వెఱ్ఱితనము !
నిన్నిటికి మున్ను మొన్ననే కన్ను దెఱచు
బాల్యచాపల్యమునకెంత పదఱు తనము !

డా॥ కడిమిళ్ళ